క్రొత్త

# పాలతో కూడిన
# ఫారెక్స్
# ఘన ఆహారం

## అధిక రుచికరం
## అధిక సంపూర్ణం




**ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు పాపాయి పెరుగుదలకు మంచిది.**

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.
కలపడం సులభం. పాపాయికి తినిపించడం సులభం.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రోటీన్‌తో సమృద్ధం. ఆరోగ్యవంతమైన రక్తంకోసం అదనంగా ఐరన్ కలిగినది. గట్టి పళ్లు, ఎముకలకోసం సరియైన నిష్పత్తిలో కాల్షియం మరియు ఫాస్ఫరస్ కలిగినది. పాపాయి సున్నిత జీర్ణశక్తికి అనువుగా ముందుగానే పచనం చేయబడినది.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

ప్రతి చెంచాలో అధిక సంపూర్ణ ఘన ఆహారం.

CLARION/B/GX/3/234 Tel

# అమృతాంజన్ లిమిటెడ్

## 90 సంవత్సరాల పైగా గృహౌషధాలు తయారు చేస్తున్నారు!

- **అమృతాంజనం బాధానివారిణి**
  తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.
- **అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్**
  పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.
- **అమృతాంజన్ డెర్మల్ ఆయింట్ మెంట్**
  తామర, తీట, గజ్జి వగైరాలకు.
- **అమృతాంజన్ పెక్టోమిక్స్**
  దగ్గుమంచి వెంటనే ఉపశమనమునకు కాఫ్ మిక్చర్.
- **శ్వాస్ మింట్ బిళ్లలు**
  నోటినీ గొంతుకునీ శుభ్రంగా ఉంచేందుకు

- **అమృతాంజన్ ఇన్‌హేలర్**
  జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ములు వగైరాలకు.
- **అనోలియమ్—కోల్డ్ రబ్**
  దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి.
- **కాలోఫెన్—బాధానివారిణి మాత్రలు**
  తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు.
- **అమృతాంజన్ కాస్టర్ ఆయిల్**
  శుద్ధి చేసిన, వాసనలేని స్వచ్ఛమైన ఆముదం.

**అమృతాంజన్ లిమిటెడ్**
మద్రాసు-4

....ఇండియాలోను,
ఇతర దేశాలలోను
పేరుపొందినది.



## ముఖచిత్రం

సినీ స్టార్స్ ముఖ చిత్రాలతో విసిగెత్తిన మాకు 17.8.84 నాటి ముఖ పత్ర సుందరులు- మా మనోరథాన్ని అధిషించిన "అనూరాధ" హృదయాన్ని రంజింపజేసిన 'జయశ్రీ' సంతోషాతిరేక "శిరీష" పుష్పాలతో మనోల్లాసం కలిగించి ఆనందాభిషేకం చేశారు.

పి. బి. గీత, జంబూవట్నం



24.8.84 నాటి మా అభిమాన "ఆంధ్రపత్రిక" ముఖ చిత్రం చూడగానే ఎడారిలో ఒయాసిస్సులా, కళ్ళకు "రిలీఫ్" ఇచ్చింది. చిత్రకారుడు డా. మురళీ కృష్ణారావు గారికి అభినందనలు.

విజాపురపు వెంకటరావు, కరడాల రాఘవేంద్రాచార్యులు, జగ్గయ్యపేట,

## కిర్లియన్

కిర్లియన్ అను శాస్త్రజ్ఞుని ద్వారా 1939 వ సం. లో కనుగొనబడిన "జీవులలోని జీవకాంతి" అనే శాస్త్రీయ విషయమును బి. వి. పట్టాభిరామ్‌గారు ప్రతి ఒక్కరికి అర్థమయ్యేట్టు తెలిపినందున నా ప్రత్యేక "అభినందనలు."

మహ్మద్ ఎజాస్, ఇల్లెందు

## అద్దం పట్టేవి

వార పత్రికలో నన్ను అమితంగా ఆకర్షించేవి ఊమెన్ కార్టూన్లు, డా. జయ్ దుబాషీగారి ఢిల్లీ లేఖ. సున్నిత హాస్యంతో దేశ రాజకీయాలకు అద్దం పట్టేవి ఊమెన్ కార్టూన్లయితే, తన సహజ ధోరణిలో విమర్శిస్తూ వ్రాసే వారు డా. జయ్ దుబాషీ. ఊమెన్ లేని లోపం పూర్తిలేనిదేమో!

సమ్మెట గోవర్ధన్, హన్మకొండ




## సొల్లు కబుర్లు-తూకం

17.8.84 తేది సంచికలో రామలింగం మద్రాసు వారి లేఖను చదివాక యీ లేఖను రాయాలనిపించింది.

కేవలం కాంగ్రెసునే.....దాన్నే అంటిపెట్టుకుని పూజారితనం చేస్తూ.....తప్పులు తడకలు చేస్తున్నా..... క్షమిస్తూ దానికే ఓటు పీట వేయాలి గాని.....యింక వేరే వారికి ఎక్కడిది యీ దేశాన్ని వుద్ధరించే అర్హత? అన్నట్టు వుంది.

వారికి కాంగ్రెసుమీది గౌరవం అట్లా వుండొచ్చు గాక..... కానీ ఎన్టీఆర్ వ్యక్తిత్వంను తగ్గిస్తూ చిత్రీకరించడం ఎవరికైనా ఆగ్రహం కల్గిస్తుంది.

పరిపూర్ణ వ్యక్తి అయ్యాక, ఎంతో విలువైన వృత్తిని (కోట్ల రూ...లు) వదులుకుని దేశానికి సేవ చేస్తుంటే..... యిప్పుడు ఆయనగారి అవినీతి ఏవిటో, తప్పులు ఏమిటో కనిపెట్టి ఆ తప్పుల్ని ఎంచాలి గాని - ఎప్పుడో చందాలు యివ్వలేదు...మీటింగ్లల్లో సూట్లు తీసుకు వెళ్ళాడు యిలాంటి సొల్లు కబుర్లు విని ఆయన వ్యక్తిత్వాన్ని తూకం వేయడం సబబా??

వి. ఆర్. మూర్తి, కడప

## సంధిగ్ధము

29.6.84 ధర్మపథం శీర్షికలో - విద్య, ఐశ్వర్యం, ఆయుర్దాయం, ధనం, పుణ్య పాప కర్మలు ఇటువంటివి "పుట్టుకకు ముందే శిశువు గర్భంలో ఉండగానే సృష్టికర్త చేత నిర్ణయింపబడతాయి. వాటిని తప్పించడానికి సృష్టి చేసిన బ్రహ్మకు కూడా సాధ్యం కాదని లలాట లిఖితా రేఖాపరిమార్ష్యం నశవ్యతే - నుదుటన వ్రాసిన వ్రాత మాయగలదే నూరేండ్లు చింతించినన్ అని చెప్తూ ఉంటారని చెప్పిన వారే-

27.7.84 పత్రిక ధర్మపథం శీర్షికలో "ఆయుస్సును గురించిన అధికారం బ్రహ్మకే ఉన్నది. దాన్ని పొడిగించడం, తగ్గించడం అతని ఇష్టానిష్టాల మీదనే ఆధారపడి ఉన్నదని" కూడా వ్రాసినారు.

ఈవిధముగా ఆయుస్సు విధి లిఖితము. దాన్ని బ్రహ్మ కూడా తప్పించలేడనీ, ఆయుస్సును పొడిగించటం, తగ్గించటం అతని ఇష్టాయిష్టాలే అని ప్రచురితమైన శీర్షికలు సంధిగ్ధముగా నున్నవి.

టి. విశ్వనాథ్, జె. కె. పూర్ (ఒరిస్సా)

## స్వేచ్ఛ!

10.8.84 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో న్యూఢిల్లీ లేఖ ఓల్ గానే ఉంది.

జయ్ దుబాషీ "స్వేచ్ఛా" ద్వీపం స్వేచ్ఛగా దోచుకునే షార్క్‌కు నచ్చేదే. స్వేచ్ఛా వ్యాపారానికి, స్వేచ్ఛకి ఎంతటి అనుబంధమో! వాపారుల స్వేచ్ఛ కార్మికుల బానిసత్వం.

ఫాసిజం, కమ్యూనిజం రెండూ ఒకటైతే ఎందుకు తలపడ్డాయో! తామరాకుమీది నీటి బొట్టులాంటి జయ్ దుబాషీ చెప్పే స్వేచ్ఛా వ్యాపారాన్ని కాపాడుకోటానికే ఫాసిజం.

సుష్టు అయ్యే "బ్రేక్ ఫాస్టు", పాలు, పళ్ళూ, ద్రాక్షలోంచి తీసే మాదక పానీయాలు, స్వేచ్ఛా వ్యాపారమూ, విప్లవ విద్వేషమూ.....

భేష్! జై జయ్ దుబాషీ!

జె. నాగేశ్వరరావు, నాగులపాడు

## బాగుంది

జయ్‌దుబాషీగారి "కమ్యూనిస్టు సముద్రములో ఒక పాశ్చాత్య ద్వీపము" చాలా బాగుంది.

కె. వి. కిషోర్‌కుమార్, నరసరావుపేట.

## ఆశ

మా యొక్క యంగ్ స్టార్ డైనమిక్ హీరో "చిరంజీవి" ముఖ చిత్రం పబ్లిష్ చేస్తారని ఆశిస్తూ-

కట్టా రామకృష్ణ, ఇల్లందు

## గడువు పొడిగింపు

'వేయి పడగలు : భాగవత తత్త్వం' అన్న విషయమ్మై వేయి రూపాయల బహుమతితో కులపతి సమితి నిర్వహించే గ్రంథ రచన పోటీకి రచనలు పంపవలసిన గడువును పలువురు రచయితల సూచనల ననుసరించి 1984 సెప్టెంబరు 30 తేదీ వరకు పొడిగించబడింది. రచయితలు ఈ అవకాశాన్ని ఉపయోగించుకోవలసిందిగా కోరుతున్నాము.

ఏ. భూమయ్య, కులపతి సమితి, 15-729/1
రామన్నపేట, వరంగల్-506002

# ప్రెస్టీజ్ ఒక్కటే
# 100% భద్రమైనది

# జి. ఆర్. ఎస్. ఒక్క
# ప్రెస్టీజ్‌కే కలదు గనుక










**ప్రెస్టీజ్‌కి జి.ఆర్.ఎస్. 100% భద్రతను ఎట్లా చేకూరుస్తుంది?**

గాస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక అద్వితీయమైన భద్రతా సాధనం. అది మూతలో రబ్బర్ గాస్కెట్‌కు సరిగా పైనగల ఒక రంధ్రం. ఆవిరి ఒత్తిడి అధికమైనప్పుడు జి. ఆర్. ఎస్. రబ్బర్ గాస్కెట్‌ను సాగేటట్లు, రంధ్రంనుంచి బయటకు విస్తరించేటట్లు చేసి, ఆవిరిని క్రిందివైపునకు విడుదలచేస్తుంది. అంత తేలిక. అంత సులభం. 100% భద్రత.



**అయితే అన్ని ప్రెషర్ కుక్కర్లు భద్రమైనవి కావా?**

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చినపుడు మీకు నకిలీది లభించవచ్చు ఇది అత్యవసర సమయాలలో పనిచేయదు దురదృష్టవశాత్తు సేఫ్టీప్లగ్ నకిలీదో, అసలైనదో మీరు గుర్తించలేరు. ప్రమాదాన్ని ఎందుకు కొని తెచ్చుకోవాలి. జి.ఆర్.ఎస్. ఎన్నడూ విఫలంకాదు. అది 100% భద్రతను నిశ్చయంగా ఇస్తుంది.



**జి. ఆర్. ఎస్. లేకుంటే ఏమౌతుంది?**

నకిలీ సేఫ్టీ ప్లగ్‌లు పనిచేయకపోవచ్చు. వెయిట్ వాల్వ్‌లోని రంధ్రాలు పూడుకుపోవచ్చు ఒకవేళ ఆవిరి ఒత్తిడి ఎక్కువైపోతే, తక్షణం దానిని విడుదల చేయగల, వైఫల్యంలేని భద్రతా విధానం మీకు కావాలి. అందుకే జి.ఆర్.ఎస్. రూపొందించ బడింది .మీ ప్రెషర్ కుక్కర్‌ను భద్రమైనదిగానేకాదు, అత్యంత భద్రమైనదిగానేకాదు. 100% భద్రతకలదానిగా చేసేందుకు




**సొమ్ము ఆదా. మన్నిక మరియు సర్వీస్- ప్రెస్టీజ్ విధానం!**

ఎక్కువ వంటకానికి స్థలాన్ని సమకూర్చి, సమయాన్ని. ఇంధనాన్ని ఆదా చేయడంలో మీకు తోడ్పడటానికి అనువుగా క్రొత్త ప్రెస్టీజ్‌కి చక్కగా అమర్చబడిన పైమూత కలదు. హెవీగేజ్ అల్యూమినియంతో నిర్మించబడిన క్రొత్త ప్రెస్టీజ్ పెక్కు సంవత్సరాలపాటు పనిచేస్తుంది. కాగా, దేశమంతటా నెలకొల్పబడిన ప్రెస్టీజ్‌వారి విక్రయానంతర సర్వీసు కేంద్రాల ఫలితంగా సమర్థమైన సర్వీసు లభించగలదని మీరు రూఢిగా నమ్మవచ్చు

## క్రొత్త ప్రెస్టీజ్

ప్రతి కుటుంబానికి కావలసిన సైజులలో లభ్యమౌతుంది.

ttk తయారీ.

MAA(S) TTP 1B TEL 84

### గమనిక

ప్రచురణ వ్యయం విశేషంగా పెరిగినందున "ఆంధ్రపత్రిక" సచిత్రవారపత్రిక విడి ప్రతి వెల 21-9-84 సంచిక నుంచి రు. 2/-చేస్తున్నామని గమనించి, పాఠకులు, ఏజెంట్లు మాతో సహకరించవలసిందిగా కోరుతున్నాము.

—బిజినెస్ మేనేజర్



### సంతాపం

ప్రఖ్యాత రాజకీయ వ్యంగ్య చిత్రకారుడు ఊమెన్ మృతికి నా ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తున్నాను

మానేపల్లి సత్యనారాయణ ఎడిటర్–అవగాహన, విజయనగరం

## బాధ

ఈమధ్య మీ పత్రికలో వచ్చిన 'తాజ్ మహల్ సౌందర్యం మాటున' అన్న శీర్షిక చదివి చాల బాధ కల్గింది.

గుండెలే బండలుగ పేర్చి కళకూ, శ్రమకూ వారధిగా ప్రపంచ సౌందర్యాలలో అపరూపంగా ఎన్నో వేల మంది కళాకారులు, శ్రమ జీవులు నెత్తురు చమట లోడ్చి తీర్చి దిద్దిన మహోన్నత కట్టడం తాజ్ మహల్! 'తాజ్ మహల్ అందం కాదు, దానికి రాళ్ళెత్తిన కూలీల శ్రమ సౌందర్యాన్ని చూడాలంటూ' శ్రమైక శక్తికి అక్షర నీరాజనాలర్పించిన మహాకవి శ్రీశ్రీ మనకీ నాడు లేడు.....కానీ, 'ఆ రాళ్లెత్తిన కూలీల కుల మతాల్ని బేరీజు వేసే కుసంస్కారానికి రచనలు దిగజారుతున్నాయంటే, అలాంటి వాటిని ప్రచురిస్తున్నందుకు మీ కెలా ఉందో గానీ, చదువు తున్నందుకు మాకు మాత్రం సిగ్గుగా ఉంది! మతం పేరిట దేశం నలు మూలలా మారణ హోమం చెలరేగుతూన్న ఇలాంటి విషమ పరిస్థితుల్లో సమాజాన్ని చైతన్యవంతం చేసే రచనల్ని ప్రోత్సహించి, ప్రచురించవల్సిన మీరు ఇలాంటి రచనల్ని ప్రచురిస్తున్నందుకు సాటి తెలుగువాడిగా సిగ్గుతో తలవంచుకొంటున్నాను.

'రచనా సౌందర్యం మాటున'..... డిగ్రీల విజ్ఞానం మాటున మానవుని ఆలోచనా దృక్పథంమీద విషాన్ని చల్లడం కంటే, నైతికంగా మనిషిని ఉత్తేజ పరిచి సమాజాన్ని మహోన్నతంగా తీర్చి దిద్దటానికి ప్రయత్నించాలి ఇకనైనా, రచయితలు.

**తేజస్విత, కడప**

### సంతోషం

ముఖచిత్రం నా అభిమాన నటి జయప్రద ఎంతో ఆకర్షణీయంగా వేసినందుకు చాలా సంతోషిస్తున్నాము

చిప్పాడ ఉమా మహేశ్వరరావు, కురుపాం.

## మనవి

రచయిత(త్రు)ల చిరునామాలు వారి అనుమతి లేకుండా ఇతరులకి ఇవ్వడం సాధ్యం కాదు. కాబట్టి వారి చిరునామాలు తెలియ చేయమని మాకు రాయవద్దని మనవి. వారికి రాసే ఉత్తరాలకి ఆయా రచయిత(త్రి) పేర కేరాఫ్ ఆంధ్రసచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపితే వాటిని మేము వారికి రీడైరెక్ట్ చెయ్యడానికి ప్రయత్నిస్తాము. సం.


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం · 1908

శివలెంక శంభు ప్రసాద్
సంపాదకుడు :
(1938-1972)

శుక్రవారం : 14-9-'84
శ్రీ రక్తాక్షినామ సం భాద్రపద బ. చవితి

సంపుటము 77 : సంచిక 2

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 1-80 |
| ఆరు మాసాల చందా | రు. 46-80 |
| పోస్టులో ఏడాది చందా | రు. 101-40 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003.


### విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి "రాధ"
(ఫోటో : ఎం. కె. రామమూర్తి)

### కథలు :



### సీరియల్ నవలలు :



### వ్యాసాలు, శీర్షికలు :

# ముందు మన మీద మనకి నమ్మకం ఉండాలి




డెబ్బయి అయిదు కోట్లమంది భారతీయులు. వీళ్ల ప్రతినిధులే లాస్ ఏంజిలెస్‌లోని ఒలింపిక్ ఆటలకి వెళ్లారు. క్షేమంగానే తిరిగి వచ్చారు. కొద్ది బెణుకులు, మరికొన్ని చితికిన అహంకారాలూ మినహాయిస్తే- కాని వాళ్ళు ఏమి సాధించినట్లు? మనకన్నా చిన్న దేశాలయిన డెన్మార్క్ కూడా ఒక పతకం సంపాదించుకుంది. మనమో? ఉత్తి చేతులతో తిరిగి వచ్చాము. ఇంత పెద్ద దేశం ఈ ఆటలలో పాలుగొననే లేదా? ఆటలు మనని తప్పించుకొని వెళ్లిపోయాయా?

ఒలింపిక్ ఆటలలాగే చరిత్ర కూడా మనని తప్పించుకుని వెళ్లిపోగలదని నా అనుమానం. లేకపోతే, ఈ 37 సంవత్సరాలలో మన దేశం సాధించినదంతా ఇంతేనా? మనం క్రీడారంగలో వెనుకబడి ఉన్నాం. పరిశ్రమలలో మాత్రం వెనుకపడి లేమూ?

నలభయి ఏళ్ల కింద మనం జపాన్ కన్నా ఎక్కువ ఉక్కు తయారు చేసే వాళ్లము. ఇవాళ జపాన్ ఉక్కు ఉత్పత్తి మన ఉక్కు ఉత్పత్తి కన్నా దాదాపు వది రెట్లు ఎక్కువ. అంతే కాదు. ఈ దేశం పారిశ్రామికోత్పత్తిలో ప్రపంచలోనే మొదటి స్థానం ఆక్రమించేట్లు ఉంది మరొక దశాబ్దంలో. (ఇంకా ముందుగానే కాకపోతే)

పరిశ్రమల సంగతి సరే, వ్యవసాయం సంగతి ఏమిటి? హాలాండు, డెన్మార్క్ లాంటి చిన్న దేశాలే మనకన్నా ఎక్కువ వ్యవసాయోత్పత్తి కలిగి ఉన్నాయి!

చీనా వాళ్ళు ఆకలి బాధ తప్పించుకునేటంత ఆహార ధాన్యం పండించుకుంటున్నారు. మన జనాభాలో సగం పయిన "దారిద్ర్య రేఖ" కిందనే ఉన్నారు. మనం ఏమి చేశామని చరిత్ర మనని గుర్తించాలి?

మనం ఏమీ సాధించకపోవటానికి ప్రధాన కారణం మన మీద మనకి నమ్మకం లేకపోవటమే. మనకి బోలెడు ఆలోచనలు. ఏ ఒక్కటీ మన స్వంతం కాదు. మనం డబ్బు కూడా అప్పులు చేస్తాము. ఇక మనకి ఈ అప్పు తీసుకున్న డబ్బు మీద అదుపు ఉండదు కదా! అప్పుల వాళ్ల ఆదేశాలని పాటిస్తాము. వాళ్ళు మన శ్రేయోభిలాషులు కాకపోవచ్చునన్న భావమే మనకి రాదు. ఎటు పోవాలో తెలియటం ఒక ఎత్తు. అవతల వాళ్ల సలహా తీసుకుని అటు పోగలగటం మరొక ఎత్తు. స్వావలంబనం ఉందని అంటాము. మన పరిశ్రమలన్నీ ఇతురుల తెలివి తేటలతో నెలకొల్పినవే. మన స్వంత తెలివితో ఒక్క తయారీని వెలువరించగలుగుతున్నామా? శుద్ధ స్వదేశీ ఉత్పత్తి అంటూ ఏదయినా ఉందా?

వచ్చే మార్పు అంతా పయిపయినే. కింద ఉన్న భారతీయ సమాజం 40 సంవత్సరాలుగా మారటం లేదు. మనది చాలా బీద దేశం. మన కన్నా తక్కువ ఎవరయినా ఉన్నారా అంటే, ఏ బంగళాదేష్‌నో బర్మానో వెతికి చూపించాలి. మన అభివృద్ధి చాలా మందకొడిగా సాగుతోంది. మన కన్నా నెమ్మదిగా అభివృద్ధి చెందే దేశాలు అయిదో ఆరో ఉంటాయి. అంతే. 70 ఏళ్ల కింద బ్రిటిష్ వారి హయాములో ఎంత శాతం జనాభా వ్యవసాయం చేసుకునే వాళ్లో అంత శాతం జనాభాయే నేడు కూడా వ్యవసాయం చేసుకుంటున్నారు. బ్రిటిష్ వాళ్ళు వెళ్లిపోయారు కాని బీదల శాతం తగ్గలేదు. నిరుద్యోగుల శాతమూ (8శాతం) తగ్గ లేదు. మన ప్రణాళికల మీద 5లక్షల కోట్ల రూపాయలు ఖర్చు చేశాము. ఇంత చేసినా మార్పు ఇంచు మించు శూన్యం. సమస్యలు ఎప్పుడూ ఉండేవే- బీహారులో అవే వరదలు, మిగతా చోట్ల ఎప్పుడూ ఉండే తంటాలే. మన పరిష్కారాలన్నీ తాత్కాలికమయినవి. ఒకటీ నాలుగు రోజుల పాటు నిలిచేది కాదు.

మనదీ ప్రపంచంలో గణించదగిన దేశాలలో ఒకటి కాదు. ఉదాహరణకి మన ముడి జాతీయోత్పత్తి సాలుకి 5.2 శాతం పెరగాలని అనుకుంటున్నాము. ఈ కాకి లెక్క ఏమిటి? 6 శాతం కూడా సాధించలేమా? అసలు 10 శాతం లక్ష్యం అసాధ్యమా? ఇదేమీ ఊహకి అందని అంకె కాదే! జపాన్ ఇంత సాధించే కదా నేటి ఉన్నత స్థానాన్ని అందుకుంది! ఏమిటీ 5.5 శాతమూ, 6.2 శాతమూను?! 10 లేదా 12 శాతం అనుకోలేమూ? తక్కి దేశాల వాళ్ళు అనుకోవటమే కాదు చేసి చూపిస్తున్నారు కూడా!

ఈ భూగోళం మీది దేశాలలో భారత దేశం అన్ని రంగాలల్లోనూ వెనుకపడిపోయి ఉంది. నాకు అనిపిస్తూ ఉంటుంది- ఎందుకు పెరగాలన్న ఈ తాపత్రయం? మన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని మరిచిపోయి మన దారిన మనం వెడితే చాలదూ? మనం తలచుకుంటే 5 కోట్ల టన్నుల ఉక్కు తయారు చెయ్యలేమా? 5కోట్ల టన్నుల ఉక్కు, 25కోట్ల టన్నుల ఆహార ధాన్యం ఉత్పత్తి చెయ్యలేమూ మనం?

అయిదు కోట్లు కాదు కదా మనం తయారు చేసేది 1కోటి 10లక్షల టన్నుల ఉక్కు! కొత్త ఉక్కు కర్మాగారం పెట్టాలంటే మన వాళ్ళు చిప్ప చేత పట్టుకుని భూగోళ యాత్ర మొదలు పెడతారు.

మన దేశంలో ఇంజనీరులకి కొదువలేదు. ఇతర దేశాలకి ఉక్కు మిల్లులు కట్టి పెడతారు వీళ్ళు. మనకి కర్మాగారాలు కావలిసి వస్తే మాత్రం ముష్టి తప్పదా? మన దేశంలో వాడుకునేందుకు మనం తయారు చేసే ఉక్కు చాలదా? అతి తాజా పద్ధతులతో ఉత్పత్తి చేసే ఉక్కే కావాలా?

మనకి ఎగుమతులు అనవసరం. మన జనానికి కావలిసింది మనం తయారు చేసుకుంటేనే చాలు మన పరిశ్రమలు పెరగటానికి! అమెరికాలో ఇంతే కదా? వాళ్ల దేశంలోనే కొనే వాళ్ళు కావలిసినంత మంది!

మనం ఎంతయినా తయారు చేసుకోగలము కాని మనకి మన మీద నమ్మకం ఉండాలి. అమెరికా వాళ్లకీ, జపాన్ వాళ్లకీ ఈ రకం నమ్మకం వాళ్లకి వాళ్ల మీదే ఉంది. అందుకనే వాళ్ళు కారులూ, కంప్యూటరులూ తయారు చేసుకుంటారు; ఒలింపిక్ ఆటలలో బంగారు పతకాలని గెలుచుకుంటారు. మనమో? అల్ప సంతోషంతో వచ్చినది చాలుననుకుంటూ ఉంటాము. □

# వ్యక్తిగతం



భారత ఉపరాష్ట్రపతి పదవికి ఆగస్టు 22న జరిగిన ఎన్నికలో మాజీ కేంద్రమంత్రి, కాంగ్రెస్ (ఐ) అభ్యర్థి శ్రీ ఆర్. వెంకటరామన్ ఘనంగా గెలిచారు. దాదాపు అర్థ శతాబ్దం రాజకీయానుభవం ఉన్న ఈయన వయస్సు 74 సంవత్సరాలు. తమిళనాడులో పారిశ్రామికాభివృద్ధికి మూలకారకుడైన శ్రీ ఆర్. వి. కార్మిక సంక్షేమానికి ఎంతో కృషి చేశారు. ఐక్య రాజ్య సమితికి అనేకసార్లు భారత ప్రతినిధి వర్గానికి నాయకత్వం వహించి సమితి ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్ సభ్యుడిగా 1956లో ఎన్నికైనారు. ప్రణాళికా సంఘ సభ్యుడిగా పని చేశారు. శ్రీ ఆర్. వెంకటరామన్‌కి అనేక సాంఘిక, సాంస్కృతిక, ధార్మిక సంస్థలతో సంబంధాలు ఉన్నాయి.....



తన భార్యనీ, తన మీద విచారణ జరుపుతున్న న్యాయస్థానం అధికారులనీ చంపటానికి ప్రయత్నించి నిర్బంధంలో ఉన్న మాజీ అమెరికా గూఢచారి సంస్థ (సి.ఐ.ఎ.) ఉద్యోగి ఎడ్విన్ విల్సన్......



లాస్ ఏంజలిస్‌లో ఇటీవలే డేనియల్ లియంగ్ అనే అతను కావాలనే ఒక కారుని వేగంగా మనుష్యుల మీదికి నడిపి ఒకరి చావుకీ, ఏభయిమందికి గాయాలకీ కారకుడయ్యాడు. ఎందుకిలాగ చేశావని అడిగితే- పోలీసుల మీద కోపం- అని అతను అన్నాడుట. ఇతని వయసు 21 మాత్రమే......




## 14-9-1984 శుక్రవారం మొదలు 20-9-1984 గురువారం వరకు

★ **మేషం :** పరోపకారచింతనతో కాలం వ్యయింపనున్నారు. కాలం అమూల్యం గదా! వ్యాపారంలో కూడా అంతే! ఎన్నో విధాలా విస్తరింపజేయుటయందు శ్రద్ధ వహించాలి. అప్పులు వసూలు చేసికోవాలి. స్త్రీలకు: గృహ కార్యకలాపాలతో వారం గడచిపోతుంది.

★ **వృషభం :** ఏ విషయం అశ్రద్ధగానున్నా గృహ నిర్మాణ విషయంలో; వ్యాపారాభివృద్ధియందు, వ్యవహార పరిష్కారమందు ఎంత శ్రద్ధ వహిస్తే అంత మేలు. అప్రయత్నంగా ధనలబ్ధి. పరోపకార చింతనకు అవకాశం గలదు. స్త్రీలకు : నూతన మిత్ర సంపద, నూతన వస్తుసేకరణకు అవకాశమున్నది.

★ **మిథునం :** ఉద్యోగ నిమిత్తం మీరు పడిన శ్రమకు ఫలితం చేకూరనున్నది. పట్టుదల వదలకండి. చాల మందికి వ్యాపార విషయంగా ఏదో ఇబ్బంది రానున్నది. గమనించండి. స్త్రీలకు: అనుకోకుండా ప్రయాణాలు సమకూడనున్నవి.

★ **కర్కాటకం :** వస్తుసేకరణకు అవకాశమున్నది. వ్యవహార రీత్యా మేలు పొందనున్నారు. అధికారమందు అభివృద్ధినందనున్నారు. ప్రజా రంగంలో ప్రసిద్ధి లభ్యం కానున్నవి. కొంచెమో, గొప్పో ధనాదాయంగల వారం. స్త్రీలకు: నూతనాంశాలు గ్రహించటం, నూతన వస్తు సేకరణకు అవకాశం గల వారం.

★ **సింహం :** సభాగౌరవం సంభవం. కొందరకు సభా సత్కారం లభ్యం కానున్నది. వ్యవహారం ఏదో వారాంతానికి పరిష్కారం కానున్నది. శ్రద్ధాశక్తులతో ఒకానొక కార్యం సానుకూలం చేసికోగలరు. చాల కాలంగా నిలచిన డబ్బు చేతికందనున్నది. శ్రమించండి. స్త్రీలకు : ఆశించిన విధంగా ఉద్యోగమందు అభివృద్ధిగలదు.

★ **కన్య :** వ్యవహార రీత్యా మేలైన దినం. వృత్తియందు అంతరాయాలున్నవి. ప్రయాణమందు చిక్కులు రానున్నవి. దైవ కార్యాలు నెరవేరనున్నవి. ఆదాయానికి లోపం లేదు స్త్రీలకు : శుభకార్యానుకూలత, బంధు రాక, గౌరవాధిక్యతకు అవకాశం గల వారం.

★ **తుల :** ఆరోగ్యమందు కొంత మెరుగు కనిపిస్తుంది. వ్యవహారమేమయినా ఉంటే పరిష్కారం కాగలదు. చాలమందిని నమ్మి మోసపోయిన తతంగం మరలా జ్ఞాపకం వస్తుంది. ఏదో కొంచం ధనాదాయం లేకపోలేదు. స్త్రీలకు : మనశ్శాంతికి, ద్రవ్యాదాయం చేకూరుతుంది.

★ **వృశ్చికం :** నూతనాంశాలు గ్రహిస్తారు. అవకాశవాదులను దాపునకు చేర్చనీకండి. వస్తు వాహనం సమకూర్చుకోగలుగుతారు. సంఘ గౌరవం చేకూరుతుంది. స్త్రీలకు : కళా సాహిత్య రంగాలలో ప్రసిద్ధి ఏర్పడనున్నది. శ్రమించండి.

★ **ధనుస్సు :** విద్యా రంగంలో పెంపు ఏర్పడే అవకాశమున్నది. వ్యవహార రంగాన కూడా అభివృద్ధి గల వారం. స్థిరాస్థి పెంపు చేసే కార్య కలాపములందు కొందరు నిమగ్నులు కాగలరు. గమనించండి. స్త్రీలకు : ఉద్యోగ రీత్యా మేలు, భూములనుండి ఆదాయం, గృహాదాయం చేకూర గల దినం.

★ **మకరం :** సులభంగా ఒకానొక విషయం నెరవేరుతుంది. అవసరాలకు తగినంత ద్రవ్యం చేకూరుతుంది. నూతనాంశాలు గ్రహించి వానియందు, నిమగ్నులు కాగలరు. ప్రత్యర్థుల విషయంలో మెలకువ అవసరం. అలాంటి సన్ని వేశాలు ఏవో తటస్థ పడగలవు. స్త్రీలకు: ఆదాయం, వృత్తియందభివృద్ధి.

★ **కుంభం :** సాహితీ రంగానుభవం గల వారికి సదవకాశాలు లభిస్తాయి. ఉద్యోగ రీత్యా కొందరకు మేలున్నది. ఆశించిన విధంగా 'ప్రమోషన్' అందుకోగలరు. రాజకీయవాదులకు మంచి అవకాశాలుంటాయి, గ్రహించాలి. స్త్రీలకు: వస్తుసేకరణకు, నగలు -కొనుగోలు చేసికొనుటకు అవకాశం గల వారం.

★ **మీనం :** ఉత్త ఫలితం అందుకోగల దినాలు. చాల కాలంగా యత్నించే వాహన వసతి ఏర్పడగల అవకాశాలున్నాయి. విద్యా రంగంలో మీకు సగుణం కనిపిస్తుంది. 'జాయింటు' వ్యాపారాన భాగస్వాములతో జాగ్రత్తగా సంచరించటం అవసరం. స్త్రీలకు : కళారంగానుభవం గల వారికి సదవకాశాలు చేకూరుతాయి. పదిమందిలో ప్రతిష్ఠకు అవకాశమున్నది.

—విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# మనసా! ఎటులోర్తునే...

కుమారి ఎ.వి. సేషారత్నం

"మనసా ఎటులోర్తునె ........"

ఆ నిశీధిలో ఏటి మీంచి మెల్లమెల్లగా అలలు అలలుగా సాగి వస్తున్న మలయమారుతం శ్రోతల మనసులనే వో దూర తీరాలకు తీసుకుపోతోంది. మనసు మూలల అగాధపుటంచుల్ని తాకుతోంది.

ఆ కంఠంలోని ఆర్తికి బండరాళ్లు సైతం వేడి తగిలిన వెన్నలా కరిగి ప్రవహిస్తున్నాయి. నాగస్వరం వింటున్న నాగుపాముల్లా ఉన్నారు జనం.

కానీ ఈ క్షణంలో ఆ గానం నాకేమాత్రం సాంత్వన కలిగించడం లేదు.

నా హృదయంలో ప్రచండాగ్ని రగులుతోంది.

మనసు దావానలంలో దగ్ధమైపోతూంది.

ప్రపంచాన్ని తగలెయ్యాలనే కసి —

కాని —

నా నిస్సహాయత్వం మీద నాకే చెప్పలేనంత జాలి, అసహ్యం కలుగుతున్నాయి.

చెప్పలేనంత నీరసం నిస్సత్తువా నన్నావహించాయి. తల తిరుగుతున్నట్టుంది. లేచి వెళ్దామన్నా నుంచోలేనంత బలహీనత. ఒక విధమైన మత్తులో నా మనస్సు జోగుతోంది.

అదిగో యమునా నది — పరవళ్లు తొక్కుతూంది.

ఉధృతంగా ప్రవహిస్తూ —

అక్కడ కృష్ణుడు వేణుగానాన్నాలపిస్తున్నాడు.

నీలమేఘచ్ఛాయ— నెమలిపింఛం— ఎర్రని అతని పెదవుల నుంచి మాధుర్యం మురళిలోకి ఒలికి ధారలై ప్రవహిస్తోంది. ఆలమందలు మోరలెత్తి అరమోడ్పు కన్నులతో ఆర్తిగా చూస్తున్నాయి. యశోద పరుగున వస్తోంది అంత దూరాన విన్న మురళీ రవాన్ని ఆధారం చేసుకుని.

కాని ఆ మధురగానానికి పరవశిస్తూ ఆమె నేత్రాలు అలవోకగా నిమీలితమయ్యాయి.

ప్రళయకాల గర్జనలా కెరటాల హోరు — నింగీ నేల ఏకమైనట్లు చప్పట్లు మార్మ్రోగిపోయాయి.

ప్రశాంత గంభీర వదనంతో చెరగని చిరునవ్వుతో చేతులు జోడిస్తున్నాడు ప్రకాశం వినయంగా సభకి —

నా మనసు చెదిరి యమునానదీ తీరాన దృశ్యం చెరిగిపోతోంది. చెవుల్లో హోరు.

ఉధృతంగా ప్రవహిస్తూ యమునానది:

మురళీగానం వినిపిస్తోంది కాని —

కృష్ణుడు లేడక్కడ.

ఆవేదనతో ఆ గానాన్నాలంబన చేసుకుని వెతుకుతున్నాను నేను పిచ్చిదానిలా.

'అమ్మా !'

చిన్నీ !



నా మనసు ఆనందంతో ఉరకలు వేసింది. కళ్లు బలవంతాన తెరిచాను. చిన్ని లేడక్కడ.

ప్రకాశం ఆప్యాయంగా చెయ్యితట్టి లేపుతున్నాడు.

"కాన్సర్టు అయిపోయింది. పద సంధ్యా!"— షాల్ కప్పాడు భుజాలచుట్టూ.

చుట్టూ చూసాను. జనమంతా వెళ్లిపోయారు. హాలు ఖాళీ అయింది నా మనసులాగే.

"మలయమారుతానికి బాగా రెస్పాన్స్ వచ్చింది కదూ ! నువ్వుకూడా ఏదో లోకాల్లో తేలిపోతున్నావు. దొంగా ! క్షేజిమించి నేను గమనిస్తూనే ఉన్నాను. నా గానం నీకంత ఇష్టమా సంధ్యా" — అతని కంఠంలో తృప్తి, అతని చేతిలో నా చెయ్యి ఇమిడిపోయింది.

"నువ్వీరోజు చాలా నీరసంగా ఉన్నావు. మనం హోటల్లో భోంచేసి వెళ్దాం. వంటగోల ఉండదు. సంధ్యా ! సంగీత సమితి ప్రెసిడెంటు మనిద్దర్నీ భోజనం చేసి వెళ్లమని పట్టుబడినా నేను ఒప్పుకోలేదు. ఎందుకో తెలుసా ? నీ కళ్లల్లోకి చూస్తూ తినే అదృష్టం ఉండదని. ఏం సంధ్యా మాట్లాడవు ?"

'నా కాకలి లేదు'— ఈ మాట పైకి నేను అనలేను. అంటే అతనినెంత అప్‌సెట్ అవుతాడో తెలుసు. తెలియనిదల్లా ఒక్కటే— నన్నింత అపురూపంగా చూసుకుంటాడే— నా రక్తంలో రక్తం చిన్నిని...భగవాన్...

ప్రతి వ్యక్తిలోనూ రంగురంగుల ఇంద్ర

మనుష్యులా కోరికలూ, ఆదర్శాలూ ఉంటాయి. ప్రేమనిమించే అసూయ, దాన్ని మించిన త్యాగం అభిమానం వెనుక క్రౌర్యం అన్నిటినీ త్రోసి రాజనే ఆప్యాయతా అన్నీ అనుభూతులూ ఈ చిన్న జీవితంలో ఇమిడే వున్నాయి. కాని అవి సరైన మార్గంలో ఉపయోగించుకున్నవాడు జీవితం ఆనందమయం. కాకపోతే -

ప్రకాశం ! నీ మనసులో చిన్నికి కూడా చోటిస్తే— ఈనాడు నాకీ వేదన తప్పేది. కాని తప్పంతా నాది.

స్త్రీకి మాతృత్వాన్ని మించిన వరం లేదు. కాని నేను స్వార్థం ముందు మాతృత్వాన్ని బలి పెట్టాను . ప్రకాశం అడిగిననాడే మరికొంత ఆలోచించి వుంటే... ఊహూ ! అది వయసు, ఉరకలెత్తే వయసు.

కళ్లెం వేసినా ఆగని కోరికలు.

కాదు— కోరికలకోసం కాదు నేను తల వంచింది.

లోకంలో ఒంటరిగా బ్రతకలేకా—

బ్రతకలేకకాదు— బ్రతకనివ్వని లోకానికి భయపడి— ఆలోచిస్తే అవకాశం జారిపోతుం దేమోననే తొందరపాటుతో— ఆనాటి సంఘటన నా మనో ఫలకంమీద ప్రతిబింబించింది.

“సంధ్యా !”

“ఊ !”

“ఎంతసేపలా పరుగులెత్తే మేఘాలను చూస్తావు ? మేఘాలను తప్ప మరేం చూడవా? నిన్ను కోరుకునే మనిషినెపుడు చూస్తావు సంధ్యా ? నాకెన్నాళ్లీ పరీక్ష? ఫోనులో అనుక్షణం నీ కంఠం వినాలని తహతహ లాడతాను కాని గడియ గడియకీ ఫోన్‌చేసి నీ ఉద్యోగానికి భంగం కలిగిస్తున్నాననే భయం. కాని నీ కంఠం వినకుండా ఉండలేని దౌర్బల్యం. ఒక్కొక్కప్పుడు నీకు కష్టం కలిగిస్తున్నానని తెలిసీ నా స్వార్థం కోసం ... ”

## మనసా ! ఎటులోర్తునే....

లోకమే స్వార్థపరులతో నిండిపోయింది. అవకాశం దొరికితే అందితే అందరికీ నన్ను సొంతం చేసుకోవాలనే స్వార్థం. కాని ఆ స్వార్థం నా మెడలో పసుపుతాడు వెయ్యనీయదు. నా మీద జాలి, సానుభూతి చూపించి నా మెడకి ఉరితాడు నేస్తుంది— నా ఆలోచనలు ప్రకాశానికి చెప్పలేదు.

“ఏంటి సంధ్యా ఆలోచిస్తున్నావు? ఏమిటీ పిచ్చివాడు అనా ? నీ ముభావాన్ని అతిశయం గామా గర్వంగాను తీసుకుని నిన్నపార్థం చేసుకుంటాననుకున్నావా ? ఊహూ ! స్వభావ సిద్ధంగానే నువ్వు నిశ్శబ్దాన్ని, ఏకాంతాన్ని ఇష్ట పడతావని గ్రహించగలిగేది నేను మాత్రమే. నీ కోసం ఎన్నాళ్లు ఎదురుచూడమంటావు ? ఒక జీవిత కాలమా ? నేను రడీ. కానీ ఎందుకు జీవితాన్ని వృధా చేసుకోవాలో చెప్పు !”

‘నా జీవితం వృధా అయిందని నీకెలా చెప్పాలి ప్రకాశం? ఇంత ప్రేమను కురిపిస్తున్న నువ్వు—నేను అఘ్రాణిత పుష్పాన్ని అని తెలిస్తే సహిస్తావా ? నిండు హృదయంతో నన్ను స్వీకరిస్తావా ? జాలితో అయితే వద్దు. నేను జీవితంలో సహించలేని వస్తువు ఒకే ఒకటుంది. అది ఇతరుల సానుభూతి. అంతకంటె నన్ను చిత్ర వధ చేసినా భరిస్తాను.’ — నా ఆలోచనలు నన్నెలా మొదలు పెట్టనివ్వాలో చెప్పడంలేదు.

‘సంధ్యా! నీ మౌనాన్ని అనంగీకారంగా తీసుకోవాలా ? నా దగ్గర ఎందుకా మౌనం? అనేక అపార్థాలకు దారితీస్తుంది. మనసు విప్పి మాట్లాడితే నేను నిన్నింకా అర్థంచేసుకోగలను. నాకా అవకాశం ఇవ్వడానికి ఎందుకు సందేహిస్తున్నావు ? నేను మోసగాడి ననుకుంటున్నావా ? నా గుండె చీల్చి చూడు. ప్రతి రక్త బిందువూ ‘సంధ్యా’ అని పరితపిస్తుంది.

అసలు నాకెందుకు కనిపించావు సంధ్యా ?

### మానవుడు

మృగంలో మృగత్వం
దైవంలో దైవత్వం
పూవులో తావి ఉన్నట్లు
అయితే
మానవుడిలో నెలకొన్నాయి
మృగత్వ దైవత్వాలు
మానవత్వంతోపాటు.
అందుకే అతడు మిన్న
అందరికన్న.

— చల్లా రాధాకృష్ణశర్మ

ఆనాడు సభలో అంతమంది ప్రేక్షకులలో నా దృష్టి నీమీదే ఎందుకు పడింది ? సంగీతం అంటే నీకుండే అభిమానమో — నా గాత్రంలో ఉండే గొప్పతనమో నా కర్థంకాలేదు. మలయ మారుతాన్ని ఆలాపిస్తున్నంతసేపు కళ్ళు మూసుకున్న నా మనోవీధిలో నువ్వే అర్ధ నిమీలిత నేత్రాలతో తపోధ్యానంలో ఉన్న సతీ దేవిలా కనిపించావు. నువ్వు ఆపరేటర్‌గా పని చేస్తున్నావనీ తెలుసుకోడానికెంత కష్టపడ్డానో, నీతో స్నేహం పెంచుకోవాలని ఎంత తాపత్రయ పడ్డానో నీకు తెలుసు.’’ ప్రకాశం స్వరం మంద్ర స్థాయిలో ఏదో లోకంలోంచి మాట్లాడు తున్నట్టుంది

ఆ రోజు నాకూ గుర్తుంది. నాకు సంగీత జ్ఞానం లేదు — బొత్తిగాలేదు. అయినా చిప్పప్పట్నుంచీ సంగీతమంటే నాకెంతో యిష్టం. సరిగమ పదని — సప్తాక్షరల్లోనే సంగీతమంతా ఇమిడి ఉందంటే నాకెంతో ఆశ్చర్యంగా ఉండేది. ఆ అక్షరాలనుంచే ఎన్నో రాగాలు, స్వరాలు — అద్భుతంగా పలుకుతోంటే మానవ జీవితానికి ఆ సప్తాక్షరాలకీ ఏదో సంబంధం ఉందనిపించేది. స్వరకల్పన చేతనయితే ఎంత విషాదరాగమయినా మనసునేదో తెలియని లోకాలకు తీసుకుపోతుంది. జీవనరాగమూ అంతే. స్వరకల్పన చేతకాకపోతే జీవితం అపస్వరాల పుట్ట అయిపోతుంది.

ఏ స్వరాన్ని ఏస్థాయిలో ఎక్కడ పలికించాలో, తెలియకపోతే స్వరం నాశనం. వికృత రాగం, అయిపోతుంది.

చిన్నప్పట్నుంచీ నాకేం కావాలో నాకే తెలియదు. ఒక్కక్షణం నా అవసరం ‘ఇదే’ అనుకున్నా ఏదో తెలియని పిరికితనం— ఎవర్ని ఎదిరించగల ధైర్యంలేని నేను సమాధానపడి పోవటంలోనే జీవితాన్ని గడిపేస్తున్నాను.











# మనసా ! ఎటులోర్తునే....

నాకు 'రామం' అంటే అయిష్టంలేదు. మేనరికం— గుండెలమీద కుంపటి దించుకోవాలని అమ్మా నాన్నా పెళ్లి చేసేస్తే ఏమూలో ఉన్న రవంత అయిష్టాన్నీ వ్యక్తపరచలేదు.

'పెళ్లి చేసుకోక ఏం చేస్తావు ?' అంటే సమాధానం నా దగ్గరలేదు. అందుకే పద్దెనిమి దేళ్లకే 'రామం' ఇల్లాలినయ్యాను. మరో రెండేళ్లకే 'చిన్ని'కి తల్లినీ అయ్యాను.

అనుకోని అశనిపాతంలా అమ్మా, నాన్న, అతనూ ప్రమాదంలో కళ్లు మూస్తే లోకంలో 'చిన్ని'తో ఒంటరిగా నిలబడిపోయాను.

దూరపు బంధువు దయతో ఉద్యోగంలో చేరాను. కానీ నేను ఒంటరిదాన్ని అని తెలిసిన మరుక్షణంనుంచే లోకం వేటకుక్కలా నన్ను వెంట తరుముతూనే ఉంది.

నన్నెలా రక్షించుకోవాలో తెలియని సందిగ్ధంలో నానా మానసిక చిత్రహింసా అనుభవిస్తున్న నాకు వరమో శాపమో ప్రకాశం తారసిల్లాడు..

జీవితంలో నేను ఇష్టపడింది— చేసింది— కచేరీలకి వెళ్లడమే. చిన్నప్పుడు విసుక్కుంటున్నా అమ్మ తోడు వచ్చేది.

'రామం' రానపుడు రేడియో వినేదాన్ని, ఇపుడు 'చిన్ని' తోడు.

వాడే లేకపోతే నా జీవితానికి అర్థమే లేదు. ఒంటరిగా జీవితం గడుపుతున్నానూ— గడప గలుగుతున్నానూ అంటే 'చిన్ని' కారణం. వాడే లేకపోతే ఈ అపస్వరాల పుట్ట అయిన జీవితాన్ని ఏ అర్థరాత్రో అంతం చేసుకునేదాన్ని.

గయ్యాళి భార్య భయంతో ఆగినా — అవకాశం దొరికినప్పుడల్లా వంకర చూపులు చూసే ఇంటాయనని చూసీ, — యుక్తాయుక్త విచక్షణ లోపించి నా జీవితం మీద జోకు లేసుకుని— అందితే ఆస్వాదించి కాలరాయాలని కాచుకునున్న కాలభైరవుల్ని తలుచుకుని చచ్చి పోవాలనిపించేది కానీ— కన్నపేగు— మమకారం...

'సంధ్యా !' ప్రకాశం పిలుపులో స్వార్థం కాదు— నేను నిజంగా కావాలనే ఆర్తి

"ప్రకాశం ! బిడ్డతల్లిని భార్యగా స్వీకరించ గల ధైర్యం నీకుందా" - బాణంలా తగిలింద తనికి నా ప్రశ్న, ఒక్కక్షణం లేడిలా గిలగిల లాడిందతని మనస్సు.

ఆ రోజుతో మా స్నేహానికి స్వస్తి అను కున్నాను. కాని మర్నాడు బొమ్మలతో, బిస్కెట్ పాకెట్లతో మా యింటికొచ్చిన ప్రకాశం మనసు నాకు తెలిసిందనుకున్నాను.

వయసు పోరుతో కాదు— లోకాన్నెదుర్కో లేని నిస్సహాయతతో కాదు.

'నాన్న' ఏడని బుల్లినోరు తెరిచి అడిగే చిన్ని కోసం— చిన్ని కోసమే నేను ప్రకాశాన్ని అనుసరించాను.

సుఖాలను డబ్బుతో కొనుక్కోవచ్చు —
కానీ సంతోషం మానసికమైనది.

ఒక స్త్రీ భర్తనుంచి భౌతిక సుఖాలకన్నా ఎక్కువగా మానసికమైన అనుభూతుల్నే ఆశిస్తుంది. 'తనది' అన్నవన్నీ అతని పరం కావాలనే కోరుకుంటుంది.

కానీ పురుషుని ప్రపంచం వేరు. అతని దెక్కువ భౌతిక దృష్టి, కళాకారుడైనా ప్రకాశమూ అంతే.

అతను నన్ను ప్రేమించడంలో అణుమాత్రం లోటుచెయ్యడు. నా తనువూ, మనస్సూ అతనికే అర్పితమవ్వాలి. మరే ప్రాణికీ అందులో హక్కుండకూడదు. అతని కోరికలో నామీద అనంతమైన ప్రేమ వాహినిలా పొంగుతున్నా నాలో 'భార్య' అనేదానికి మించి 'మాతృత్వం' అవిరళంగా ప్రవహిస్తోంది.

అతని భార్యగా అతనికి సంపూర్ణమైన సహకారాన్నెలా అందించాలనుకుంటున్నానో తల్లిగా 'చిన్ని' కోరిక తీర్చడమూ నా విధే.

'నాన్నా' — అనే అమాయకపు 'చిన్ని' పిలుపుకు తండ్రికాని అతని పితృహృదయం వరదలై పొంగాలన్నంత స్వార్థం నాకు లేదు. కాని తండ్రి ప్రేమ కోసం తపించిపోతున్న వాడికి రవంత తృప్తి దొరికితే నా జీవితం మోహనరాగ మవుతుందనుకున్నాను..

కాని చిన్ని పిలుపు విన్నప్పుడల్లా అతనికి తెలియకుండానే అసంకల్ప ప్రతీకారచర్యగా అతని కనుబొమలు విరిగేవి. ఏదో అపస్వరం దొర్లి వికృతరాగంగా మారేది. పైకి వ్యక్తం కాకున్నా, నామీది ప్రేమ చాటున అణిగిపోవాలన్నా నా సునిశిత దృష్టిని దాటిపోలేని విషయమది.

తల నెరిసిపోయిన గురువు శిష్యుడెంత గొప్పవాడైన అతని గొప్పదనం మీదకంటె తప్పొప్పుల నిర్ణయంవైపే అతని మనసు మొగ్గు తుంది. ఎందుకు ? శిష్యుడు మచ్చలేని మాణిక్యంలా మెరవాలనే. నేను కోరుకున్నదీ అదే.

చిన్నికి మాలిన్యంలేని ప్రేమ దొరకాలి.

వాడొక రాత్రివేళ కలత నిద్రలో 'అమ్మా' అని భయంతో ఏడుస్తుంటే నా చుట్టూ బిగుసుకున్న ప్రకాశం మమతానురాగాల్ని బలవంతంగా తెంచుకుని నా మాతృహృదయం పరిగెడుతుంటే —చేతుల సడలింపులో 'చిన్ని' పట్ల కోపం కదలాడితే నా మనసు విలవిలలాడేది.

అందుకే నేను నిర్ణయించుకున్నాను.

ఆ రోజు ...

చిన్నిని బోర్డింగ్ స్కూల్లో వదిలిపెడు తూంటే నా మాయమాటలు నమ్మి, లేగదూడలా వాడు చూస్తున్న చూపు నా గుండెల్ని చీల్చింది.




**జె. – కొవ్వూరు.**

నాకు చిన్నప్పటి నుంచి చెవి చీము కారుతూ ఉంది. ఎన్ని మందులు వాడినా ప్రయోజనం లేదు. ఇ. ఎన్. టి. సి స్పెషలిస్టుకి చూపించాము. టాన్సిల్స్ ఆపరేషన్ చేసి 1 సం. అయింది.

★ మిడిల్ ఇయర్ ఇన్‌ఫెక్షన్ వచ్చిన వారికి ఇలా నిరంతరం చీము కారుతూ ఉంటుంది. ఈ చీము మాస్టాయిడ్ అనే ఎముక భాగానికి ఎస్తరించకుండాచూడవలసి ఉంది.

చెవు భాగాన్ని ఎక్స్–రేతీయించి వైద్యులకు చూపించవలసి ఉంటుంది. చెవులో నుంచి వచ్చే చీముని కల్చర్–సెన్సిటివిటీ టెస్టు చేయించి ఫలితం ప్రకారం యాంటీబయాటిక్ మందులను స్థానికంగాను. ఇంజక్షన్ల రూపంలోను వాడవలసి ఉంటుంది.

**జి. ఆర్. ఆర్. – హోస్పేట**

నేను ఇప్పటికి రెండు నెలల క్రితం ఒక వేశ్యతో కలిశాను. ఆ తర్వాత ఒక వారం రోజులకి నా లింగం ముందు భాగం చాలా దురద పెట్టింది. ఇప్పుడు కూడా చర్మం లోపలి భాగంలో చిన్న చిన్న, అంటే రాగి గింజలంత మోతాదులో తెల్లని గుల్లలు ఉన్నవి. డాక్టర్ని సంప్రదించాలంటే సిగ్గుగా ఉంది.

★ మీరు వైద్యులని తప్పక సంప్రదించవలసి ఉంది. వారు పరీక్ష చేసి టెట్రాసైక్లిన్, స్ట్రెప్టోమైసిన్, సల్ఫా వంటి మందులు వాడిగాని, పరిస్థితిని బట్టి జిడాక్స్ వంటి మాత్రలు వాడిగాని నయం చేయగలరు.

**ఆర్.ఆర్.బి. – న్యూఢిల్లీ**

కుష్టు రోగం వస్తుందేమోనని చాలా భయపడుతున్నాను. అసలు ఈ రోగం రాకుండా ముందు జాగ్రత్తలు కోసం ఏమైనా మందులు వున్నాయా?

★ కుష్టురోగం రాకుండా ప్రత్యేకంగా తీసుకో తగిన ముందు జాగ్రత్త లేమీలేవు.

ఈ రోగం ఒకరి నుంచి మరొకరికి ఎలా సంక్రమిస్తుందనేది ఇంకా తెలియని విషయం.

ఈ రోగ నివారణకి గాను వాక్సిన్ తయారు చేయటానికి పునః పరిశీలనా కార్య క్రమాల సన్నాహాలు జరుగుతున్నాయి. వీటి ఫలితాలు కొన్ని సం.ల వాడుక తర్వాత గాని తెలియవు.□

---

పులికి ఆహారం కాబోతూ, గిడ్డకు నీతులు చెప్పి తిరిగివస్తానన్న గోమాతను లేగదూడ అలాగే నమ్మి ఉంటుంది.

"నన్ను వదిలి నువ్వు అంతదూరం ఎందుకు వెళ్లాలమ్మా" అని ప్రశ్నించలేని వాడి బాల్యం నాకు అలుసయింది.

"నాన్నగారి కోపం తగ్గాక పెద్దపూరు నుంచి త్వరగా వచ్చేసి తీసికెళ్తావ్ కదూ !"

నేనెప్పటికీ తిరిగిరానని, వాడిని అనాథ బాలుడిగా ఆ స్కూల్లోచేర్చి ఒక తల్లి తన స్వార్థం కోసం తనని జీవితాంతం ఒంటరివాడిని చేసింది అన్న కఠోర సత్యం వాడికి తెలిసిన రోజున వాడు మాతృత్వాన్నే శపిస్తాడని నాకు తెలుసు.

కానీ నేనింటికి వెళ్లిపోయాను గుండె బండ చేసుకుని. ఆ రోజు ప్రకాశం ఆఫీసు నుంచి తిరిగివచ్చి 'నాన్నా' అన్న బాబు పిలుపు వినిపించకపోతే తేలిగ్గా నిట్టూరుస్తుంటే అతని భారాన్ని తీర్చిన నా భారం మరింత అధికమయింది. సంగీత జ్ఞానం లేకపోయినా ఇప్పుడూ ప్రకాశం కచేరీలకి హాజరవుతూ ఆ రసజలధిలో మునిగి తేలాలనుకుంటాను. కాని అతను పాడుతున్న ప్రతి రాగంలోనూ ఏదో స్వరం లోపించినట్లనిపిస్తోంది.

'సంధ్యా' — మృదువుగా నా చెంపలు సవరిస్తూ —

'భోజనం వచ్చేసింది. ఆకలి లేదంటే నేనొప్పుకోను, నీకోసం కాదోయ్. మరో మూడు నెలల్లో బయట ప్రపంచాన్ని చూసే బుల్లి సంధ్యారాణి కోసం.' హోటలని కూడ మర్చిపోయి తినిపిస్తున్నాడు ప్రకాశం.

నా కంట కావేరి కట్టలు తెంచుకుంటున్నా బలవంతాన ఆనకట్ట వేస్తున్నాను. అతని ప్రేమను తట్టుకోలేక నా మనసు ఘోరుమంటోంది.

'త్వరగా తినేస్తే నీకో గమ్మత్తు చూపిస్తాను'— నన్ను పసిపిల్లలా లాలిస్తున్నాడు ప్రకాశం.

ఆటో దిగి గుమ్మంలో అడుగుపెట్టగానే పసిపిల్ల చేతుల్లోంచి చేపపిల్లలా జారిపోతూ — 'అమ్మా !'

మూడు నెలలుగా నాలోనే సుడులు తిరుగుతున్న పిలుపు — నాకు మతిభ్రమిస్తోందా ? కలగంటున్నావా ?—

"నాన్నగారికి నామీద కోపం అని అబద్ధం ఎందుకు చెప్పావు ? నాన్న నేను జట్టు. కదు నాన్నా — ప్రకాశం మీదికెగ్రాకాడు 'చిన్ని'.

వాడిని ముద్దుపెట్టుకుంటున్న ప్రకాశంలో సాక్షాత్తూ 'రామం' కనిపించాడు. చిన్నిని నాకందించి మెల్లిగా లోపలికి నడిచాడతను. చెవిలో గలగలమంటున్న చిన్ని గొంతు — ఎదురుగా టీపాయ్‌మీద ఉత్తరం.

'సంధ్యా !'

భగవంతుడిని చూడవలసిన 'చిన్ని'ముఖంలో ఇన్నాళ్లూ 'రామం'ని చూస్తూ నా మూర్ఖత్వంతో నీ మనసు నొప్పించాను. నాకు 'నువ్వు' కావాలి. కాని చిన్ని + నువ్వు = నువ్వు అని తెలుసుకునేందుకెంత ఆలస్యం చేసానో ! రోజూ నా చేతుల్లో మంచుబొమ్మలా — ప్రాణంలేని నువ్వు — నాక్కావలసింది మనసున్న మనిషి. మంచుబొమ్మకాదు. పశువుకూడా ప్రాణంలేని కట్టెతో సరాగమాడదు. 'మాతృహృదయం' త్వరగా గ్రహించేందుకు చిన్నప్పుడు నాకమ్మలేదు సంధ్యా ! నీ అనుమతిలేకుండా నీ డైరీ చదివి 'చిన్ని' అడ్రసు తెలుసుకున్నాను. మన జీవన రాగంలో ఇకమీదట అపస్వరాలు పలుకవుగా — 'నీ 'ప్రకాశం'.

ఏదో తెలియని రాగం కట్టలు తెంచుకుని నాలో వరదలయ్యింది. లోపల టేప్ రికార్డర్‌లో ప్రకాశం గొంతులో మలయమారుతం మధురంగా వినిపిస్తోంది— 'మనసా ఎటులోర్తునె' ...★

సీరియల్

# శ్రావణి

## మాదుగుల కృష్ణకుమారి

## 25

(గత సంచిక తరువాయి)

శ్రావణి ఒంటరిగా ఇంట్లో వుంది.

వంటగదిలో ఏదో షని చేస్తున్న శ్రావణిని వెనకగా రెండు చేతులు మొరటుగా వాటేసుకో వడంచూసి కంగారుగా అరవబోయింది.

ఒకచేత్తో ఆమె నోరు మూసి "నేనేలే. ఆవేళ నన్ను తిట్టిపొయ్యావుగా, ఇప్పుడు తిట్టు చూద్దాం" అన్నాడు ఊపిరి ఆడకుండా నొక్కుతూ.

ఎలాగో అతని చెయ్యి తప్పించి "ఇంట్లో ఎవరూ లేనపుడు వచ్చి ఇలా వెధవపనులు చేస్తున్నావని అక్కతో చెపుతానుండు. వదులు ముందు" అంది కోపంగా.

"మీ అక్కతో చెపితే మన పని మరింత సులువు అవుతుంది." అన్నాడు.

తప్పించుకోవటానికి పెనుగులాడుతూ "మా నాన్నతో, అమ్మతో చెప్పానంటేనా నీ పని ఏమవుతుందో చూసుకో. వదులు" అంది అసహనంగా.

"ఆ ముసలాళ్లు నా మాట నమ్మతారు కానీ నీమాట నమ్మరే పిచ్చిమొద్దూ. నన్ను నోటికి వచ్చినట్లల్లా అంటావే. నీ పొగరు అణుస్తాను జాగ్రత్త" అన్నాడు.

"నా పొగరు అణచకముందే నీ పొగరు అణుస్తాను జాగ్రత్త" అంది.

"అది నీ తరం కాదే" అన్నాడు శేషు.

"అదిగో మా అమ్మ వచ్చిందిగా" అంది గుమ్మంవైపు చూస్తూ.

కంగారుగా శ్రావణిని ఒదిలి గుమ్మంవైపు చూశాడు శేషు.

పక్కనేవున్న కారండబ్బాలోంచి గుప్పెడు కారం తీసి శేషు ముఖాన కొట్టి ముందు గదిలోకి పరిగెత్తింది శ్రావణి.

మనసుతోపాటు కళ్లు కూడా భగ్గున మండాయి శేషుకు. "ఎలా అయినాసరే ప్రతీకారం తీర్చుకుంటానుండు" అని శపథం చేశాడు ఆ మండుతున్న మనసుతోనే.

దూరం నుంచి తల్లి రావటం చూసిన శ్రావణి ధైర్యంగా లోపలికి వచ్చి "నడువాలో నీళ్లున్నాయి కానీ ముఖం కడుక్కో పాపం మండుతున్నట్లుంది. పొగరుకాస్త అణిగినట్లుందే జల్సారాయుడికి" అంది వెటకారంగా.

కోపాన్ని అదుపులో పెట్టుకొని మండుతున్న కళ్లని నీళ్లతో కడుక్కోసాగాడు శేషు.

ఎర్రపడి నీళ్లు కారుతున్న శేషు కళ్లను చూసి ఖంగారుగా శాంతమ్మ "ఏమయిందే ?" అంది.

చెప్పనా అన్నట్లుగా శేషు ముఖంవైపు చూసింది.

పాలిపోయిన అతడి ముఖం చూసి మళ్లీ జాలేసి "కారండబ్బా కోసం చూస్తే అది అంద లేదు. సమయానికి బావ వచ్చి తను అందుకో బోయ్యాడు. చెయ్యిజారి కారం కాస్త కంట్లో పడింది. అప్పుడు చూడాలి డాన్సు. ఏం బావా అంతేగా జరిగింది ?" అంది పకపక నవ్వుతూ.

శ్రావణలా నవ్వుతుంటే కారం మంటకు తోడు, మరింత మంట ఎక్కువయింది శేషుకు. "ఇంతకు రెట్టింపు చెయ్యకపోతే నా పేరు మార్చుకుంటాను చూడు" అనుకున్నాడు.

"ఆ నవ్వు ఏమిటే పాపం! అతను బాధ పడుతుంటే. నీ అల్లరి రాను రాను మితిమీరు తోంది" అంది శాంతమ్మ మందలింపుగా.

"కాని పనుల జోలికి పోతే అంతే మరి. ఇంకెప్పుడూ కారపుడబ్బా జోలికి పోకు బావా. ఒకసారి అనుభవమయిందిగా కలకాలం గుర్తుంచుకో" అంది ద్వంద్వార్థంగా.

"చూస్తానే నీ మిడిసిపాటు ఎన్నాళ్ళో. నేను చేస్తాను నీకు ఇంతకింత అవమానం" అనుకున్నాడు కసిగా పళ్ళునూరుతూ.

## 26

ధైర్యంగా ఆ రోజు అలా చేసింది కానీ శ్రావణి మనసులో భయంగా వుంది. మొదట్లో ఏదో సరదా అని సరిపెట్టుకున్నా రానురాను ఎక్కువవుతున్న అతని ఆకతాయితనం భరించ లేక, శృతిమించి రాగాన పడుతోందని బాగా ఆలోచించే కారం డబ్బాతో సత్కరించింది.

కానీ ఆ సత్కారంతో బుద్ధి రాకపోగా మరింత పగ పెరిగిందన్న సంగతి తెలియని శ్రావణికి విషయం అక్కతో చెపుదామనుకుని కూడా మళ్ళీ అసహ్యమనిపించి మిన్నకుండి పోయింది.

సాయంకాలం పూట చెఱువు దగ్గర కూర్చుని ఒక్కొక్క రాయిని నీటిలోకివిసురుతూ రైముకు రాని తన స్నేహితులకోసం విసుగ్గా ఎదురు చూస్తున్న ఆమె మనసుని అల్లకల్లోలం చేస్తున్నాయి ఆలోచనలు.

"నా కోసమేనా చెఱువు ఒడ్డున కాపు చేశావు" అన్న మాటలకు చటుక్కున తల ఎత్తి చూసిన శ్రావణి ఒళ్ళు జల్లుమంది. ముచ్చెమటలు పోశాయి.

ఎదురుగా శేషు. అతను నవ్వుతుంటే పగ పట్టిన పాము నోరు తెరిచి కాటు వెయ్యటానికి మీదకు వస్తున్నట్లుగా అనిపించింది.

భయంతో మాట్లాడకుండా ముందుకు నడవబోయింది.

"ఆగవే! ఎక్కడికి వెళతావు ?" అంటూ శ్రావణి పైటచెంగు దొరకపుచ్చుకున్నాడు.

వణుకు ప్రారంభమయింది శ్రావణికి.

"ఏమాలోచించావు నా గురించి?" అన్నాడు.

"నీ గురించి నాకాలోచన ఏమిటీ ?" అంది ధైర్యం తెచ్చుకుని.

"నీ పొగరింకా తగ్గలేదే. ఆ రోజు నా కంట్లో కారం కొట్టి తప్పించుకున్నావు. ఇప్పుడు నిన్నేం చేసినా దిక్కెవరే" అన్నాడు క్రూరంగా ఆమె భుజం నొక్కుతూ.

"అబ్బా!" అంది బాధను భరించలేనట్లుగా.

**జరిగిన కథ—5** బిడ్డలులేని శ్రీహరి, శ్రావణి దంపతులు డాక్టరు దగ్గరకు వెళుతారు. శ్రావణిని పరీక్షచేసి ఆమెకు పెళ్లికి ముందే బిడ్డలు పుట్టకుండా ఆపరేషన్ జరిగినట్లు చెపుతుంది డాక్టర్. శ్రీహరి శ్రావణిని పుట్టింటికి పంపించేస్తాడు. రైల్లో కూర్చొన్న శ్రావణి జరిగిపోయిన తమ తీయని దాంపత్య జీవితం గురించి తలపోయసాగింది. శ్రావణి తల్లితండ్రులను చేరుతుంది. కానీ జరిగినదాంట్లో తల్లితండ్రులకు భాగం ఉందని తెలుసుకొని ఇల్లు విడిచి వెళ్లిపోతుంది. ప్రాణం తీసుకోబోతున్న శ్రావణిని రక్షించిన స్త్రీ ఆమెను తన ఇంటికి తీసుకెళ్లి ఆశ్రయం ఇస్తుంది. శ్రావణి తనకు ఆశ్రయం ఇచ్చిన స్త్రీ ప్రముఖ రచయిత్రి ప్రమీలా కైలాష్ అని తెలుసుకొని ఆశ్చర్యపోతుంది. లక్ష్మయ్య దంపతులు శ్రావణి విషయాన్ని అల్లుడు శేషుకి చెప్తారు. ప్రమీల తన గత జీవిత చరిత్రను శ్రావణికి తెలియపరుస్తుంది. శ్రీహరి భార్యను పుట్టింటికి పంపాడేకాని ఆమె జ్ఞాపకాలను మరువలేకపోతాడు. శ్రావణి తన పెళ్లికి ముందు జరిగిన సంఘటనలు చెప్తూ తనను తన బావ ఏ విధంగా అల్లరి పెట్టిందీ ప్రమీలతో చెప్పసాగింది.

''అంత సెప్పిగా వుందా ?'' అన్నాడు వెటకారంగా చూస్తూ.

''పైకి మా నాన్న దృష్టిలో పెద్దమనిషిగా చెలామణి అవుతూ ఇలా, రౌడీపనులు చెయ్యటానికి నీకు సిగ్గులేదు. నీకిదే ఆఖరిసారి చెప్పటం, ఆ రోజు నీ ఏడుపు ముఖం చూసి జాలివేసి ఒదిలిపెట్టాను. అప్పుడే మావాళ్ళతో చెప్పేస్తే నీ పని ఏమయ్యేదో నువ్వు ఆలోచించుకోముందు'' అంది ఛీత్కారంగా చూస్తూ.

''ఎవరు ఆలోచించుకోవాలో చెపుతున్నాను శ్రద్ధగా విను. ఇంకో అవకాశం ఇస్తున్నాను. నువ్వు నాకు లొంగకపోతే మీ అక్కను ఏలుకోను. పుట్టింటికి పంపిస్తాను. తెల్సిందా ? మీ అమ్మా నాన్నను రకరకాలుగా హింసించి చంపుతాను. వాళ్ళందరూ చచ్చాక నాకెవ్వరూ అడ్డువుండరు. అప్పుడు నాకు పూర్తి స్వేచ్ఛ. అలా కాకపోతే, నామీద మీవాళ్ళందరికీ పూర్తి నమ్మకం వుంది. నువ్వు చెప్పినా నమ్మరు. నిన్నే అంటారు. ఒకవేళ చెప్పినట్లుగా తెలిస్తే నిన్ను నా అవసరానికి వాడుకుని చంపి చెఱువులోనో, కాలువలోనో పడేస్తాను. అప్పుడు వూళ్ళోవాళ్ళందరూ నువ్వేదో కాలుజారిన కారణంగా పోయావని అనుకుంటారు కానీ, నన్నెవరూ అనుమానించరు. మర్యాదగా నీకై నువ్వు లొంగిపోతావా ? లేక బలవంతంగా నాచేత అనుభవించబడి దిక్కుమాలిన చావు ఛస్తావో నీ ఇష్టంమీద ఆధారపడివుంది. ఆలోచించుకో. నే పెట్టిన గడువులోగా విషయం తేల్చు'' అని వడివడిగా వెళ్ళిపోయాడు ఎవరో రావటం చూసి.

నిలబడినచోటనే నిస్సత్తువగా కూలబడిపోయింది శ్రావణి. భయంతో శరీరమంతా తడిసి ముద్దయింది. రోజూ తను తిరిగి ఆటలాడుకునే స్థలమయినా ఆ పరిసరాలు కూడా కంటికి భయంగా కన్పించసాగాయి. లేచి ఇంటికి వెళ్దామంటే వెళ్ళలేని నీరసం ఆవహించిందామె మనసుని, శరీరాన్నికూడా.

చీకటి పడుతుంటే మెల్లిగాలేచి ఇల్లు చేరుకుంది.

ఆ పూట అన్నంకూడా సహించలేదు. ఆ రాత్రి కలలనిండా శేషయే. తల్లిని, తండ్రిని, అక్కని చంపిపడేసి వారి శవాల మీదనుంచి వికటంగా నవ్వుతూ తనకేసి నడిచివస్తున్న అతని రూపం చూడగానే కెవ్వుమంటూ గుండెలు అవిసిపోయేలా ఒక్క కేకపెట్టింది.

మీద చెయ్యివేసి కుదుపుతున్న తల్లి పిలుపుకి మెలకువ వచ్చి భయంగా అటూ ఇటూ చూసింది.

''ఎందుకలా అరిచావు ? ఏదన్నా కల వచ్చిందా ?'' అంది తల్లి.

''అవును ! పీడకల. చాలా భయం వేసింది'' అంది గజగజా ఒణికిపోతూ.

''పగలంతా తోటల వెంబడీ, దొడ్లంబడీ తిరిగితే పీడకలలు కాక ఏమొస్తాయి ఇదిగో గ్లాసుడు నీళ్ళు త్రాగి పడుకో''మ్మంది తల్లి.

ఒక్క గుక్కలో ఆ గ్లాసుడు నీళ్ళు త్రాగింది. అయినా మనసులోని భయం పోలేదన్న గుర్తుగా శరీరంలోని ఒణుకు మాత్రం తగ్గలేదు.

విభూది తెచ్చి శ్రావణి నుదుట పెట్టి ''పడుకో'' అంది తల్లి నిద్రకళ్ళతో ఆవలిస్తూ.

''అమ్మా ! నా దగ్గర పడుకోవే'' అంది బిత్తర చూపులు చూస్తూ.

తనను కర్చుకుపోయి పడుకున్న కూతురు ఇంకా వణకటం చూసి ఎంత భయంకరమైన కల వచ్చిందో పిచ్చితల్లికి, పైకి బడబడా వాగుతుందే కానీ ఒట్టి అమాయకపు పిల్ల అని ప్రేమగా కూతురి జుట్టు నిమిరింది.

## 27

అప్పటి నుంచీ శ్రావణి పూర్తిగా మారిపోయింది.

ఎప్పుడూ అల్లరిగా, హుషారుగా తిరిగే ఆమెలో ఎక్కువ స్తబ్దత పెరిగింది.

జరిగింది తల్లి—తండ్రితో చెపుదామంటే



ఏదో పిరికితనం. భయం. నిజంగానే బావ అన్నంత పని చేస్తాడని అనుమానం ఒక వైపు. ఎక్కడకు వెళ్ళకుండా సాధ్యమయినంత వరకు తల్లిని అంటిపెట్టుకునే వుంటోంది.

అప్పుడే వచ్చిన రాజ్యం "ఏమిటమ్మా ఈమధ్య బొత్తిగా శ్రావణి రావటంమానేసింది?" అంది.

"ఏమోనే మీ ఇంటికే కాదు. ఈమధ్య ఎక్కడకూ పోవటంలేదు. పెద్దపిల్లవు అయ్యావు అల్లరి మానమని నేను చెప్పినా లక్ష్యపెట్టని మనిషి అకస్మాత్తుగా బుద్ధిమంతురాలయి పోయింది. మొన్న దేనికోసమో మీ ఇంటికి వెళ్ళమంటే వెళ్ళనని మొండికేసింది" అంది.

"మా ఆయన ఏవన్నా అన్నారేమో. అందుకే కోపం వచ్చిందేమో. చిన్నప్పటి నుంచి తెల్సిన పిల్ల కాబట్టి ఏదో అంటారు. శ్రావణి రావటం లేదేమని ఆయన కూడా పదేపదే అడుగుతున్నారు" అంది రాజ్యం.

"అదేం కాదులే. మీ ఆయన మంచితనం నాకు తెలియదూ."

"మీ అందరూ ఇలా నమ్మబట్టే ఆ దుర్మార్గుడు అలా చేస్తున్నాడు" అనుకుంది మనసులో శ్రావణి.

"ఏమే వచ్చి ఇంతసేపయినా నాతో కూడా మాట్లాడవు. నామీదకూడా కోపం వచ్చిందా?" అంది రాజ్యం చెల్లెలితో.

"ఏం మాట్లాడను ? అమ్మ మాట్లాడు తోందిగా" అని ఒక వెర్రినవ్వు నవ్వి వూరుకుంది.

"ఎందుకో దీనిలో మునుపటి హుషారు మచ్చుకయినా లేదు. ఏదో మార్పు కనపడు తోంది" అంది చెల్లెల్ని పరీక్షగా చూస్తున్న రాజ్యం.

"ఏదన్నా గాలిపట్టిందేమో. నాకు కూడా అనుమానంగానే వుంది. దేనికో వూరికే భయ పడుతోంది. నిద్రలో మాటిమాటికి ఉలికిపడటం ఏవేవో పిచ్చిమాటలు. ఆ మధ్య ఒకసారి రాత్రి వేళ ఏదో పిచ్చికల వచ్చిందని లేచింది. అప్పటి నుంచే ఇదీ వరస. నాల్గు రోజులు పోతే అదే మామూలుగా తయారవుతుంది కానీ, నీ ఆరోగ్యం ఎలా వుంది" అని మాటల్లో పడింది శాంతమ్మ.

వాళ్ళిద్దరూ ఒకేచోట వుండటం చూసిన శ్రావణికి నోటి దగ్గరకు వచ్చికూడా ఆపుకుంది.

"నాకేగాలీ పట్టలేదు. నీ మొగుడే నా పాలిటి దయ్యమయ్యాడు" అని గొణుక్కుంది అక్కకేసి చూస్తూ.

ఆ సాయంకాలం ఇంటికి వచ్చిన శేషును చూడగానే కోపంతోపాటు భయం కూడా పెరిగింది. తల్లీ—తండ్రీ అతనికి మర్యాదలు చేస్తుంటే సహించలేక అక్కడ వుండటం

## శ్రావణి

ఇష్టం లేనట్లుగా వెళ్ళి దొడ్లో వంటరిగా కూర్చుంది.

ఎందుకో అటుగా వచ్చిన శాంతమ్మ కూతురిని చూసి—

"అదేమిటే అక్కా—బావా వస్తే నువిక్కడ వంటరిగా కూర్చున్నావు. లోపలికి రా" అంది.

మనసంతా కోపంగా, చిరాకుగా భయంతో వున్న శ్రావణికి ఏడుపు ముంచుకు వచ్చింది. మోకాళ్ళ మీద చేతులు పెట్టుకుని తనలో తనే ఏడుస్తూ కూర్చుంది.

"ఎందుకే ఏడుస్తున్నావు. ఇప్పుడు నేను ఏమన్నానని. నిన్ను చూస్తుంటే ఏదో పట్టి నట్లుగానే వుంది. ఏదన్నా తాడు కట్టించాలేమో" అంది కూతురికి దగ్గరగా వచ్చి.

ఎవరికత్తయ్యా ? అంటూ వచ్చాడు శేషు.

చూడగానే కోపంతో "వెళ్ళండవతలకి నాకేం లేదు. ఏ దయ్యం పట్టలేదు" అని అసహనంగా అరుస్తోంది శ్రావణి.

"ఇదీ అల్లుడూ వరస. అస్తమానం ఊరంట తిరుగుతుందిగా. ఏదో ఆవహించి వుంటుంది. అన్నం తినదు. దేనికో విపరీతంగా హడిలిపోతోంది. అడిగితే కారణం చెప్పదు. ఇప్పుడు నేను ఏమీ అనకుండానే ఏడుపు మొదలు పెట్టింది. నాకేమిటో భయంగా వుంది" అంది.

"నిజమేనండి పెళ్ళి కావల్సిన పిల్లకూడాను. మనం ఏదో చెయ్యాలి" అంది రాజ్యం.

"మీరేం కంగారు పడకండి. కాస్త విభూది తెచ్చి పెట్టామంటే అన్ని భయాలుపోయి మామూలు దారికి వస్తుంది. ఏమే మరదలా?" అన్నాడు.

"వదులు ! నువ్వంటే అసహ్యం. నీ ముఖం

### "పీడన"

కుంభ వర్షం
కురిపించానంటూ
కులికి పోకుమా
శ్రావణ మేఘమా !
కట్నం కోసం
పీడింపబడుతున్న
ఒక ఇల్లాలి
కళ్ళముందు నువ్వెంత ?
హస్తి ముందు
మశక మంత —

— వీరపల్లె వీణావాణి

కూడా చూపించకు" అని చెయ్యి విడిపించుకుని ఇంట్లోకి పరుగెత్తింది ఏడుస్తూ.

"చూశారా, నిజంగా ఇది గాలి లక్షణమే" అంది రాజ్యం.

"కాస్త ఆదేదో తెచ్చి పుణ్యం కట్టుకో అల్లుడు" అంది దిగులుగా శాంతమ్మ.

## 28

గడువు దగ్గరకు వస్తున్న కొద్దీ శ్రావణికి దిగులు ఎక్కువయి అన్నం నీళ్ళు మానేసింది. బాగా చిక్కిపోయింది. ఎప్పుడూ నీళ్ళు నిండిన కళ్ళతో కూర్చుని దిగులుగా ఆలోచిస్తూ వున్న కూతురిని చూడగానే తల్లి తండ్రికి కంగారు ఎక్కువ అయింది. ఇంక లాభం లేదని కూతురు వారిస్తున్నా లక్ష్యపెట్టకుండా ఆ వూరి ఆయుర్వేద వైద్యుడు శతభిషాచారి దగ్గరకు తీసుకువెళ్ళారు

అటు భూత వైద్యం లోనూ, ఇటు ఆయుర్వేదం, నాటుమందులు వాడటంలోను మంచి హస్తవాసి కలవాడిగా పేరు తెచ్చుకున్న ఆయన ఆ వూరికి దేముడులాటివాడు. అందుకే జనం కోకొల్లలుగా వస్తారు.

విషయం మొత్తం చెప్పారు శ్రావణి తల్లితండ్రులు.

కాసేపు ఆలోచించి ముందుగా శ్రావణి గడ్డం పైకెత్తి నుదుట విభూది పెట్టాడు.

అలా వరుసగా పది రోజులపాటు విభూది, తీర్థం సేవిస్తే అమ్మాయికి పట్టిన పీడ తొలగి పోతుందని ఇది గాలి లక్షణమని చెప్పాడు.

అతడు నుదుట బొట్టు పెట్టగానే ఎందుకో ఒక్కసారిగా శరీరం జల్లుమన్నట్లుగా అన్పించింది శ్రావణికి. వరుసగా రోజా ఆలా వస్తే పట్టిన పీడ వదిలి అమ్మాయి పెళ్ళికూడా కలిసివస్తుందని చెప్పాడు వైద్యుడు.

"అంత దూరంనుంచి అమ్మాయి వక్కతే రావాలంటే కొంచెం కష్టం. విభూది ఇంటికి ఇస్తే తీర్థం కోసం ఎవరినయినా పంపుతాను" అన్నాడు శ్రావణి తండ్రి.

"అలా వీల్లేదు. రోజూ దేవి పూజానంతరం ఇక్కడే ఇవ్వాలి. అప్పుడే దుష్టగ్రహ నివారణ అవుతుంది. అమ్మాయి స్వయంగా రావల్సి వుంటుంది" అన్నాడు.

దాంతో గత్యంతరంలేక ఒప్పుకున్నారు.

మొదటి రెండు రోజులు శ్రావణితోపాటు ఆమె తండ్రికూడా వచ్చినా తర్వాత వీలులేక పోయింది.

"అంతా మన వూరివాళ్ళేకదు నాన్నా. ఆ దారేం కొత్తదికాదు. నేను వెళ్ళివస్తాను" అని కూతురు గట్టిగా చెప్పటంతో వాళ్ళు సరే అన్నారు.

అప్పటినుంచి శ్రావణి ఒక్కత్తే రోజా వెళ్ళివస్తోంది. కూతురిలో ఏర్పడ్డ కొంత మార్పు చూసి వాళ్ళుకూడా సంతోషించారు.

# ప్రేమ్ సబ్బుతో స్నానం
# రోజంతా ఉల్లాసం

మీ శరీ[illegible] మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్య[illegible] పొందించు సబ్బు ప్రేమ్.
[illegible]మైన నురగ, పరిమళము
[illegible] మనసును పులకింపజేయును.




గులాబి మరియు ఆకుపచ్చ
రంగులలో లభించును



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Imageads M-1783

ఆరోజు శ్రావణి తీర్థం పుచ్చుకోవటానికి లోపలికి వెడుతుంటే లోపల్నించి వస్తున్న శేషును చూసి ముఖం పక్కకు తిప్పుకుంది అసహ్యంగా. విచిత్రం మునుపటి భయం లేదామె మనసులో ఇప్పుడు. కానీ ఈ చీడపురుగు ఇక్కడి కెందుకు వచ్చాడా అని అనుకుంది. ఎందుకు వస్తే తనకెందుకు అనుకుంది. ఆ రోజుతో తీర్థం చాలని పూజలో పెట్టిన తాయత్తు తనే స్వయంగా ఆమె చేతికి కట్టి నుదుట కుంకుమ పెట్టి అంతా సవ్యంగా వుందని చెప్పాడు శతభిషాచారి.

శ్రావణి మనసెంతో నిశ్చింతగా వుందిప్పుడు. చేలగట్టుమీద నుండి చక చకా నడిచి వస్తున్న శ్రావణికి అడ్డం తగిలాడు శేషు.

"గడువు పూర్తయిపోతోంది. ఏంచేశావు మన విషయం ?!" అన్నాడు దారికి సైకిలు అడ్డంగా పెట్టి సిగరెట్ వూదుతూ.

"నీలాటి పశువుకి ఎన్నిసార్లు చెపితే ఏమిటి. రేపే మా వాళ్లందరి సమక్షంలో నీ గురించి చెపుతాను. నిన్ను అల్లరి చేసి, నల్గురిలో తల వంచుకునేటట్లు చెయ్యకపోతే నా పేరు శ్రావణేకాదు" అని ఎదురుచూడని విధంగా చెప్పి అతన్ని తప్పించుకుని ముందుకు నడిచింది వేగంగా.

అప్రతిభుడయి నిలబడిన శేషు బుర్ర ఒక్కసారి గిర్రున తిరిగింది.

## 29

గుళ్లో పురాణం చెపుతుంటే వెళ్లారు శ్రావణి తల్లితండ్రులు.

శ్రావణి మాత్రం ఒంటరిగా వుంది.

పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చిన శేషు గభాల్న మరదలి రెండు చేతులు పట్టుకున్నాడు తనను క్షమించమంటూ.

# శ్రావణి

"మళ్లీ ఇదొక కొత్త నాటకమా ?" అంది శ్రావణి.

"లేదు శ్రావణీ, నిజంగానే చెపుతున్నాను. నన్ను క్షమించు. కళ్లు మూసుకుపోయి నీయందు చాలా తప్పుగా ప్రవర్తించాను. బాగా బుద్ధి వచ్చింది" అన్నాడు పశ్చాత్తాపంగా.

"ఏం ఇంతలోనే మనసు మార్చుకున్నావు. నల్గురిలో అల్లరి చేస్తాననేసరికి తిక్క తిరిగింది. అంతేనా ?" అంది.

"నేను చేసింది ఎంత తప్పుడు పనో ఒక్కసారి ఆత్మవిమర్శ చేసుకున్నాను. నల్గురిలో నవ్వులపాలు కాకూడదనే నిన్ను క్షమించమని అడుగుతున్నాను. నువ్వు క్షమించానని అంటేనే; నేను ఇక్కడనుంచి కదిలేది" అన్నాడు.

"నువ్వు మారావని నీ మనసులో వున్నది సదుద్దేశమని, నన్ను ఎట్లా నమ్మమంటావు. నువ్వు చేసిన పనికి నా చేతులు కాదు పట్టుకోవల్సింది కాళ్ళు" అంది గంభీరంగా.

పాలిపోయిన ముఖంతో నిలబడ్డాడు శేషు.

"అవునులే రేపు మా అమ్మా నాన్నల ఎదుట నా కాళ్ళు పట్టుకోవాలని నీ ముఖాన రాసి వుంటే ఇప్పుడెలా పట్టుకుంటావులే" అంది నవ్వుతూ.

తప్పనిసరిగా చేసిన తప్పుకి ఫలితంగా శ్రావణి కాళ్ళు పట్టుకున్నాడు శేషు.

"పాముని సాధుజంతువుగా నమ్మటం ఎంత అవివేకమో నన్ను మంచివాడిగా నమ్మటం కూడా అంతే. ఇదంతా నా దురదృష్టం. ఒక్కసారి చెడ్డపేరు తెచ్చుకున్న నాకు మళ్ళీ మంచిపేరు ఎలా వస్తుంది. ఈ వూరు నుంచే కాపురం మార్చేస్తాను. దూరంగా వుంటేనన్నా నీ అభిమానానికి పాత్రుడనవకల్గుతాను. జరిగింతా ఒక పీడకలగా మర్చిపోయి నన్ను క్షమిస్తానని ఒక మాటివ్వు శ్రావణీ" అని కన్నీరు కార్చాడు శేషు.

కేవలం తనని బెదిరించటమే కానీ ఏ అఘాయిత్యమూ చెయ్యలేదు. నల్గురికీ చెపుతాననేసరికి భయపడి ఇప్పుడు క్షమార్పణ కోరుతున్నాడు. ఈ గొడవను పైకి తేవటం తన తెలివితక్కువ తనమేమో. అసలే పల్లెటూరు. పుకార్లకి పెట్టిందిపేరు. అందుకనే, బాగా ఆలోచించి ...

"ఎంతయినా పెద్దవాడివి, పైగా అక్క మొగుడవని జాలిపడి ఈసారి వదిలేస్తున్నాను. జీవితంలో మరే ఆడపిల్ల కాళ్ళు పట్టుకునే స్థితికి దిగజారకు" అంది.

"ఎంతయినా, నీది గొప్ప మనసు శ్రావణీ. ఈ విషయం ఎవరికీ చెప్పవద్దు. మనిద్దరి మధ్యనే వుండిపోవాలి. నా గురించి నీకే భయం వుండదు. నేను పూర్తిగా మారిపోయాను." అని మరొకసారి ఆమెకు కృతజ్ఞతలు చెప్పి కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు శేషు.

అతను వెళ్ళిన వైపే చూస్తుండిపోయిన శ్రావణి తనలో తనే చిన్నగా నవ్వుకుంది. పిరికి పంద. నల్గురికీ చెపుతాను అనేసరికి తోకముడచాడు. తను ధైర్యంగా ఎదుర్కొబట్టి సమస్య సులువుగా పరిష్కారం అయింది. తనకీ ధైర్యం కల్గచేసిన వైద్యుడికి మరొకసారి మనసులోనే కృతజ్ఞతల్లు చెప్పుకుంది.

తేలికపడ్డ మనసుతో చాలా రోజుల తర్వాత కంటి నిండుగా నిద్రపోయింది శ్రావణి.

## 30

"ఇది అక్కా జరిగింది. నా జీవితంలో ఏర్పడ్డ చిన్న అఘాతమిది. కానీ ఇది కేవలం తాత్కాలికం మాత్రమే. తరువాత నా పెళ్ళి జరగటానికి మా బావ చాలా శ్రమ పడ్డాడు. అటువంటి బావను ఎలా అనుమానించ కల్గుతాము" అంది భారంగా చెప్పటం ముగించిన శ్రావణి.

బుగ్గన చెయ్యుంచుకుని ఆమె చెప్పిందంతా విన్న ప్రమీల "అయితే ఇంకేం జరగలేదన్న మాట" అంది సాలోచనగా.

"ఉహు" అంది శ్రావణి.

"అవును మీ ఊరి ఆయుర్వేద వైద్యుడు ఎలాటివాడు ?" అంది మళ్ళా ప్రమీల.

"చాలా మంచివాడు. అసలాయన చిటికెడు విభూదివల్లనే నా కంత మనోధైర్యం వచ్చింది" అంది.

"శ్రావణీ ! నీ అమాయకత్వమే నిన్ను సమస్యలలో ఇరికిస్తోంది. మీ బావ బెదిరింపులకు నువ్వు భయపడ్డావు. జరిగిన విషయం మీ వాళ్ళతో చెపుదామా ? వద్దా అని నువ్వు పడే బాధ గుర్తించక మీ వాళ్ళు నీకేదో పట్టిందని



ఆపోహపడ్డారు. కేవలం ఆ వైద్యుడు మీదనున్న నమ్మకంవలన ఆయన ఇచ్చిన చిటికెడు విభూది తోనే నీకేదో మానసికంగా ధైర్యం చిక్కిందని నువ్వు ఆపోహపడ్డావు. ఆయనమీద, ఆయన వైద్యంమీద వున్న గురిచేత నీకలా అన్పించింది కానీ అసలు నీకేమీః కాలేదు. మీ బావ ఆ వైద్యుడి దగ్గరకువెళ్ళటం నువ్వు చూశానని చెప్పావుకదు.''

''అవును..''

''మరి నువ్వారాత్రి సుఖంగా నిద్రపోయావు కదా. మర్నాడేం జరిగింది ?'' అంది ఆత్రంగా ప్రమీల.

''మర్నాడు నేనసలు లేవందే. ఆ రాత్రే నాకు జ్వరం మొదలయిందట.''

''లేదు జరిగిందేదో ఆ రాత్రే జరిగింది. అదే తెల్సుకోవాలి'' అంది ప్రమీల.

''అదెలా తెలుస్తుంది ?'' అంది శ్రావణి.

''చూద్దాం. ఎలాగోఒకలా తెల్సుకుందాం'' అంది.

''అదంత సులభంగా తెల్సుకోవటం జరిగే పనా'' అనుకుంది నిరాశగా శ్రావణి.

## 31

ప్రమీల చెప్పినదంతా విన్న కైలాష్''అయితే విలన్ శేషుయే అయి వుంటాడు'' అన్నాడు.

''నాకూ అలాగే అన్పిస్తోంది. అది కేవలం మన అనుమానమే కానీ ఆధారాలు లేవుగా. జరిగిందేదో ఆరాత్రే జరిగివుండచ్చు. పైకి తన మీద నమ్మకం కల్గించడానికి మరదలిని క్షమార్పణ కోరేడేతప్ప, తర్వాత తను చేసేదేదో చేశాడు. నా అయిడియా కరెక్టంటారా ?'' అంది ప్రమీల.

''చూడు ప్రమీ ! ఆ అమ్మాయి కాపురం గురించి మనం ఇంత తల బద్దలు కొట్టుకోవటం ఎందుకు చెప్పు ? టైమ్ వేస్ట్ తప్పించి. ఆ అమ్మాయిని ఏదో ఆర్ఫనేజికి పంపితే మన సమస్య ఈజీగా సాల్వ్ అవుతుంది.'' అన్నాడు.

''అదేమిటండీ మీరుకూడా అలాఅంటారు. పాపం ఏం ఆధారంలేదు. ఆమె బ్రతుక్కొక దారి చూపాలని నిర్ణయించుకున్నాను. మీకిష్టంలేక పోతే చెప్పండి. వేరేచోట ఏర్పాటుచేస్తాను'' అంది ప్రమీల సీరియస్‌గా.

''అబ్బా ! నీతో వచ్చిన గొడవ ఇదే. ప్రతి పాత్రలు అర్థంచేసుకుని వాస్తవంగా చిత్రీకరించే రచయిత్రివి అయివుండికూడా, కట్టుకున్నవాడు ఒక్కమాట అనగానే ఎందుకలా అపార్థం చేసుకుంటావు ?'' అన్నాడు లాలనగా.

''మరి మీ మాటలకు అర్థం ఆ అమ్మాయి ఇక్కడ వుండటం మీ కిష్టం వున్నట్లుగా లేదు'' అంది ప్రమీల.

అదికాదు ప్రమీ ... అన్నాడు భార్యను బుజ్జగిస్తూ కైలాష్.

''ఏదికాదు. ఆ అమ్మాయి వల్ల మీకేదయినా ఇబ్బంది వుంటే చెప్పండి.''

# ఇవేమన పద్యాలు







''ప్లీజ్ ! నోరు జారి ఏదో అన్నాను. నీ ఇష్టప్రకారం చెయ్యి. నేను రేపు ఉదయం కాంపుకు వెడుతున్నాను. రాగానే ఏంచెయ్యాలో ఆలోచిస్తాను. సరేనా ?'' అన్నాడు.

గర్వంగా సరేనంది ప్రమీల.

''అసలు ఆరోజు రాత్రి...''అంది.

''అదిగో మళ్ళీ ఆ నైట్‌ను గురించి ఈ నైట్‌ను వేస్టు చెయ్యకు. నేను రాగానే మాట్లాడుదాం సరేనా '' అన్నాడు భార్యకి చేరువవుతూ.

(ఇంకా వుంది)

# ధైర్యే...సాహసే..

మంత్రవాది మహేశ్వర్

చలపతి పాపం బి. యస్సీ పాసయ్యాడు. ఆ విషయం తెలియగానే వాళ్లమ్మ ముఖం చాటంత అయిందిగానీ, వాళ్ల నాన్న ముఖం జల్లెడంత కూడా కాలేదు సరికదా చింతపిక్కలా నల్లగా తయారైంది. తన వంశోద్ధారకుడికి ఎక్కడైనా ఉద్యోగం వుంటే చూడమని బజారులో కనబడి మినిమమ్ పదిపళ్ళైనా బయటపెట్టి నవ్వేవాళ్లందరికీ చెప్పాడు. పదహారువళ్ళు కనిపించేట్టు నవ్వి "అలాగే" అన్నారుగానీ నవమాసాలూ దాటినా ఎవ్వరూ ఏ యిన్‌ఫర్మేషనూ చలపతి తండ్రిగారి చెవిలో వడేయలేదు.

సినిమా పత్రికలు అక్షరం మిగలకుండా చదవడం, వాటిలోని తారల అర్ధనగ్న దృశ్యాలను చూసి ఏవేవో ఊహించేయడం, సాయంకాలాలు ట్రిమ్‌గా తయారై పిల్ల – గాలికి తిరగడం చలపతి ప్రస్తుత కార్యక్రమ వివరాలు.

స్టవ్‌మీద బాణట్లో ఏదో 'సుయ్'మంది... ప్రక్కింటావిడ పరిగెత్తుకొచ్చింది. అమ్మ ఏదో టిఫిన్ చేస్తున్నట్లుంది ... అవును ప్రొద్దున్న జంతికలు చేస్తానన్న విషయం గుర్తొచ్చింది చలపతికి... ఎంతో సంతోషం. మనసు గాలిలో సర్కస్‌ఫీట్లు చేస్తోంది. కారణం ఆ ప్రక్కింట్లో అందమైన అమ్మాయి వుంది ... ఆ అమ్మాయి సరోజ. సరోజ నవ్వితే చలపతికి ఎంతో భయం, టూత్‌పేస్ట్ కంపెనీవాళ్లు ఎత్తుకుపోతారేమోనని. తరచు వచ్చేది వాళ్ల అమ్మే. సరోజ రావటం చాలా తక్కువే. సరోజ మొన్నీమధ్యనే బి. ఎ. మొదటి సంవత్సరంలో చేరింది. పుస్తకం పట్టుకుని గుమ్మందగ్గరికి వచ్చినప్పుడల్లా గుడ్లప్పగించి మరీ చూస్తాడు చలపతి. కనీసం 'గుండీలు తీసిన మొనగాడు' అనిపించుకోవాలని కాబోలు చొక్కాకుండే గుండీల్లో పైవి రెండూ విప్పి వుంచుతాడు.

చలపతి వాళ్లమ్మ కామాక్షి తన గురించే పొగుడుతూ చెబుతోంది ఆవిడతో ... అది వినబడకుండా చేయాలని డొక్కు రేడియో చేసే ప్రయత్నాలను అణిచేయాలని కట్టేశాడు.

"ఏమండీ ఈ సంగతి విన్నారు, మొన్న గోపీనాధన్ ఆయన భార్యా సినిమా చూస్తుంటే భయపెట్టి, ఆవిడ గాజులు, గొలుసు లాక్కుని పోయారట నలుగురు దొంగ వెధవలు."

"గోపీనాదన్ కాదండి రాఘవయ్యగారూ వాళ్ళని విన్నాను ఆవిడే చెప్పింది ఆయన వాచీ లాక్కున్నారట నిన్న."

"అయితే మొన్న, నిన్నకూడా జరిగిందన్న మాట... చూశారా." ముక్కుమీద వేలు వేసుకుంది.

"అందుకేనండి అమ్మాయి పైపు ఆరు గంటల్నుంచుంటే పైవ్ మార్పించేశాను." సరోజ వాళ్ళమ్మ.

లోపల్నుంచీ యిదంతా వింటున్న చలపతి



వంటగదివైపు నడిచాడు. "భయపడకూడదండి. ఎదురుతిరిగి రోగం కుదర్చాలిగానీ బెదిరిపోతే లోకువైపోతాం..." హీరోలా అంటూ.

సరోజ లేడిపిల్లలా పరిగెత్తుకుంటూ వచ్చింది "నువ్వైతే మొగాడివి... అమ్మాయి వయసులోవున్న పిల్ల" అంటూండగా—

సరోజ అదోలా చూసింది చలపతివైపు.

చేతిలోని సినిమా పత్రికపైనున్న హీరోని సరోజకేసి చూపించాడు సింబాలిక్‌గా.

"తన్ని లాక్కునే దొంగ వెధవలకి ఆడా–మగా తేడా ఏముంటుందమ్మా" సరోజ.

"అది కాదు కోడలా... ఆడవాళ్ళకైతే చేతికి గాజులు, మెడలో గొలుసు కళ్ళకు తక్కున కనబడతాయి" కామాక్షమ్మ అందుకుంది.

చలపతికి వాళ్ళమ్మన్నదాంట్లో 'కోడలా' అన్నదే నచ్చింది.

"లాక్కోవాలంటే మగవాళ్ళ వాచీ లాక్కోలేరా... రాఘవయ్యగారి పనేమైంది" సరోజ.

"అది మనుషుల్నిబట్టి వుంటుంది. మనలో ధైర్యం వుంటే ఎవ్వరూ ఏమీ చేయలేరు" హీరోలా చలపతి.

"అవి సినిమాల్లో అనుకోవడానికే పనికొస్తాయి."

"ఆడవాళ్ళకు అంతకంటే ఏం తెలియదు" తన మాటే పైనున్నందుకు చలపతి సంబరపడిపోయాడు.

చలపతి వాళ్ళుండేది విశ్వాస్‌నగర్‌లో. బస్సుదిగి పావుగంట నడవాలి. కొంతవరకూ కాలనీల్లోంచే నడిచినా తరువాతే ఏంజరిగినా. అంతా నిశబ్దంగా వుంటుంది. చలపతి స్వంటు సినిమాలు ఎక్కువ







చూస్తాడు కనుక యిటువంటివి లెక్కపెట్టడు. నిజం చెప్పాలంటే ఇటువంటివి వినడమే గానీ జరిగెరగడు.

వరుసగా రెండురోజుల నుంచి ఏదో చిన్నా చితకా దొంగతనం జరుగుతునే వుంది. ఆ తరువాత రెండు రోజులేవీ లేదు. కానీ చలపతికి 'జరిగితే' అన్న అనుమానం బయలుదేరింది. దాంతో మాస్టర్ ప్లానేశాడు చేతి గడియారాన్ని చూసుకుని.

— ఆ రోజు తన అభిమాన నటుడి స్టంట్ సినిమా చూశాడు. మహాబోరుగా వుంది సినిమా. అయినా స్టంట్స్ బావున్నాయనుకున్నాడు. ఫ్రెండ్స్ తలొక మూలకి వెళ్ళిపోయారు. యిక మిగిలింది తనొక్కడే. బస్సు దిగి నడుస్తున్నాడు.

తరచుగా పగటి పూట వెలిగే లైటు పొరపాటున కాబోలు రాత్రి వెలుగుతోంది. అంతవరకూ బానేవుంది... కానీ అక్కడ స్తంభం ప్రక్కన నల్లచొక్కావాడు వెర్రిగా నవ్వాడు. వాడు నవ్వాడు కదాన్నట్లు నవ్వుతున్నాడు నీలం చొక్కావాడు. ... షోలే సినిమాలో గబ్బర్ సింగ్ గుర్తొచ్చాడు.

చలపతి అక్కడి దాకా వచ్చేసరికి హిందీలో కాదు హైదరాబాదు భాషలో ఏవో డైలాగ్స్ కొట్టడం మొదలెట్టారు.

'గొంతు' మినపరొట్టెంత లావుగా వుంది.

'అరేయ్ యిదరావ్' నీలం చొక్కా.

వెనక్కి చూసిన చలపతి భయపడ్డాడు. కానీ అభిమాన నటుడ్ని గుర్తుకుతెచ్చుకున్నాడు... ఒంట్లోకి ఆంజనేయ స్వామి ప్రవేశించేశారు. దండకం చదువుకోకపోయినా. అదీ కాకుండా తను ముందు యిలా జరుగుతుందని వూహించి వేసిన ప్లాను తలుచుకుని 'వెర్రివెధవలు' అనుకుంటూ ముందుకు నడిచాడు.

ఆగక తప్పింది కాదు.

నల్లచొక్కా అడ్డమొచ్చింది...

నీలం చొక్కా చేయి చలపతి చంపతో

## ధైర్యే ... సాహసే!

డ్యాయెట్టు పాడింది. అయినా దడవలేదు. వాడు కొట్టిన దెబ్బకు దవడలో వైబ్రేషన్స్ మొదలయ్యాయి. కాలేజీ రోజుల్లో 'ఫిజిక్స్' చూడకపోయినా గుర్తొచ్చాయి.

''వాచ్ నికాల్‌కే దేవ్‌ర్'' ఒకడు.

''తూదేనేకా క్యారే, మైహీం లేవుంగా'' అంటూ చేతిని లాక్కుని 'షాక్' తిన్నట్టు అయ్యాడు.

చలపతికి నవ్వొచ్చింది. కానీ నవ్వలేదు నీలంచొక్కా కళ్ళు ఎర్రగా మారినందుకు.

వాచీ చైనాకోటే పెట్టుకున్నాడు.

ఎదురుతిరిగితే వీపు విమానం మ్రోత మ్రోగించి 'దీపావళి' గుర్తుకు తేగలరు.

చాచి లెంప పగులకొట్టాడు నల్లచొక్కా వాడు.

'హమ్‌కో పాగల్ బనాతారే' నీలంచొక్కాలో పౌరుషం చలపతి చేయిని మెలికలు త్రిప్పుతోంది.

చలపతి ధైర్యం పారిపోయింది.

కళ్ళలోంచి నీరు కారేసుకొచ్చింది.

ఆ వీధిగుండా ఎవరైనావస్తే బావుండు ననుకున్నాడు. కానీ ఎవ్వరూ రావటంలేదు.

''షర్ట్ కెరీకాట్‌కా దిక్‌రా నికాల్'' నీలంచొక్కా ఆర్డరు జారీచేసింది.

* * *

అంతే చొక్కా లేదు.

మరో క్షణానికి మరో ఆర్డరు

* * *

డబుల్ నిటెడ్ పాంటు—పాంటులో దాచిన సీకో వాచీ.

ఆ రెండూ వాళ్ళు మడత పెట్టుకుంటు న్నారు.

డ్రాయర్, బనీనుతో నిలబడి వెళ్ళిపోతున్న ఆ యిద్దరికేసి చూస్తుండిపోయాడు.

ఆ ఇద్దరి నవ్వు తనని వెక్కిరిస్తున్నాయి.

సరోజ ముందు కొట్టిన హీరో పోజులేవి యిప్పుడు.

'చేసేదేముంది... తొందరగా యిక్కడ్నుంచి యిల్లు చేరుకోవాలి' త్వరత్వరగా నడిచాడు. ఎలక్ట్రిసిటీ బోర్డువారి ధర్మమా అంటూ అక్కడ స్ట్రీట్ లైట్సేమీ వెలగటంలేదు...

అరె... సరోజ వాళ్ళింట్లో లైట్లింకా వెలుగుతున్నాయి. కొంపదీసి చూడరుకదా — అనుకుంటూ కంగారుగా నడిచాడు.

రేడియోలో జనరంజని యింకా పూర్తి కా లే దు. 'భలే భలే మగాడివోయ్' పాట జోరుగా వినిపిస్తోంది. అంతవరకూ లోపలెక్కడో వున్న సరోజ అప్పుడే కిటికీదగ్గరకొచ్చి వెన్నెట్లో ప్రక్కింటిగేటు తెరుస్తున్న చలపతిని చూసి గుర్తుపట్టిందో లేదో తెలియదుగానీ కెవ్వుమని కేకవేసింది. □

## మంకెన పూలు

నేలచూపులు చూసే
మంకెన పూలే
ఈ వ్యవస్థలో
బాధపడే నేత్రాలు —
శిరసెత్తితే
కనిపిస్తుంది
ఎర్రబడిన ఆకాశం
ఉదయ కిరణాలతో
ఉద్యమిస్తే
వినిపిస్తుంది నవగీతం
పల్లవించే చరణాలతో !!!

— రామసూరి

సీరియల్

# ఒకే అమ్మ కథ

అన్నపూర్ణ

## 4

రోజులు వ్యవధిలోనే అవధాని కుదిర్చిన సంబంధం ఖాయమైపోయింది... పెద్ద హంగు ఆర్భాటం లేకుండానే అమృత వివాహం జరిగింది.

శోభనంనాటి రాత్రి ఎన్నో అలంకారాలు చేసి, చెవిలో గుసగుసలుచెప్పి అమృతను గదిలోకి నెట్టి తలుపులు బిగించారు అమ్మలక్కలు.

గదిలో అడుగుపెట్టిన అమృత స్త్రీ సహజమైన సిగ్గు బిడియాలను అభినయించి తల దించుకోలేదు. పూవులతో అలంకరించిన పాన్పును, తన మెడలో తాళికట్టిన వ్యక్తిని పరికించి చూడసాగింది.

జరీ అంచు ధోవతి కట్టుకొని, సిల్కు లాల్చీ వేసుకొని ఠీవిగా వాలుకుర్చీలో కూర్చొని చుట్ట కాలుస్తున్నాడు సుందరరామయ్య. తను తాళికట్టిన భార్య గదిలోకి వచ్చిందనీ, ఇప్పుడు తామిద్దరే గదిలో ఉన్నారనీ ఆయనకు తెలుసు, ఐనా ఏమీ పట్టనట్లే ఊరుకుండిపోయాడు.

'గదిలోకి వెళ్ళగానే మొదట నీ భర్త పాదాలకు నమస్కరించు' — అమ్మలక్కలు చెవిలో చెప్పింది మననం చేసుకొని — అలా చేద్దామని రెండడుగులు ముందుకు వేసింది అమృత. ఆమె కదలికను ఓరకంటితో గమనించి నట్లున్నాడు సుందరరామయ్య.

"నన్ను నువ్వు ఇష్టపడే పెళ్ళి చేసుకున్నావా ?" అనడిగాడు.

టక్కున ఆగిపోయింది అమృత.

"అది మీరు నా మెడలో తాళికట్టక ముందు అడగాల్సినమాట. పెళ్ళైపోయాక ఏ ఆడదాన్నీ మొగవాడు అలా ప్రశ్నించకూడదు. ప్రశ్నించినా సరైన సమాధానం రాదు" అంటూ తెలివిగా జవాబు చెప్పింది.

ఆమె సమాధానం విని ముసి ముసిగా నవ్వుకున్నాడు సుందరరామయ్య.

"ఐతే ఇష్టపడే నన్ను చేసుకున్నావన్న మాట" అంటూ కూర్చున్నచోటునుంచి లేవబోయిన ఆయనకు పెద్ద దగ్గుతెర వచ్చింది. ఆ వెంట ఆయాసం, రొప్పు వచ్చాయి.

(గత సంచిక తరువాయి)

తన భర్త బాధతో నరకయాతన అనుభవించటంచూసి దగ్గిరికి వెళ్ళింది. జాలితో అతడి గొంతు దగ్గిర చేయివేసి సవరించింది... దాదాపు ఒక అర్ధగంట గడిచాకగాని తేరుకోలేక పోయాడు సుందరరామయ్య.

"అసలేం జరిగింది ? మీ రెందుకు ఇలా అయ్యారు ?" అడిగింది స్థిమితం చిక్కాక.

"నా దగ్గు, ఆయాసం— ఈ నరక యాతన చూశాక కూడా నీకు అంతుబట్టలేదా? నాకు ఆస్మా— ఉబ్బసం ఉంది అమృతా !... అవధాని చెప్పలేదా ?" అనుమానంగా చూశాడు.

"లేదు .."

"అంతా మీకు చెప్పాననీ, ఐనా మీ వాళ్ళు ఒప్పుకున్నారనీ అన్నాడే ?"

"పోనీలెండి. జరగవలసిందేమో జరిగిపోయింది. ఇకనైనా మీరు శ్రద్ధ తీసుకొని మందులు వాడండి. అదే తగ్గిపోతుంది."

> **జరిగిన కథ—2:** మూర్తి భార్య బలవంతంపై భార్య మణి, కుమారుడు ఉదయ్‌లో కలసి కొండపాడు 'అమ్మ' ఆశ్రమానికి వెళతాడు. అక్కడ 'అమ్మ' భక్తుల ప్రశ్నలకు ఇచ్చిన సమాధానాలు అతనికి నచ్చాయి. తన అనారోగ్యం గురించి ఆమెకు నివేదించుకొని ఆమె సలహాప్రకారం ఆ ఆశ్రమంలోనే కొద్ది రోజులు ఉండను నిశ్చయించుకున్నాడు. పై విషయాలన్నీ స్నేహితుడు జగన్‌కు ఉత్తరం ద్వారా తెలియపరచి అతనిని ఒకసారి వచ్చి ఆశ్రమం దర్శించమని రాసాడు. ఆశ్రమానికి వచ్చిన జగన్ అమ్మను అమృతగా గుర్తిస్తాడు. అమృత తన విచిత్ర కథను మూర్తి దంపతుల కోరికపై చెప్పసాగింది— వేణుగోపాలస్వామి గుడిలో అర్చకుడు గోవిందయ్య కూతురు అమృత. ఊరి పెద్దల సలహాపై కూతురిని ఒక రెండవ పెళ్లివాడికి ఇచ్చి పెళ్లి జరిపించను అంగీకరిస్తాడు గోవిందయ్య.

ఆమె అమాయకపు సలహా విని గట్టిగా నిట్టూర్చి, "అలాగేలే" అని ఊరుకున్నాడు సుందరరామయ్య.

"మీరు మంచంమీద పడుకోండి. నేను క్రింద పడుకుంటాను" అంది అమృత.

కాదనకుండానే లేచి వెళ్ళి మంచంమీద కూర్చున్నాడు, వెంటనే పడుకుంటే మళ్ళీ దగ్గుతెర వస్తుందేమోనని.

అమృత పక్కమీది ఒక దుప్పటి తీసుకొని నేలమీద పరుచుకొంది.

"అమృతా నాకు కావలసినంత ఆస్తి ఉంది. చుట్టుప్రక్కల మంచి పలుకుబడీ ఉంది. ఐతే నాలో లోపించింది ఒక్క ఆరోగ్యమే. ఈ వ్యాధి నాకు చాలా కాలం నుంచీ ఉంది. డబ్బుకలవాణ్ణి కాబట్టి ఎన్నో వైద్యాలు చేయించాను. కొన్ని కొన్ని మందులు వాడిన తర్వాత కొంత కాలం పాటు సుగుణం కనిపించినా తర్వాత తిరగబెట్టటం రివాజే. ఆ కారణంగానే నా భార్య గతించి ఐదు సంవత్సరాలైనా నేను పునర్వివాహానికి తలపడలేదు... అలాంటిది అవధాని మా ఇంటికి ఏ ముహూర్తాన వచ్చాడోగాని— నా చేత ఔననిపించిగాని వదల్లేదు. అదీ కాకుండా ఈ మధ్య నా ఆరోగ్యమూ కొంత కుదుటపడిందనిపించింది. దానికి తోడు మా అమ్మగారు "నీకేం వయసు మించిపోయిందనీ, రెండో పెళ్ళి చేసుకో" అంటూ ఒకటే పోరు—ఎలాగైతేనేం నీ మెడలో తాళి కట్టాను. ఐతే నా ఆరోగ్యం కొంతవరకు బాగుపడిందని నేను అనుకోవటం వట్టి భ్రమ అని ఇందాక వచ్చిన దగ్గు, ఆయాసం వల్ల తేలిపోయింది... మొత్తానికి నా వల్ల నీకు అన్యాయమే జరిగింది అమృతా..." అంటూ నెమ్మదిగా వత్తిగిలి పక్కమీద పడుకున్నాడు సుందరరామయ్య.

భర్త మాటలు శ్రద్ధగా విన్నదే గాని ఏ విధంగానూ చలించిపోలేదు అమృత. చీకు చింత ఆమె మనసుకు లేవు కనుకనే నిద్ర పట్టేసింది. కాకపోతే ఆమెను కన్నతండ్రి అయినందున గోవిందయ్యకే నిద్ర పట్టలేదు ఆ రాత్రి.

అవధానితో వెళ్ళి మొట్టమొదటిసారిగా తనకు కాబోయే అల్లుణ్ణి చూసినప్పుడే ఆయనకు

కడుపు నిండిపోయింది. ధగ్గిర దగ్గిర తన వయసుతో సమానంగా ఉన్న ఆ వ్యక్తికి పట్టుమని పదహారేళ్ళు కూడా నిండని తన కూతుర్ని కట్టబెట్టటమా అని తటపటాయించాడు. కానీ, లక్ష్మీపతి తొందరపెట్టాడు. 'ఈ అవకాశం పోతే తిరిగి రాదు గోవిందయ్యా' అని అవధాని హెచ్చరించాడు. 'పెళ్ళి చేసుకొనే దాన్ని నేను. నాకులేని బాధ నీ కెందుకునాన్నా?' అమృత ఒక అడుగు ముందుకు వేసింది. 'పిచ్చి తల్లీ, మనమీద జాలిపడి కాదమ్మా వీళ్ళు ఈ సంబంధం కుదిర్చింది ?... చేసిన తప్పుకు నిన్ను శిక్షించటానికి !... నువ్వు చేసిన కొద్ది నేరానికి నీ జీవితాన్నే బలి తీసుకుంటున్నారు ఈ హృదయం లేని మనుషులు' అని లోలోపల రోధిస్తూనే పెళ్ళిచేశాడు గోవిందయ్య. ఆ బాధ ఆయన్ని అహర్నిశలూ వేధిస్తూనే ఉంటే ఇక నిద్ర ఎలా పడుతుంది ?

## 5

''మా మధు వచ్చాడు. నేను వచ్చి చెప్పే దాకా నువ్వు బయిటికిరాకే అమ్మాయ్. ఇక్కడే ఉండు'' అని అమృతను వంట ఇంట్లోనే కూర్చోబెట్టి 'తెలిసిందా ?' అన్నట్లు కళ్లతో హెచ్చరించి అవతలికివెళ్లింది అత్తగారు నాంచారమ్మ.

మధు వచ్చాట్ట. వస్తే ఏం ? తను బయటికివెళ్లి ఎందుకు కనిపించకూడదు ? అన్నట్లు మధు తనకు ఏమైతాడు ? కొడుకు వరుస— అతడు తనని ఏమని పిలవాలి ! 'అమ్మ' అనా ? కాదు కాదు 'పిన్ని' అని. అత్తగారు వట్టి ఛాందసురాలు... ఆమె మాటకు ఎదురు చెప్పడు తన భర్త. రోజూ చూస్తూనే ఉందిగా వాళ్ల పద్ధతి !

''...చివరికి మీరింత హీనస్థితికి దిగజారుతారని అనుకోలేదు నాన్నా !... అసలు మీరు పునర్వివాహం చేసుకోబోతున్నట్లు నాకొక ఉత్తరం ముక్కనైనా రాయలేదేం ? '' తండ్రిని నిలదీసి అడుగుతున్నాడు మధు. ఆ మాటలు స్పష్టంగా వినిపించి లేచివెళ్లి తలుపు చాటుగా నిలబడింది అమృత.

సుందరామయ్యకు బదులు నాంచారమ్మ కంఠం ఖంగున వినిపించింది.



## ఒక అమ్మ కథ

"ఉత్తరం రాస్తే వచ్చి ఏంచేసేవాడివి ? పెళ్లి జరగకుండా ఆపేవాడినంటావ్. అంతేనా ? నువ్వు వట్టి ప్రథమావేశపరుడివి. ఎంత చదువుకున్నవాడివైనా, తెలివిగలవాడివైనా కన్నతండ్రి ముందు మాట్లాడవలసిన పద్ధతి ఇదికాదురా అబ్బాయ్... మీ నాన్న మాత్రం కానిపని ఏం చేశాడు ? మొదటి భార్య పోయింది. రెండో పెళ్లి చేసుకున్నాడు. వాడికీ వయసుంది. ఉప్పుకారం తింటూనే ఉన్నాడు వాడూను ... అవతల పిల్లనిచ్చిన వాళ్లు, చేసుకున్నపిల్ల అంతా బాగానే ఉన్నారు. మధ్యన నీకెందుకురా ఈ కంఠశోష ?" అనడిగింది.

"బామ్మా ! నువ్వు చెప్పింది నిజమే. కాదనను మొదటి భార్య పోయిన వ్యక్తి పునర్వివాహం చేసుకోవటానికి అనర్హుడని నేను అనను. ఐతే నాన్నగారి ఆరోగ్యం మాటేమిటి ? ఆయనే అందరిలా ఆరోగ్యంగా తిరుగుతుంటే నేనిలా మాట్లాడే అవసరం ఉండేదేకాదుకద ? మొత్తానికి మీ తల్లీకొడుకులు ఓ కన్నెపిల్ల బ్రతుకును బలితీసుకున్నారు. నేను ఎక్కడ అడ్డుతగులుతానో అని తెలియకుండా అంతా గుట్టుగా చేసేశారు. భగవంతుడు కూడా మిమ్మల్ని క్షమించడు బామ్మా" అక్కసుగా అన్నాడు మధు.

ఒక కన్నెపిల్లకు జరిగిన అన్యాయం గురించి అతడు చెందుతున్న ఆవేదనను గమనించిన అమృతలో మధు అంటే గౌరవభావంలాంటిది ఏర్పడింది.

"బాబూ, మధూ ! నేను చేసింది తప్పే. ఒప్పుకుంటాను. ఐతే ఈ టెల్లాంటి మాటలతో కాకుండా ఒక కత్తి తీసుకొని నన్ను పొడిచెయ్. ఆవేశం చల్లార్చుకొని కసి తీర్చుకో...అంతే."

తండ్రి అలా దిగజారి మాట్లాడుతూండే సరికి మరొక్కక్షణంకూడా అక్కడ నిలబడబుద్ధి కాక గదిలోకి వెళ్లాడు మధు.

"పిల్లకాకికి ఏంతెలుసు ఉండేలుదెబ్బ అని—నిన్నగాకమొన్న కళ్లుతెరిచిన కుర్రకుంక, మనకే నీతులు బోధిస్తున్నాడు ! ... లలాట లిఖితం. జరగవలసిందేదో జరిగిపోయింది. అందును గురించి మనం మథనపడవలసిన అవసరం లేదురా అబ్బాయ్" అంటూ కొడుక్కు సర్దిచెప్పి తిరిగి వంటింట్లోకి వచ్చింది నాంచారమ్మ.

వంటగది గుమ్మందగ్గరే ఎదురైన అమృతను చూసి, "విన్నావా అమృతా, వాడి మాటలు ! నీకు మేమేదో అన్యాయం చేశామట!... ఏదో మీ నాన్న పేద కుటుంబీకుడనీ, నీకు పెళ్ళి చేయలేక బాధ పడుతున్నాడనీ అవధాని చెబితే జాలిపడి— సాంప్రదాయాకుల పిల్లవని కద నిన్ను ఈ ఇంటికి కోడలిగా తెచ్చింది ?... మీ నుంచీ మేం కట్నకానుకలు ఆశించామా, లేకపోతే కన్యాశుల్కం పోసి నిన్ను మా ఇంటికి బలవంతానా తెచ్చుకున్నామా?... ఇందులో మేం చేసిన తప్పేమిటో నువ్వైనా చెప్పమ్మా" అనడిగింది తెలివిగా.

"మీరు ఎలాంటి తప్పు చేయలేదు. నాకు మీవల్ల అన్యాయం జరిగిందనీ నేను అనుకోవటం లేదు. ఒక విధంగా మీదెంతో మంచి మనసు. అందుకే కటిక దరిద్రంలో మగ్గే నేను ఈ గొప్ప ఇంటికి కోడల్ని కాగలిగాను... మీ మనవడు గారు ఏదో ఆవేశంలో అలా మాట్లాడుతున్నారు తప్పితే నిజానిజాలు తెలిసికాదు. అతను గురించి మీరేం ఇదవకండి" అంది అమృత హృదయపూర్వకంగానే. చెడో, మంచో— నిజం నిజమే మరి ఆమె దృష్టిలో.

అంతకుముందే మంచినీళ్ళు త్రాగే నెపంతో— ముఖ్యంగా తన పిన్ని అనబడే వ్యక్తి ఎలా ఉంటుందో ఒకసారి చూద్దామని— అటుగా వచ్చిన మధు అమృత మాటలతీరు చూసి ఖిన్నుడైపోయాడు. ఇంత అన్యాయం జరిగి, జీవితం బలి ఐనా కూడా తనకేమిటో మేలు జరిగినట్లు భావిస్తున్న ఆమెను ఎలా అర్థం చేసుకోవాలో బోధపడలేదు. "బామ్మా, మంచి నీళ్ళు" అని తిరిగి తన గదిలోకి వెళ్ళిపోయాడు అతడు.

"వాడికి దాహంగా ఉన్నట్లుంది. మంచి నీళ్ళిచ్చి వస్తాను. పొయ్యిక్రింద మంట చూడు అమ్మాయ్" అని మంచినీళ్ళ జగ్గు, గ్లాసు తీసుకొని వెళ్ళింది నాంచారమ్మ

సుందరరామయ్యకు ఒక్కగానొక్క కొడుకు మధు. పట్నంలో చదువుతూ అక్కడే ఉంటున్నాడు. తనకు మాట మాత్రం కూడా తెలియకుండా తండ్రి పునర్వివాహం పేరిట ఓ కన్నెపిల్ల జీవితాన్ని బలి తీసుకోవటం అతడికి బొత్తిగా నచ్చలేదు.

### 6

అమృత పరిస్థితి తెలిసినవాళ్ళు, "అయ్యో, పాపం ! ఈ పిల్లకు నిజంగానే అన్యాయం జరిగిపోయింది. అంత ఆస్తిపాస్తులుంటే మాత్రం ఏం, మొగుడు రోగిష్టిమారి వాడు అయ్యాక?" అని వాపోతూంటారు. ఐతే అమృతకు మాత్రం అలాంటి దిగులు, విచారం ఏకోశానా లేవు.

ప్రాతఃకాలానే నిద్రలేస్తుంది. పాలేరు, పనిమనిషిలాంటి వాళ్ళు ఉన్నారు కనుక ఏ పని చేయనక్కరలేదు... సూర్యోదయం కాకముందే చన్నీటి స్నానం చేస్తుంది. "వేడినీళ్ళు కాగుతుండగా ఆ చలినీళ్ళెందుకమ్మాయ్ ?" అని నాంచారమ్మ కోప్పడితే, "ఫరవాలేదు. చన్నీళ్ళు నాకు అలవాటే అత్తగారూ" అంటుంది. స్నానమైనాక వెళ్ళి దైవమంటపం ముందు కూర్చుంటుంది. అంతే. ధ్యాన నిమగ్నమైపోయి ఒక గంటదాకా ఎవరు పిలిచినా ఉలకదు పలకదు. మొదట్లో నాంచారమ్మ కోడలిదంతా బూటకం అనుకొంది. తర్వాత తర్వాత ఆమెలోని దైవ

చింతనను అర్థం చేసుకొని — తనూ సహకరించటం మొదలు పెట్టింది దాదాపు అన్ని విషయాలలోనూ గూడా.

పగలు భోజనమైన తర్వాత కాసేపు విశ్రాంతిగా పడుకొంటుంది అమృత. ఆమె నిద్ర లేచేసరికి అత్తగారు మధ్యాహ్నపు కాఫీ సిద్ధం చేసి ఉంచేది. కాఫీ ఐనతర్వాత ఏదో పుస్తకం చదవటం మొదలు పెట్టేది. అది పౌరాణికం కావచ్చు, ఆధ్యాత్మికం కావచ్చు, సాంఘికమే కావచ్చు — ఫలానా పుస్తకమే చదవాలి, ఫలానది చదవకూడదన్న నియమ నిబంధనలు ఆమెకు లేవు...

రాత్రి గదిలోకి చేరేసరికి దగ్గుతూ, ఆయాసపడుతూ కనిపించేవాడు భర్త. అతడంటే జాలి అనిపించి తనకు తోచిన విధంగా సపర్యలు చేసేది... పగలు నిద్రపోవటం చేతనేమో రాత్రి ఎంతకూ కునుకుపట్టేదికాదు. మనసులో ఏమిటో అశాంతి, వెలితి! సంసార సుఖం లోపించటంవల్లా అంటే — అలాంటి కోర్కెలు తనలో ఏ కోశానా లేవు. తిండి, గుడ్డ, గూడు — వీట్నిగురించి ఆలోచించవలసిన పనేలేదు. ఏమిటో అంతుచిక్కని తపన, అనంతమైన ఆరాటం — వాటికి తట్టుకోలేక వెళ్ళి దైవమందిరం ముందు కూర్చోవటం మొదలు పెట్టింది. ఐనా మనసుకు శాంతి లభించినట్లు లేదు. ఇలా కాదని ఒకరోజు అర్ధరాత్రి తమ ఇంటికి ఎదురుగా ఉన్న దేవాలయంలోకి వెళ్ళి నిర్మానుష్యమైన ఆలయ మంటపంలో కొద్దిసేపు కూర్చునేసరికి తనలోని అన్ని ఆరాటాలు ఉపశమించిన అనుభూతి కలిగింది. దాదాపు ఒక గంటసేపు ఒంటరిగా అక్కడ కూర్చొని ఇంటికి వచ్చేసరికి — సింహద్వారం దగ్గిరే ఎదురైంది అత్తగారు నాంచారమ్మ.

"... ఎక్కడికి వెళ్ళావమ్మాయ్ ఈవేళప్పుడు ?" అనుమానంగా చూస్తూ అడిగింది.

"ఏమిటో... ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టకపోతే — అలా రామాలయానికి వెళ్ళి కాసేపు మంటపంలో కూర్చొని వచ్చానండీ—" ఉన్న విషయమే చెప్పింది అమృత.

"అవ్వ ! ఎంత నిద్రపట్టకపోతే మాత్రం ? అర్ధరాత్రి అలా తలుపులు బార్లాతీసి వెళ్ళవచ్చా? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు ?... ఏ దొంగవెధవో ఇంట్లో జొరబడితే ఇంకేమైనా ఉందా ?" అంటూ సున్నితంగా మందలించింది నాంచారమ్మ.

"పొరబాటే చేశాను అత్తగారూ !... ఇకముందు నేను వెళ్ళేటప్పుడు మిమ్మల్ని లేపి చెప్పి వెళ్తాలెండి..."

"అంటే ?... రోజూ ఇలా అర్ధరాత్రిపూట అపరాత్రిపూట దేవాలయానికి వెళ్ళవలసిందేనంటావా ?"

"మీ మాట మీరి ప్రవర్తించాలనుకోవటం నా అభిమతం కాదు అత్తగారూ... ఐతే దేవాలయానికి వెళ్ళి మంటపంలో కాసేపు కూర్చొంటే నాకెంతో మనశ్శాంతి అనిపిస్తుందండీ. దయచేసి నన్ను ఈ విషయంలో నిర్బంధించకండి..." అంటూ చేతులు జోడించింది అమృత.

కోడలి వయసు, ఆమె తమ ఇంట అడుగు పెట్టిన తీరు, తర్వాత ఎదురైన పరిస్థితి — అన్నీ తెలిసిన నాంచారమ్మ అమృత మనసును, తాపాన్ని కొంతలో కొంత అర్థం చేసుకోవటానికి ప్రయత్నించి జాలిపడి — "సరేలే... వెళ్ళి పడుకో" అంది ఆజ్ఞాపించినట్లు.

అది మొదలు అమృత తరచూ రాత్రిపూట అత్తగారికి చెప్పి దేవాలయానికి వెళ్ళి గంటల తరబడీ కూర్చొనిరావటం మొదలుపెట్టింది. అసలు కోడలు గుడిలో ఏం చేస్తోందో చూద్దామని ఒకటి రెండుసార్లు చాటుగా వెళ్ళి పరీక్షించి వచ్చింది నాంచారమ్మ. ఆమె వెళ్ళినప్పుడు అమృత మంటపంలో ఒక యోగీశ్వరురాలిగా కూర్చొని కనిపించింది. వీధి లైటు వెలుగు సరిగ్గా ఆలయ మంటపంమీదే పడుతుంది. 'అనుమానించదగ్గ పిల్లకాదు తన కోడలు' అన్న దృఢ అభిప్రాయం అప్పుడే కలిగింది ఆవిడకు.

మధు రెండవసారి శలవులకు ఇంటికి వచ్చాడు.

## 7

ఎప్పటిలాగే ఆ రోజు రాత్రి అమృత వచ్చి నాంచారమ్మను లేపి చెప్పి బయటికి వెళ్ళటం హాలులో పడుకున్న మధు కళ్ళారా చూశాడు. 'బామ్మకు చెప్పి ఈవిడ వెళ్ళేది ఎక్కడికి ?' అని కొద్దిసేపు ఆలోచించాడు. నాంచారమ్మ లేచి తలుపుగడి పెట్టి వచ్చి పడుకొంది. మరికొంచెంసేపు ఆగి గుట్టుచప్పుడుకాకుండా లేచి తలుపులు దగ్గిరగావేసి తనూ బయటికి వచ్చాడు మధు.

చుట్టూ కలియజూశాడు. కానీ, అమృత జాడ కనిపించలేదు. గొడ్లకొష్టంలో పడుకున్న పాలేరు పానకాలుగాణ్ణి లేపి కూపీ తీద్దామనుకున్నాడు. కానీ, అది విజ్ఞత అనిపించలేదు. పిన్నికి దైవభక్తి జాస్తి అని ఒకసారి బామ్మ చెప్పింది. 'ఒకవేళ ఈ పిచ్చిది అక్కడికే వెళ్ళిందేమో ?' అనుకొంటూనే దేవాలయంలోకి వచ్చాడు. కరెక్టైన తన అంచనాకు కించిత్ గర్వపడి, వెళ్ళి మంటపంలో ఏకాగ్రతతో కళ్ళు మూసుకొని కూర్చొనిఉన్న అమృతకు ఎదురుగా నిలబడ్డాడు.

ఐదు నిమిషాలు, పది నిమిషాలు గడిచాయి. కానీ, మధును గమనించనేలేదు అమృత. మూసిన కళ్ళు తెరిస్తేకద అతడు కనిపించటానికి ?... చివరికి మధుకే విసుగనిపించి తన రాక తెలియబరచటంకోసం సన్నగా దగ్గాడు. దాంతో తప్పనట్లే కళ్ళు తెరిచింది అమృత... వచ్చి ఎదురుగా నిలబడింది మధు అని గుర్తించినా అతడితో ఏం మాట్లాడో తోచనట్లు ఊరుకుండిపోయింది.

"కనిపించేది ఊబి అని తెలిసికూడా — ఏవో నమ్మకాలకు, ప్రలోభాలకులోనై దానిలోనే దిగుతారు కొంతమంది. అందులో కూరుకుపోయే సమయానికి కాపాడమని భగవంతుణ్ణి ప్రార్థిస్తారు. మనం కావాలని చేసుకున్నదానికి ఆ దైవం మాత్రం ఏం చేస్తాడు ?" అన్నాడు మధు, అమృత — ఆమె ఇప్పుడున్న స్థితిని గురించి సహజ రీతిలో ఆలోచించి.

"మన ఇద్దరం ఒకరికి ఒకరం ఎదురైన మొదటి సంఘటన ఇది... ఎలా సంబోధించాలో తెలియటం లేదు... ఐనా మీ తల్లిగారి స్థానం



# ఒక అమ్మ కథ

లోకి వచ్చినదాన్ని కనుక చొరవ తీసుకొని పేరు పెట్టే పిలుస్తాను... మధూ! నాకు ఎంత సూటిగా వచ్చి తగలాలని మాట్లాడేవో అంత వాడిగా వచ్చి గుచ్చుకుంటున్నాయి నీ మాటలు. కానీ, వాట్నిగురించి నేను బాధపడటంలేదు... నీ దృక్కోణంనుంచీ చూస్తే అవి పచ్చినిజాలే కావచ్చుకూడా. ఒప్పుకుంటాను... అదే నా మాటగా చెప్పాల్సివస్తే నీ ఊహల్లో ఏ మాత్రం నిజంలేదు... వయోవృద్ధులు, వ్యాధిగ్రస్తులు ఐన మీ నాన్నగార్ని పెళ్ళాడటం — అదొక ఊబిగా నేను భావించుకోలేదు... కేవలం కన్న తండ్రి బాధ్యత తీరిపోవటం గురించి నేను పెళ్ళి చేసుకున్నాను. ఆస్తిపాస్తులు, సుఖసంతోషాలను ఆశించనుకూడాలేదు. ఒకవేళ మా నాన్న మీ తండ్రిగారి వయసులోనేఉన్న మరో పేద వ్యక్తిని తీసుకువచ్చినా నేను నిరభ్యంతరంగా పెళ్ళాడే దాన్నే...'' అంది అమృత మధువైపు సూటిగా చూస్తూ.

''మరి ఎందుకు అర్ధరాత్రిపూట ఇలా దేవాలయానికివచ్చి ఒంటరిగా — దిక్కూ మొక్కూ లేనివాళ్ళలా కూర్చోవటం? ఊళ్ళో వాళ్ళు ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు?'' కొంచెం తీవ్రంగా ధ్వనించింది మధు కంఠం.

''ఇదొక పిచ్చిది అనుకుంటారు... నాకు చిన్నతనంనుంచీకూడా దేవాలయాలలో కొద్దిసేపు ఏకాగ్రతగా కూర్చుంటే మనశ్శాంతి మధూ... పగటిపూట ఇక్కడ అంత ప్రశాంతత ఉండదు. అందుకే రాత్రిపూట ఇలా వస్తున్నాను. ఈ సంగతి మీ బామ్మగారికికూడా తెలుసు'' చెప్పింది అమృత.

ఆ మాటలు, రాజీ ధోరణీ చూశాక కొంత చల్లబడ్డాడు మధు

''నువ్వు మనసుకు ప్రశాంతత కోరి ఇక్కడికి వచ్చి కూర్చుంటున్నానంటే, నీలో అశాంతి చోటు చేసుకున్నట్లేకద?'' అడిగాడు తనూ కూర్చొంటూ.

''దేవుడిముందు దివ్వె వెలిగించటం— చుట్టూ చీకటి ఆవరించిందనేనా?''

టక్కున సమాధానం చెప్పలేక పోయాడు మధు.

''పగలు గాని, రాత్రిగాని దైవారాధనకు ముందు దివ్వెను వెలిగిస్తాం. అదొక ఆచారం. అంతేగాని వెలిగించిన ఆ దివ్వెకు ప్రకృతి ప్రసాదమైన చీకటి వెలుగులకు సంబంధమే లేదు... అలాగే నాలో అశాంతి గూడుకట్టుకు పోవటం వల్ల నేను ప్రశాంతత కోరి ఇలా అర్ధరాత్రిపూట అపరాత్రిపూట దేవాలయానికి వచ్చి కూర్చుంటున్నానంటావ్... అందుకు కారణాలూ నువ్వు వెతుక్కోవలసిన పనిలేదు. ప్రస్తుత నా వ్యక్తిగత పరిస్థితులు అలాగే ఉన్నయ్ మరి. కానీ నాలో భౌతికపరమైన ఆనందానుభూతులకు సంబంధించిన ఛాయలే లేవు. నా మాటలు నీకేమిటో వింతగా తోచవచ్చు... కానీ, నేను చెప్పేది యదార్థం!... సరే, మధుబాబూ... రాత్రిపూట నేనిలా దేవాలయానికి రావటం నీకు అభ్యంతరంగా తోస్తే నేను రానులే'' అంది అమృత.

''లేదు పిన్నీ. ఏదో ఆవేశంలో అన్నాను. నా మాటలు పట్టించుకొని నీ ప్రశాంతతను పాడుచేసుకోవద్దు'' అన్నాడు మధు.

''మొదటిసారి ఇంటికి వచ్చినప్పుడు నువ్వు మీ నాన్నగారితోను, బామ్మగారితోను వాదించిన తీరు చూసాను. అప్పుడే నీ హృదయం ఎలాంటిదో అర్థం చేసుకున్నాను... నేను ఈఇంటికి కోడలిగా వచ్చే విషయంలో వాళ్ళిద్దరూ నిమిత్తమాత్రులు. మీ నాన్నగార్ని చేసుకున్నందువల్ల నా జీవితం బలి అయిపోయిందని అనటాన్ని కూడా నేను సహించలేను...'' అంది అమృత— గతంలో అతడి మాటలు గుర్తు వచ్చి.

''అప్పుడు ఏదో ఆవేశంతో మాట్లాడాను పిన్నీ... ఇప్పుడు నీ మనసేమిటో కూడా తెలిసిందిగా? మరెప్పుడూ తొందరపడనులే'' అంటూ పరితాపం వ్యక్తం చేశాడు మధు.

మరి కాసేపటికి ఇద్దరూ అక్కణ్ణుంచీ బయలుదేరి వచ్చేశారు.

మధు, అమృత ఒకరి వెనుక ఒకరు లోపలికి రావటాన్ని అప్పుడే ఎందుకో మెలకువ వచ్చిన నాంచారమ్మ కళ్ళారాచూసింది! మనసులో ఏమిటో అనుమానం— ఐనా బయటికి పొక్కలేదు. కానీ, వయసులో ఉన్న వాళ్ళను గురించి లోలోపల తర్కవితర్కాలు చేసుకుంటూనే ఉంది ఆ ముసలి ఘటం.

## 8

రోజులు గడుస్తున్నయ్. నాంచారమ్మలోని అనుమానం అలాగే ఉండిపోయింది. పైగా ఆమె ఆ అనుమానానికి ఆజ్యం పోస్తున్నట్లు మారింది అమృత, మధుల దినచర్య.

> **దొరనోట్లు**
>
> బాధలు
> సూదులైతే
> జీవితం
> పిన్ కుషన్!
> ఆనందం
> అచ్చుతీస్తే
> లోకమే
> ప్రింటింగ్ మిషన్!
>
> — ఎమ్వీయల్

ప్రతి రోజూ అమృత గుడికి బయలుదేరిన కాసేపటికే మధు కూడా బయలుదేరటం, దేవాలయ మంటపంలో కూర్చొని ఇద్దరూ ఏదో విషయాలు మాట్లాడుకోవటం జరుగుతోంది... అసలు వీళ్ళిద్దరి తంతు ఏమిటో స్వయంగా తెలుసుకుందామని ఒక రోజు నాంచారమ్మ సి. ఐ. డి. లా వెళ్ళి చూసింది. ఆవిడ వెళ్ళే సరికి సదో విషయంమీద మాట్లాడుతున్నప్పుడు సందర్భాన్ని బట్టి నవ్వు వచ్చి ఉంటుంది. నవ్వుకొంటున్నారు ఇద్దరూ. పడక పడక ఆ దృశ్యమే నాంచారమ్మ కంటబడేసరికి ఏమాత్రం ఓర్వలేకపోయింది.

అక్కడి నుంచీ గుట్టుచప్పుడు కాకుండా ఇంటికి వచ్చి సరాసరి కొడుకు పడకగదిలోకి వెళ్ళింది.

అప్పుడు సుందరరామయ్య దగ్గు, ఆయాసంతో సతమతమౌతున్నాడు, నిద్రపట్టక.

''ఇప్పుడు మీయావిడ ఎక్కడికి వెళ్ళిందో తెలుసురా అబ్బాయ్?''

''దేవుడి గుడికి. నీకు తెలుసటగా ఈ విషయం. మొన్నొకసారి అమృతే చెప్పిందిలే నాకు.''

''వస్తుతః అమృత మంచిదే. కాదనను. ఆ పిల్లను చూస్తుంటే నాకెంతో జాలి అనిపిస్తుంది. అందుకే దేవాలయంలో కాసేపు ఏకాగ్రంగా కూర్చుంటే మనసుకు శాంతిగా ఉంటుందని ప్రాధేయపడి అడిగితే 'సరే' అన్నాను. రోజూ నాకు చెప్పే వెళ్ళివస్తోంది. ఐతే మన మధు - ఆ అమ్మాయి వెళ్ళినప్పుడే వీడూ గుడివైపు వెళ్తున్నాడు. అక్కడ ఇద్దరూ ఏమో గుసగుసలు, మధ్యలో ఇకఇకలు పకపకలు—నా కళ్ళారా చూసి వస్తున్నానురా ఇప్పుడు! చూడబోతే ఈ ఊళ్ళో మన పరువు నిలబడేట్టు లేదురా అబ్బాయ్'' అంటూ తన గోడు వినిపించింది నాంచారమ్మ.

''అంటే?... మధును, అమృతను అనుమానిస్తున్నావా అమ్మా?''

''అనవసరమైన అబాంఢాలు వేయటానికి వ్యక్తిగతంగా నాకు వాళ్ళమీద ద్వేషం లేదురా అబ్బాయ్. కాకపోతే ఇది లోకం ... వాళ్ళూ ఉడుకురక్తం మీద ఉన్నారు ...''

''ఇంతకూ నన్ను ఏం చేయమంటావమ్మా?''

''వాళ్ళు తిరిగి వచ్చే టైమైంది. ఈవేళ కాదుగానీ రేపు వాళ్ళు ఇద్దరూ అక్కడ ఉన్నప్పుడు ఒకసారి నువ్వూ వెళ్ళి వాళ్ళ మాటలు—ఆ ధోరణి చూడు. అంతా నీకే అర్థమౌతుంది ...'' అని వెళ్ళి పడుకొంది నాంచారమ్మ.

మొదట తల్లి వాళ్ళ ఇద్దరి మీద అనుమానం వ్యక్తం చేసినప్పుడు ఆవిడ మీద కోపం వచ్చింది. తర్వాత లోకం, పరువు ప్రతిష్ఠమాట వచ్చేసరికి — కొంత చలనం వచ్చింది సుందరరామయ్యలో. అదీ కాకుండా వయసులో ఉన్న

# అందుకు కావలసిందల్లా, నిశ్చింతగా ఉండే మనసు, నియమితమైన ఆహారం!

అవును, పాపకు స్తన్యపానం చేయించడానికి యోగ్యంగా అవడానికోసం కావల్సింది సూటిగా చెప్పాలంటే అది. వీలైనంత వరకు ప్రశాంతమైన మనస్సులో ఉండండి. మరి మీరు తీసుకునే ఆహారంలో ఎటువంటి పదార్థాలుండాలంటే, దాంతో మీ శరీరంలో, పాపకోసం ఎక్కువగా పాలు పడేలా ఉండాలి.

**చిటీ-చింతా రెండు ఒక్కటే**

చింత అన్నది మీకే కాదు, మీ పాపకి కూడా హానికరం కావచ్చు. చింతించడం వలన మీలో ఉదాసీనత, ఆవేదన, అస్వస్థతగా ఉండనిపించడం—అంతేకాదు మీలోని పాలు ఎండిపోవచ్చు.

మీకే గనక ఆరోగ్య విషయంలో ఏదైనా సమస్య గనక వుంటే, దిగులుపడి చతికిలబడి పోవద్దు. కొంచెం ధైర్యంగా మెలగండి. మీ డాక్టరు దగ్గరికి వెళ్ళి మీ సమస్య ఏమిటో చెప్పండి. ఆయన మీ సమస్యని తప్పకుండా అర్థం చేసుకుంటాడు. ఎందువల్లనంటే ఆయన మీ డాక్టరు గనక—ఆయనపైన పూర్తిగా నమ్మకాన్ని ఉంచవచ్చును.

**పుష్టికరమైన ఆహారాన్ని తీసుకోవడం మొదలెట్టండి**

పుష్టికరమైన ఆహారాన్ని గూర్చి తెలుసుకోవడానికి గ్రంథాలేవీ చదవనూ అక్కర్లేదు. కేలరీ చార్టులు చూడనూ అక్కర్లేదు. మీ పాపయొక్క వృద్ధి వికాసాల కోసం ఎక్కువగా ప్రోటీను కావాలనుకుందాం. ప్రోటీను శరీర నిర్మాణం చేసే ద్రవ్యం. అవి పాలు, కోడిగ్రుడ్లు, మాంసం వీటిలో వుంటాయి. మరైతే మీరు ప్రోటీన్లు సమృద్ధిగా వున్న పదార్థాలను తినాలి. మీకు అటువంటి పదార్థాలతో ఎంత ఎక్కువగా ప్రోటీన్లు లభిస్తే, మీ పాపకు మీ పాలలోంచి అంత ఎక్కువగా ప్రోటీను లభ్యమవుతాయి. మరి ఒక్క విషయం గుర్తుంచుకోండి మీ ఆహారంలో కార్బోహైడ్రేట్లు అవసరమైన దాని కన్న ఎక్కువగా ఉండకూడదు. ఎందుకంటే అందువల్ల

మీ పాల యొక్క ప్రమాణంపై దాని గుణాలపైనా దుష్ప్రభావం పడవచ్చు. ఆ రకమైన జాగ్రత్త, అటువంటి చిన్నదైన, సూటియైన ఉపాయాలు మీ పాపకు సరియైన ప్రకారంగా స్తన్యపానం చేయించడానికి సహాయకరంగా ఉంటాయి.

అయితే దైవవశాత్తు మీ ఆరోగ్యం విషయంలో పెద్ద సమస్య గనక వస్తే, అటువంటి పరిస్థితిలో చాలా బాగా ఆలోచించి, మీ పాపకు ఎటువంటి ఆహారం యివ్వాలంటే మరి తల్లిపాల తర్వాత అన్నిటికన్న ఉత్తమంగా ఎంచబడుతూన్న దాన్ని.

**స్ప్రే డ్రయిడ్ అమూల్ స్ప్రే**

అమూల్‌స్ప్రే, పుష్టినిచ్చే దృష్టితో చూస్తే మహత్తరంగా సంతులితమైన ఆహారం. ఎందుకంటే దీన్లో చాలా ఎక్కువైన తీరులో ప్రోటీను, దాంతోబాటే, తేలికగా అరగగలిగే కార్బోహైడ్రేట్లు, సరియైన సంతులిత రూపంలో అత్యావశ్యమైన విటమిన్లూ, ఖనిజ పదార్థాలు ఉన్నాయి. ఇది అంతకు ముందే మరగబెట్టిన నీటిలో టక్కున కరిగిపోతుంది. మొదటిగానే పేస్టులా తయారు చేయవలసిన అవసరం ఉండదు.

**పొదుపు**

అమూల్‌స్ప్రే, డబ్బాలలో దొరికే శిశుఆహారాలన్నిటికన్న పొదుపైనది. ఎందుకంటే యిది ఆధునికమైన పాల సంఘం యొక్క ఉత్పాదన— "శ్వేత విప్లవం" తీసుకురావడంలో అందరికన్న ముందడుగు వేసారు.

**జాగ్రత్త పడటం**

పాప ఆహారానికి ఉపయోగించే అన్ని వస్తువుల్నీ, సీసాని, ఎప్పుడూ ఆరోగ్యరీత్యా బాగా శుభ్రంగా కడిగి నీటిలో మరగబెట్టాలి. పాప ఆహారాన్ని తయారు చేయడానికి కూడా మరిగిన నీటినే వాడండి. పాప సరియైన పోషణకోసం, డబ్బాపైన యివ్వబడిన అమూల్‌స్ప్రే మోతాదుల ప్రకారమే ఉచితంగా పాప ఆహారాన్ని తయారు చెయ్యండి.

**ఉచితం! అమూల్ బేబీ పుస్తకంలో**

ఉపయోగకరమైన విషయాలు యీ అధ్యాయాల్లో ఉన్నాయి. అవి గర్భధారణ, ప్రసవానికి ముందర జాగ్రత్త, ప్రసవము, తల్లిపాలు, ఇతర ఆహారములు, మిశ్రమ ఆహారమును అలవాటు చేయుట, పిల్లవాని దినచర్య, పిల్లవాని అభివృద్ధి, జబ్బులను అరికట్టుట, ప్రథమ చికిత్స, సాధారణ రోగములు, జబ్బుతోనున్న పిల్లవాని సంరక్షణ, జ్ఞాపకముంచుకోవలసిన విషయములు. ఈ పుస్తకం తెలుగు, ఇంగ్లీషు, హిందీ, తమిళం, మలయాళం, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ భాషల్లో దొరుకుతుంది. దానికోసం పోస్టు బాక్సు 10124, బొంబాయి 400 001 అడ్రసుకు మీ పేరూ, పూర్తి అడ్రసు యిస్తూ రూ. 1.25 స్టాంపుల్ని జతపర్చండి.




# అమూల్‌స్ప్రే

తల్లిపాల తరవాతనే ఇది

అమ్మకం చేయించువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, పోస్ట్ బాక్సు 10, ఆనంద్ 388 001, గుజరాత్.



ASP/AS-TEL7/83



## ధర్మపథం

—బులుసు వేంకటరమణయ్య

## ఎగతాళివల్ల అనర్థం

ఒకరిని ఎగతాళి చెయ్యడం చాలా మందికి వినోదంగానే ఉండవచ్చును. కాని దానివల్ల అనర్థం కూడా కలుగవచ్చుననే విషయం మరిచిపోకూడదు.

కుబేరుడు ఒక రాయబారి మూలంగా సోదరుడైన రావణునికి హితోపదేశం చేస్తూ వార్త పంపాడు. దురహంకార పూరితుడైన రావణుడు క్రోధాతిరేకంతో ఆ రాయబారిని చంపి, కుబేరుని అలకా నగరంపై దండెత్తాడు. అప్పటి యుద్ధంలో కుబేరుడు ఓడిపోయి, నగరం విడిచి పారిపోయాడు. రావణుడు పుష్పక విమానాన్ని స్వాధీనం చేసుకుని మంత్రులతో కూడా దానిపైని ఎక్కి కైలాస పర్వతంపై విహరించడానికి బయలుదేరాడు. ఆ పర్వతంపైని పార్వతీ పరమేశ్వరుల విహారార్థమై ఒక ఉద్యాన-వనం ఉన్నది. దివ్య దంపతులైన ఉమా శంకరులు తప్ప మరెవ్వరూ అందులో ప్రవేశించకూడదు. సాహసించి వస్తే, దానిని సమీపించే సరికి అడుగు ముందుకు పడదు. అక్కడ వికార రూపుడూ, వానర ముఖుడూ, మహా బలవంతుడూ అయిన నందీశ్వరుడు కాపలా కాస్తూ ఉంటాడు. రావణుని విమానం దానిని సమీపించగానే తటాలున నిలిచి పోయింది. రావణుడికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. తన విమా-నాన్ని ఆపగలవాడు లేడని గర్వించిన రావణుని చూచి నందీశ్వరుడు ఆ ఉద్యానవన వృత్తాంతాన్ని చెప్పాడు. రావణుడు కోపించి, "ఓరి కోతి మొగమా! నన్ను ధిక్కరించడానికి నువ్వెంత?" అని నందీశ్వరుని రూపాన్ని హేళన చేస్తూ, చేసేదిలేక విమానం దిగి, ఆ శివ భక్తుని పెక్కు విధాల ఎగతాళి చేశాడు. నందీశ్వరుడు కోపించి "ఓరీ! రాక్షసాధమా! నీ స్వరూపాన్ని నీవు గుర్తించక, దురహంకారంతో నన్ను "కోతి మొగమా?" అని అధిక్షేపించావు. ఆ కోతులే నీ రాక్షస వంశాన్ని నఖాయుధాలతో చీల్చి చంపగలవు. ఒక కోతి నీ ఉద్యానవనాన్ని ధ్వంసం చేసి, లంకను దహించగలదు" అని శపించాడు. రావణుడు, ఆ మాటలను అప్పుడు లెక్క చెయ్యలేదు. కాని హనుమంతుడు లంకలో ప్రవేశించి, నానా బీభత్సం చేసినప్పుడు నందీశ్వరుని శాపం సంగతి అతనికి జ్ఞప్తికి వచ్చింది. ఆ శాపాన్ననుసరించి వానరులచేత రాక్షస వంశం నశింపజేయ బడింది.

ఒకరిని హేళన చెయ్యటం సులభమే! ఆ హేళనవల్ల కలిగే ఫలితాన్ని ఎప్పుడో-ఒకప్పుడు అనుభవించక తప్పదు. □

## ఒక అమ్మ కథ

వాళ్ళు... పరిస్థితి ఏమిటో స్వయంగా తెలుసుకొని, అవసరపడితే ఇద్దరికీ నచ్చచెప్పి రావచ్చని— మరునాడు రాత్రి మధు, అమృత దేవాలయంలో ఉన్నప్పుడు ఓపికచేసి వెళ్ళాడు.

సుందరరామయ్య దేవాలయపు గేటు దగ్గరికి వెళ్ళేసరికి సన్నగా మాటలు వినిపిస్తున్నయ్. అవేమిటో స్పష్టంగా తెలుసుకోవాలని అక్కడే ఆగిపోయాడు.

"... చదువు కేవలం ఉద్యోగాలు చేయటానికి, వేలు సంపాదించటానికే కాదు పిన్నీ; విజ్ఞాన సముపార్జనకూ ముఖ్యమే అది! విద్యే మానుష్య జీవితానికి పరమావధిగా భావిస్తాను నేను... కాదని ఎంత బుకాయించినా నీలో లోపించింది కేవలం మనశ్శాంతేనని నేను గట్టిగా చెప్పగలను. నీ అశాంతికి కారణాలూ బహిరంగ రహస్యాలే... రాత్రిపూట ఇలా దేవాలయానికి వచ్చి కూర్చున్నందువల్ల నీలో ఏదో ప్రశాంతత ఏర్పడుతుందని అనుకోవటం ఆత్మవంచనే తప్ప మరొకటి కాదు. అసలు నీలో మానసికంగా పరిమార్పు రావాలంటే ముందు నువ్వు ఈ వాతావరణానికి దూరం కావాలి ... నా మాట ప్రకారం నువ్వు చదువు వ్యాపకంలో పడాలి. పట్నం వచ్చి ఉంటే కొత్త ప్రదేశంలో రకరకాల వ్యక్తులు తెలుస్తారు. మనుషులు — మనస్తత్వాలు అర్థమౌతయ్. చదువు ధ్యాసలోపడితే ఇప్పటి నీలోని అనవసరమైన ఆలోచనలుపోయి, జీవితంపట్ల నీ దృక్పథంలో చెప్పుకోదగిన మార్పు వచ్చితీరుతుంది. అంతే కాదు. చదువు నీకు అవసరమైతే భవిష్యత్తులో ఉపయోగపడుతుంది కూడా. సపోజ్ నాన్నగారు వృద్ధులైపోయారు. ఒకనాటికైనా నేను పెళ్ళి చేసుకోక తప్పదు, వచ్చే నా భార్య ఆలోచనలు ఎలా ఉంటాయో ? ఒకవేళ నీకు ఇంట్లో అశాంతిగా తోచి ఎట్లైనా వెళ్ళిపోదామనిపించవచ్చు. చదువులేక, లోకం ఏమిటో బొత్తిగా తెలియకపోతే నీవు ఎటుపోతావ్, ఏమైపోతావ్ ? భగవంతుడి దయవల్ల నీకు అలాంటి పరిస్థితి రాదనుకో. ఐనా కీడెంచి మేలు ఎంచుకోమన్నారు పెద్దలు. ఆలోచించుకో పిన్నీ ... నీవు కనుక సరేనంటే నాన్నగారికి నచ్చచెప్పేపూచీ నాది" అంటూ అమృతకు చెబుతున్నాడు మధు.

"నువ్వుచెప్పింది బాగానేఉంది మధుబాబూ! కానీ, నాకు చదువుకొనే వయసు దాటిపోయింది. అదిగాక వివాహితను. మీ నాన్నగారి ఆరోగ్యమూ అంతంత మాత్రంగానే ఉందాయె. ఈ పరిస్థితిలో బాధ్యతలను వదులుకొని, ఎక్కడికో, దూరంగా వెళ్ళి ఉండి చదువుకోటం — స్త్రీగా అది నాకు ధర్మమా ? నా చర్యను లోకం హర్షించి ఊరుకుంటుందా ? ఊహాలోకంలో మనకు అన్నీ అందంగానే కనిపిస్తయ్. కానీ, వాస్తవంగా ఆలోచిస్తే మన కొన్ని ఆలోచనలకు మనమే నవ్వుకోవలసి వస్తుంది."

—అమృత మాటలకు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు మధు.

వాళ్ళిద్దరి మాటలు ధోరణిని బట్టి సారాంశాన్ని గ్రహించిన సుందరరామయ్య పెద్ద ఆలోచనలో పడ్డాడు. తర్కవితర్కాల మధ్య నలిగిపోతూ అక్కణ్ణుంచి వెనక్కు తిరిగాడు.

ఇంట్లోకి వచ్చిన కొడుకును "ఇప్పుడు ఏమంటావురా అబ్బాయ్ ?" అని అడిగింది నాంచారమ్మ.

అలా అడిగిన తల్లివైపు గుర్రుగా చూసి సమాధానం చెప్పకుండానే తన గదిలోకి వెళ్లాడు సుందరరామయ్య.

(ఇంకా వుంది)

## నిర్మాత అయిన మరో పంపిణీదారుడు

జిల్లాలవారీ కొనుగోలుదార్లు ఎక్కువవడంతో పంపిణీదారులకు కొన్ని సమస్యలు ఎదురవుతున్నాయి. తత్కారణంగా పంపిణీ దారులు చిత్ర నిర్మాణం వైపు దృష్టి సారించారు. ఈ జాబితాలో ఇటీవల చేరిన వ్యక్తి శ్రీ వెంకట కృష్ణా ఫిలిమ్స్ (నైజాం) అధినేత ఆనం గోపాలకృష్ణారెడ్డి. ఈయనకు ప్రదర్శన రగంలోనూ ఎంతో అనుభవం ఉంది. ఈయన తండ్రిగారికి విజయా సంస్థతో సంబంధముంది. ఈయన నిర్మించే తొలి చిత్రం 'పులి'కి తాతినేని ప్రసాద్ దర్శకుడు. చిరంజీవి, రాధ, శారద, రావుగోపాలరావు, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య ప్రధాన తారాగణం. చక్రవర్తి సంగీత దర్శకుడు. దేవరాజ్ ఛాయా గ్రాహకుడు. నవంబర్ 11న చిత్రీకరణకు అంకురార్పణ జరుగు తుంది.

**ఇక నీ యాక్షన్ ఆపేసి ఇంటికెళ్ళు నాయనా! నిన్ను రికమెండు చేసినాయన ఇప్పుడు పదవిలో లేదు!**



## ఎ. ఎన్. ఆర్. చలన చిత్ర చరిత్రోత్సవం

"నటిస్తూనే తుది నిశ్వాస వదలాలని నా ఆకాంక్ష. 1944 లో సర్వ సామాన్యుడిగా నేను మద్రాసులో పాదం మోపాను. నే నింత పాదవటానికి ఆదిలో పునాదియైన ఈ మహా నగరంలో నే నేడు ఈ అకాడమీ వ్యవస్థాపకులు టి. వి. కె. శాస్త్రిగారు, ఛైర్మన్ వి. ఓబుల్‌రెడ్డిగారు ప్రభృతులు ఇంత చక్కని కార్య-క్రమాన్ని ఏర్పాటు చేసినందుకు ఎంతైనా కృతజ్ఞుడిని" అన్నారు నట సామ్రాట్, పద్మశ్రీ కళా ప్రపూర్ణ అక్కినేని నాగేశ్వరరావు. ఈయన నిజ జీవితంలో 60, నట జీవితంలో 40 ఏళ్ళు గడిచిన సందర్భంగా 'మద్రాసు తెలుగు సంగీత నాటక నృత్య, సాహిత్య ఐక్య అకాడమీ' చెన్నపురి ఆంధ్ర మహా సభలో సన్మానోత్సవాన్ని ఎంతో విజృంభణతో జరిపింది. అకాడమీ అధ్యక్షులు డాక్టర్ మంగళంపల్లి బాల మురళీ కృష్ణ, శ్రీ డి. వి. ఎస్. రాజు, శ్రీ గుమ్మడి, సహజకవి శ్రీ ఎం. ఎస్. రెడ్డి, శ్రీ జగ్గయ్య ప్రభృతులు అక్కినేని గుణ గణాలను కొనియాడారు. శ్రీ రావి కొండలరావు ప్రారంభించిన ఈ కార్యక్రమానికి శ్రీ ఎస్. వి. బాల సుబ్రహ్మణ్యం వ్యాఖ్యానం అదనపు ఆకర్షణ. అనంతరం సంగీత, నాటక, నృత్య సాహిత్య కార్యక్రమాలు సభికులను రంజింప జేశాయి.

# సినిమా



"అభిమన్యుడు"లో విజయశాంతి, సిల్క్ స్మిత

## శ్రీ యీడ్పుగంటికి షష్టి పూర్తి

సాంస్కృతిక కళా రంగంలో, ముఖ్యముగా చలన చిత్ర పరిశ్రమలో శ్రీ ఈడ్పుగంటి లక్ష్మణరావుని తెలియని వారుండరు. పదహారు సంవత్సరాలుగా లక్ష్మీ పబ్లిసిటీస్ సంస్థలో బాధ్యత వహించి, ఆప్తుడుగా మిత్రుడుగా అందరి ఆదరాభిమానములను చూరగొన్న ఈయన షష్టి పూర్తి మహోత్సవాన్ని ఆయన అభిమానులు, మిత్రులు విజయవాడలో నవంబరు 11 వ తేదీన జరపాలని నిశ్చయించినట్లు కన్వీనర్లు శ్రీ జి. వి. యస్. శాస్త్రి (స్క్రీన్ ఆర్ట్సు), శ్రీ మురళీ మోహన్ (చలన చిత్ర నటులు) తెలియ చేస్తున్నారు.

ఆంధ్ర ప్రదేశ్, మదరాసులో ఉన్న చలన చిత్ర పరిశ్రమలోని అందరినీ, మిత్రులను, అభిమానులను, శ్రేయోభిలాషులను ఈ కార్యక్రమంలో పాల్గొని జయప్రదం చేయవలసినదిగా వారు కోరుచున్నారు.

## "అనగనగా ఒక ఇల్లు" షూటింగ్ ముగింపు

"జూలై 16నుంచి ఆగస్టు 5వరకు ఏర్కాడ్‌లో జరిగిన షెడ్యూల్‌తో మొత్తం షూటింగ్ పూర్తయింది," అన్నారు కె. సునీల్‌బాబు. ఈయన భరతన్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నిర్మించే సమతాలయ వారి పై చిత్రంలో సత్యనారాయణ, శ్రీవిద్య, సురేష్, ఆశా, ప్రీతి, సీత, కార్తీక్, బేబీ అంజు వగైరా నటవర్గం. వేణు కథకు సత్యానంద్ సంభాషణల కర్త. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, వసంత్ ఛాయ, అంకిరెడ్డి కూర్పు నిర్వహిస్తున్నారు.

## కోడి రామకృష్ణ, బాలకృష్ణ కాంబినేషన్‌లో మరో చిత్రం

"నవంబర్ 16నుంచి డిసెంబర్ వరకు ఒక షెడ్యూల్ జరుగుతుంది. రాజమండ్రి, నెల్లూరు, కాకినాడ, గుంటూరు, ధొంకరాయి, సీలేరు ప్రాంతాలలో మరో షెడ్యూల్ జరుగుతుంది." అన్నారు కోడి రామకృష్ణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కెళ్ళ రామస్వామి నిర్మించే ప్రసన్న ఆర్ట్స్ చిత్రంలో బాలకృష్ణ, సుమలత, గుమ్మడి, గొల్లపూడి, సి. ఎస్. రావ్, వేలు, వీరభద్రరావు, పహిల్వాన్ కాంతారావు, అన్నపూర్ణ, రాగిణి, శ్రీలక్ష్మి, అనూరాధ, అత్తిలి లక్ష్మి, డాక్టర్ శివప్రసాద్ బాలాజీ, భీమేశ్వర రావు, బి. నారాయణ పాల్గొంటారు. ఉపద్రష్ట సాయి మాటలు, జె. వి. రాఘవులు స్వర కల్పనలో ఆత్రేయ, వేటూరి గీతాలు రాస్తారు. పి. లక్ష్మణ్ ఛాయ. సురేష్ కూర్పు, కె. కనకారావు నిర్మాణతతో కె. రాంబాబు సహ నిర్మాత.



"సింగపూర్ సిసింద్రీ"లో స్వప్న, నరేష్

## వి. మధుసూధనరావు దర్శకత్వంలో సిహెచ్. రామోజీరావు చిత్రం "కాంచనగంగ"

"జూలై 20 నుంచి ఆగస్టు 30 వరకు ఒకే షెడ్యూల్." అన్నారు అట్లూరి రామారావు. ఈయన నిర్మాణ సారథ్యంలో తయారయ్యే ఉషాకిరణ్ మూవీస్ తృతీయ చిత్రం "కాంచనగంగ"లో శరత్‌బాబు, చంద్రమోహన్, రమణమూర్తి, ప్రతాప్ పోతన్, సరిత, స్వప్న వగైరా తారాగణం. యద్దన పూడి సులోచనారాణి కథ, డి. వి. నరసరాజు రచన, సి. నారాయణరెడ్డి - వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, ఎస్. గోపాల్‌రెడ్డి ఛాయ, భాస్కర రాజా



"మహాసంగ్రామం"లో జయసుధ, కృష్ణ

శిల్పం, డి. వెంకటరత్నం కూర్పుతో వి. మధుసూధన రావు దర్శకత్వం వహించే ఈ చిత్రానికి చెరుకూరి రామోజీరావు నిర్మాత.

## "బలి" చిత్రం రికార్డింగ్

ఆర్. డి. కంబైన్స్ నూతన చలన చిత్ర నిర్మాణ సంస్థ తెలుగులో తొలి సారిగా "బలి" అనే పేరుతో సస్పెన్స్ చిత్రాన్ని తీయ తలపెట్టింది.

రెండు గంటలపాటు నడిచే ఈ చిత్రానికి సంబంధించిన 4 పాటలను ది 3-8-1984 న ప్రముఖ సంగీత దర్శకుడు శ్రీ ప్రేమ్‌జీ సంగీత దర్శకత్వంలో రికార్డింగ్ చేయటం జరిగింది.

అంతా నూతన నటీ నటులు, టెక్నిషియన్స్‌తో తీస్తున్న ఈ చిత్రం ఆగస్టు 28 నుండి విజయవాడ పరిసర ప్రాంతాల్లో షూటింగ్ జరుగుతుంది.

ఈ చిత్రానికి నిర్మాత బి. టి. రావు, సహ నిర్మాత జి. త్రిమూర్తి రావు, నిర్మాణ నిర్వాహణ దాసరి ధర్మారావు, కథ : ఆర్ డి. కంబైన్స్, పాటలు, స్క్రీన్ ప్లే, దర్శకత్వం : టి. కనక దుర్గారావు.

ఈ చిత్రం ఆర్. డి. ఫిలిమ్స్ ద్వారా విడుదలవుతుంది.

"దుస్తం"లో చిరంజీవి





"భార్యామణి"లో శోభన్‌బాబు, అనూరాధ, జయసుధ

## కట్టా సుబ్బారావు దర్శకత్వంలో గోటేటి చిత్రం "పెళ్ళికి రండి"

"గణేశ్వరరావు ఒక సామాన్య ఉద్యోగి. తన చెల్లెలు పెళ్ళికి సంబంధాన్ని నిశ్చయించి, కట్న కానుకలకు అంగీకరించి, వాటిని ఇవ్వడానికి ఎన్నో ఉపాయాలను, అపాయాలను ఎదుర్కొంటూ ఎలాగో పెళ్ళి చేసేస్తాడు. గణేశ్వరరావుగా గొల్లపూడి మారుతీరావు, బుల్లబ్బాయిగా చంద్రమోహన్ కడుపుబ్బ నవ్విస్తారు. తమిళంలో రెండు వందలకు పైగా రంగస్థలం మీద ప్రదర్శనలిచ్చి, ఆ తర్వాత వెండి తెరమీద కూడా "శౌరీ కల్యాణం"గా విజయవంతమైన చిత్రం ఆధారంగా ఒకే షెడ్యూల్‌లో కన్నడంలో కూడా తయారు చేస్తాను. ఈ చిత్ర కథకుడు విసు సమకూర్చిన ఎన్నో తమిళ చిత్ర కథలు తెలుగులో తయారై ఘన విజయాన్ని సాధించిన విషయం అందరికీ తెలిసిందే," అన్నారు పత్రికాకర్త, చిత్ర నిర్మాత గోటేటి శ్రీరామారావు.

## "ప్రేమ సంగమం"

"జెమినీ గణేశ్ కూతురు జిజీ నాయిక, ముత్తురామన్ కొడుకు మురళి నాయకుడు," అన్నారు ఎన్.

నూతన్‌ప్రసాద్, "రామరాజ్యం వచ్చింది"



అంబికేశ్వరరావు. ఈయన సమర్పించే శ్రీ విజయాంబికా మూవీస్ వారి పై చిత్రానికి వసంతకుమార్ సంభాషణల కర్త. ఇళయరాజా స్వరకల్పనలో వేటూరి. గోపి. వేటూరి గీతాలు రాశారు. తివారి ఛాయ, ఈడ్పుగంటి నాగేశ్వరరావు కూర్పు, శ్రీధర్ దర్శకత్వం నెఱపిన ఈ చిత్రానికి సి. హెచ్. మోహనరావు, జె. వి. రామారావు నిర్మాతలు.

## "మంగమ్మగారి మనవడు"లో మంగమ్మగారి ఆవేశం

మల్లి (సుహాసిని)ని తీసుకెళ్ళడానికి బసవయ్య (ఏలేశ్వరం రంగా) కొందరు రౌడీలతో వస్తున్నాడని తెలిసి వీరన్న (బాలకృష్ణ), మంగమ్మ (భానుమతి) ఆగ్రహం చెందారు.

"రేయ్ ! మా ఊరి పొలిమేరల్లోకొచ్చే ధైర్యం మీ కెవడిచ్చాడ్రా? బ్రతుకు మీద ఆశుంటే పారిపోండిరా నా కొడకల్లారా!" అన్నాడు వీరన్న.

"మీరంతా కలిసి కుట్ర చేశారు. మిమ్మల్ని ఊరికే వదిలిపెట్టనురా!" అంది మంగమ్మ.

"నేను తలచుకుంటే పెగులు తీసేస్తాను," అన్నాడు బసవయ్య.

"తక్షణం ఇక్కడ్నుంచి వెళ్ళకపోతే డొక్క చీరేస్తాను," అంది మంగమ్మ.

బసవయ్య మీసం మెలేస్తూ, "మల్లిని మర్యాదగా మాతో పంపకపోతే ఊరినే తగలబెట్టి మరీ తీసుకెళ్తాను." అన్నాడు.

మంగమ్మ మరింత రెచ్చిపోయింది. "ఇది లక్క కొంప కాదు తగలబెట్టడానికి. పాండవుల కులమూ కాదు ఆడవాళ్ళను పందెంలో ఒడి మగవాళ్ళను మోసం చెయ్యడానికి ఆ.... పెద్ద మీసం తిప్పుతున్నావు! నీ మూతికి మీసముంటే, ఈ మంగమ్మ ముంజేతికి మీసముంది. ఇదిగో–ఇది మంగమ్మ చేతికర్రరా. దమ్ములుంటే ఇది దాటి రండి. మీ రక్తంతో ఈ ఊళ్ళో ముగ్గులు పెడతాను," అంటూ నేల మీద కర్రను పడేసింది.

బసవయ్యతో పాటు అతని మనుషులా తిరుగు ముఖం పెట్టక తప్పింది కాదు.

ఎస్. గోపాలరెడ్డి నిర్మించిన భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ "మంగమ్మగారి మనవడు" చిత్రానికి కోడి రామకృష్ణ దర్శకుడు.

## "ఆగ్రహం"

"డిసెంబర్ నుంచి షూటింగ్" అన్నారు రోసిరాజా. ఈయన దర్శకత్వంలో "ఉగ్ర రూపం" అనంతరం ఎన్. ఆర్. భారతి సమర్పించే జయ భారతీ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో శివకృష్ణ, విజ్జి నాయకా నాయికలు. సి. కె. రంజిత్ నిర్వహణలో ఎన్ ఆర్. హనుమంతరావు నిర్మాత.

## అమెరికాలో తెలుగు నిర్మాణం

"అమెరికాలో స్థిర నివాసమేర్పరుచుకున్న ఓ తెలుగు యువకునికి, మన గడ్డపై పుట్టిన ఒక పల్లెటూరి పిల్లతో వివాహమవుతుంది. వీరిద్దరి మధ్య అడుగడుగునా ఎదురయ్యే సంస్కృతి, నాగరికత వ్యత్యాసాలతో ఎదురయ్యే కలతలు, సమస్యలు గల వినూత్నమైన ఇతివృత్తం. ఎంతో ఆత్మ విశ్వాసంతో ముందుకు సాగుతూన్న అమెరికాలోని తెలుగువాళ్ల జీవన విధానం గురించి కూడా ఈ చిత్రం తెలుపుతుంది. షికాగో, డిస్నీలాండ్, ఇంకా అమెరికాలోని ఎన్నో రమణీయమైన ప్రదేశాలను ఈ చిత్రంలో చూపిస్తాం. ఛేంజ్, ఫైట్స్ కూడా గగుర్పాటు కలిగించే రీతిలో చిత్రీకరిస్తాం. పూర్తిగా అమెరికాలో చిత్రీకరణ జరుపుకునే ఈ తొలి చిత్రాన్ని డైరెక్ట్ చేసే అవకాశం నాకు కలిగినందుకు ఎంతో ఆనందిస్తున్నాను," అన్నారు కె. వాసు ఈయన దర్శకత్వంలో ఇరవై ఏళ్లుగా అమెరికాలో డాక్టరుగా ప్రసిద్ధి పొందిన వేమూరి రమేష్‌బాబు నిర్మించే చికాగో ఫిలిమ్స్ మొదటి చిత్రంలో సుమన్, భానుప్రియ, సూర్యకాంతం, వేలు, ఇతర కొన్ని పాత్రలను అమెరికాలోని తెలుగువారు నిర్వహిస్తారు. కథను సమకూర్చిన వేల్పేరు నారాయణరావు కూడా అమెరికావాసి. సత్యానంద్ సంభాషణలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, ఎం. వి. రఘు ఛాయ, నాయని మహేశ్వరరావు కూర్పు. సత్యం ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు. నిర్మాత సతీమణి శ్రీమతి శ్రీ లతా రమేష్‌బాబు మరి కొన్ని విషయాలు తెలియజేశారు: "దూరదేశమేగినా మన ఆచార్య వ్యవహారాలకు దూరం కాని అమెరికాలోని తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబించే ఓ చక్కని తెలుగు చిత్రాన్ని తయారు చేయాలని ఏడాదిగా మేం జరిపిన కృషి ఈ నాటికి ఫలించింది. నాట్యంలో సుశిక్షితురాలైన షెరాన్ అనే యువతి కూడా ఈ చిత్రంలో నటిస్తూంది. ఆగస్టు మొదటి వారం నుంచి నెలాఖరు వరకు షూటింగ్ జరుపుతారు."

## "కలలు కనే కళ్ళు"

"ప్రతాప్ పోతన్, ముచ్చెర్ల అరుణ పాత్రలు రెండూ కలలు కనేవి. ముఖ్యంగా ప్రతాప్ పోతన్‌ది ఒక పెక్యూలియర్ కేరెక్టర్. తాను అంద విహీనుడ్ననీ, తను ఎవరి ప్రేమకూ నోచుకోలేదనీ, తనపై అభిమానం ఎవరూ చూపరనీ, బాల్యం నుంచి బాధ పడుతూ ఏకాకిగా ఫీలవుతూంటాడు" అన్నారు నిర్మాత కోనేరు విజయలక్ష్మి. శ్రీ అన్నపూర్ణ మూవీస్ వారి పై చిత్రంలో చంద్రమోహన్, కవిత, నూతన్ ప్రసాద్, ప్రసాద్ బాబు, సాక్షి రంగారావు, సారథి, హరిబాబు, రమాప్రభ, నిర్మల, యూన్సీ తక్కిన భూమికలు నిర్వహించారు. శ్యామ్ స్వర కల్పనలో వేటూరి, ఆరుద్ర, గోపి రాసిన గీతాలు మృదు మధురంగా ఉన్నాయి. కాశీ విశ్వనాథ్ సంభాషణలు, హరి అనుమోలు ఛాయ, హరి శిల్పం, కె. ఎన్. రాజు కూర్పుతో ఈ చిత్రానికి కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించిన బాలు "పదహారేళ్ళ క్రితం సహాయ దర్శకుడిగా సినిమా రంగంలో ప్రవేశించిన నేను 'అగ్గి మీద గుగ్గిలం' చిత్రం నుంచి ప్రముఖ దర్శకులవద్ద పాతిక చిత్రాల వరకు పని చేశాను. ఆ అనుభవంతో ఈ నా తొలి చిత్రాన్ని సర్వాంగ సుందరంగా రూపొందించడానికి నా శాయ శక్తులా కృషి చేశాను. ఇక ప్రేక్షకుల ఆశీస్సులే తరువాయి." అన్నారు.



"స్వాతి"లో సుహాసిని, శరత్‌బాబు

## 1985లో సంయుక్తా మూవీస్ చిత్రాలు

ఈ ఏడు సెప్టెంబరులో "మహా సంగ్రామం" విడుదలానంతరం నవంబర్‌లో శోభన్‌బాబుతో ప్రారంభమయ్యే చిత్రం వచ్చే ఫిబ్రవరిలో విడుదలవుతుంది. బాలకృష్ణతో ఓ చిత్రం, మేలో చిరంజీవితో ఓ చిత్రం మొదలవుతాయి. "ఆ తర్వాత మల్టీస్టారర్ చిత్రం షూటింగ్ ఆగస్టులో ప్రారంభమవుతుంది," అని నిర్మాత డాక్టర్ ఎం. తిరుపతిరెడ్డి వివరించారు.

"అమ్మాయిలూ ప్రేమించండి" రాధిక, భాగ్యరాజ్



ఒకటి జానపదం. ఒక చిత్రానికి ఎ. కోదండరామిరెడ్డి దర్శకత్వం వహిస్తారు.

## "భారతంలో శంఖారావం" చిత్రానికి పది లక్షల వ్యయంతో పతాక సన్నివేశాలు

"తమ స్వార్థం కోసం అమాయకులైన ప్రజల మధ్యన అలజడులు అంతః కలహాలు సృష్టించి, మత విద్వేషాల్ని రెచ్చగొట్టి — ఆర్థిక సామాజిక ప్రగతికి అవరోధాలను కల్పించే దుష్టుల ఆగడాలను అరికట్టే మహానుభావులు లేకపోతే ఈ ప్రపంచం ఏనాడో అనంత విశ్వంలో లీనమై ఉండేది. కుత్సితుల కుటిలోపాయాలవల్ల తన తోబుట్టువులకు దూరమైనా — దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ గావిస్తూ విధి నిర్వహణలో తనకు తానే సాటి అనిపించుకున్న సెంట్రల్ ఇంటిలిజెన్స్ ఆఫీసర్‌గా కృష్ణంరాజు 'బొబ్బిలి బ్రహ్మన్న' లాంటి మరో మరపురాని పాత్రను అద్వితీయంగా పోషించిన ఈ చిత్రానికి ఖమ్మంలో దాదాపు పది లక్షల వ్యయంతో చిత్రీకరించిన పతాక సన్నివేశాలు హైలైట్. డాక్టర్ ప్రభాకరరెడ్డి సమకూర్చిన కథ ఈ చిత్ర ఘన విజయానికి మరింత దోహదం చేస్తుంది" అన్నారు బి. భాస్కరరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించిన కోతినేని పిక్చర్స్ "భారతంలో శంఖారావం" చిత్రంలో జయసుధ నాయిక. సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, జీవా, రాజేష్, హరిప్రసాద్, కిశోర్, చలపతిరావు, నర్రా వెంకటేశ్వరరావు, జగ్గారావు, అశ్విని, శ్యామలగౌరి తక్కిన తారాగణం. పూసల సంభాషణలు, జె. వి. రాఘవులు సంగీతం, సత్తిబాబు ఛాయ, కె. ఎ. మార్తాండ్ కూర్పు, అప్పారావు సహ దర్శకత్వం, రమణమూర్తి నిర్వహణతో కోతినేని బాబు నిర్మాత. □

"భారతంలో శంఖారావంలో" జయసుధ

## రజతోత్సవ కానుకగా జగపతివారి "మధురగీతాలు"

"మా చిత్రాలన్నిటిలోని పాటలకు ఇప్పటికీ ఉన్న పాపులారిటీ నన్ను "మధుర గీతాలు" నిర్మాణానికి ప్రోత్సహించింది. 'ఆరాధన' నుండి 'ఎస్. పి. భయంకర్' వరకు మా చిత్రాల్లోని హిట్ సాంగ్స్‌ను ఓ చిత్రమాలగా కూర్చి విజయదశమికి విడుదల చేస్తున్నాం," అన్నారు దర్శక నిర్మాత వి.బి. రాజేంద్ర ప్రసాద్. ముళ్లపూడి వెంకటరమణ రచనా చమత్కృతితో ఎ. ఎన్. ఆర్., జగ్గయ్య, జయసుధ, శ్రీదేవి, జయప్రద, మరి కొందరు తారల వ్యాఖ్యానం మరో విశేషం. దీని తర్వాత రాజేంద్రప్రసాద్ జనవరినుంచి నిర్మించే జగపతి ఆర్ట్ పిక్చర్స్ వారి కొత్త చిత్రంలో ఎ.ఎన్.ఆర్., జయసుధ, బాలకృష్ణతోపాటు ఓ నవనటి పాల్గొంటారు. చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయతో తాతినేని ప్రసాద్ దర్శకుడు.

## ఎన్. ఎ. టి. చిత్రాలు

"చండ శాసనుడు" అనంతరం పై సంస్థ వచ్చే సంవత్సరం బాలకృష్ణతో నాలుగు చిత్రాలను నిర్మించడానికి సన్నాహాలు చేస్తోంది. అందులో



# ఇరుగు పొరుగు

• ద్విపాత్రలు అభినయించిన తొలి సినీ నటుడు అలన్ బర్మింగ్‌హాం.... మన దేశంలో దాదా సాహెబ్ ఫాల్కే 1913లో "లంకా దహనం" ప్రారంభించినప్పుడు సీత పాత్రకు తగ్గ నటీమణి ఎవరూ దొరక్క చివరికి ఆ చిత్ర నాయకుడు సాళుంకె చేతనే నాయిక పాత్రను కూడాధరింప చేశారు. మన దేశంలో ద్విపాత్రాభినయానికి నాంది ఇది.

• ఇది కన్నడ వాక్చిత్రాల స్వర్ణోత్సవం....1934లో సౌత్ ఇండియన్ మూవీటోన్ అనే సంస్థ "సతీ సులోచన లేక ఇంద్రజిత్ కథ" అనే తొలి కన్నడ టాకీని కె.శే. వై. వి. రావ్ దర్శకత్వంతో ప్రారంభించింది. కొల్హాపూర్ మహారాష్ట్ర సినీ టోన్ స్టూడియోలో 50 వేల రూపాయల వ్యయంతోనే తయారైన ఈ చిత్రంలో ఆర్. నాగేంద్రరావు, సుబ్బయ్యనాయుడు, లక్ష్మీ-బాయి, కమలాబాయి పాల్గొన్నారు. దానికి ముందు "భక్త ధ్రువకుమార్" అనే కన్నడ టాకీ ప్రారంభింప బడిందే గాని, ముందుగా విడుదలైనది "వసంత సేన". తొలి కన్నడ వర్ణ చిత్రం బి.ఎస్. రంగా రూపొందించిన "అమర శిల్పి జకణాచారి" (1964) 1934 నుంచి 1952 వరకు 19 ఏళ్ళల్లో 21 కన్నడ చిత్రాలే తయారయ్యాయి. 1983లో 64 చిత్రాలు తయారయ్యాయి. ఈ ఏడు వంద కావచ్చని అంచనా.

• జూమ్‌లెన్స్ ఉపయోగించని ఏకైక కెమెరామెన్ బాలు మహేంద్ర. "నాకు కెమెరా మూవ్‌మెంట్, చాలా స్మూత్‌గా ఉండాలి. అసలు కెమెరాను పేన్ చేస్తున్నట్టు ప్రేక్షకులకు ఏ మాత్రం తెలీకూడదు. అప్పుడే వాళ్ళు తెరమీద సన్నివేశంలో లీన మవుతారు. నేను కెమెరాతో ఎప్పుడూ ఆడుకోను," అంటారాయన.

• కేరళ మంత్రి పి. జె. జోసఫ్ ఒక చిత్రానికి పాట పాడారు. "శబరి మలై దర్శనం" అనే మలయాళ చిత్రం కోసం ఆయన నేపథ్యగానం ఇటీవల తిరువనంతపురంలో ధ్వని ముద్రితమైంది.

• టెన్నిస్ ఆటగాడు బోర్గ్ "నైట్ ఫైటర్స్" అనే చిత్రంలో ఓం ప్రథమంగా నటిస్తున్నాడు. ఒక ఒలింపిక్ క్రీడాకారుణ్ని కొందరు దుండగులు అపహరించుకు పోతే, అతన్ని కాపాడే పాత్రను బోర్గ్ ధరిస్తున్నాడు.

• లండన్‌లో ఇటీవల "కర్స్ ఆఫ్ ది పింక్ పాంథర్" చిత్రం విడుదలైంది. ఇందులో అమెరికా అధ్యక్షుడు రీగన్ కుమార్తె పట్టీ డేవిస్ నటించింది.

• జెమినీగణేశ్ గొంతులో చిక్కుకున్న బుల్లెట్‌ను బయటకు తీయడానికి ప్రయత్నిస్తే, ఆయన ప్రాణానికే ఆపద అని ఆయన కుమార్తె డాక్టర్ కమలా సెల్వరాజ్ నర్సింగ్‌హోమ్‌లోని సర్జన్‌లు అన్నారు. కాని, ఆ తూటా బయట పడితే అది సాక్ష్యంగా ఆయన ఆత్మహత్యకు తలపెట్టాడని పోలీసు కేసు నమోదు చేయడానికి వీలవుతుంది. ఆ మధ్య జెమినీగణేశ్ ఆ తూటాను తీయించడానికి విదేశాలకు వెళ్ళాలనుకుంటే ఆయనతో పాటు ఒక పోలీసు అధికారిని తీసుకెళ్లాలన్నారట పోలీసు శాఖవారు. చివరికి శరీరంలో ఏ భాగంలోనైనా ఇరుక్కున్న తూటాల లాంటి లోహాలను శరీరంలోనే కరిగించివేసే ఒకే ఒక నిపుణుడు ఏ విదేశంలోనో ఉన్నాడని తెలిసి. అతని కోసం ఇప్పుడు ప్రయత్నిస్తున్నాడట జెమినిగణేశ్!

—జి.వి.జి.





# అతీంద్రియ శక్తుల సాధనలో చరిత్ర సృష్టించిన యూరిగెల్లర్

అతీంద్రియ విజ్ఞాన రంగంలో అద్భుతమైన శక్తులు ఉన్నాయని ప్రకటించి, శాస్త్రజ్ఞులు, విమర్శకులు పెట్టిన పరీక్షలకు నిలబడి అతీంద్రియులుగా అంగీకరింపబడిన అతి తక్కువ మందిలో ఇజ్రాయిల్‌కు చెందిన యూరిగెల్లర్‌ను ప్రముఖుడుగాపేర్కొనవచ్చు. గెల్లర్‌కి "సైకో కెనసిస్" శక్తి సమృద్ధిగా ఉంది. అంటే కళ్లతో వస్తువులను తీక్షణంగా చూస్తూ, వాటిలో కదలిక కలిగించడం లేదా వాటిని వంచగలగడంవంటి అతీత కార్యాలు చేయటం అన్నమాట.

1946 డిసెంబరు 26 న జన్మించిన యూరికి చిన్నతనంనుంచి అతీంద్రియ శక్తులపై ఆసక్తి ఉండేది. యుక్తవయసు రాగానే సైన్యంలో చేరాడు. అక్కడ అతనికి తెలియకుండానే ఎన్నో వింత వింత అనుభవాలు పొందాడు. జరగబోయే ప్రమాదాలను ముందుగానే గ్రహించడం, నిద్రలో కలల ద్వారా జరగబోయే అవాంతరాలను ముందే తెలుసుకోవటం, అవన్నీ తరువాత ఖచ్చితంగా జరగటం, యూరీలో ఎంతో ఆసక్తిని రేపాయి. యుద్ధానంతరం యూరీ తనలో దాగి ఉన్న శక్తికి పదును పెట్టుకోవాలనే ఉద్దేశ్యంతో బయటకు వచ్చి తనశక్తిని ఎంతో వృద్ధి చేసుకున్నాడు. అమెరికాకు చెందిన ప్రముఖ పారా సైకాలజీ శాస్త్రజ్ఞుడు డాక్టర్ ఆంద్రిజా పుహారిచ్ పరిచయంతో యూరి అంతర్జాతీయ స్థాయికి చేరుకున్నాడు.

యూరిగెల్లర్ అభివృద్ధి చెందిన దాదాపు అన్ని దేశాలలోను తన ప్రదర్శన లిచ్చి శాస్త్రజ్ఞులను, పత్రికా విలేఖరులను, విమర్శకులను, హేతువాదులను, మెజీషియన్లను ఇతర ప్రేక్షకులను ఆశ్చర్యపరిచాడు. తన ప్రదర్శనలో ప్రేక్షకులు పరీక్షచేసి ఇచ్చిన చెంచాలను, ఫోర్కులను తాళం చెవులను టేబిల్‌పైన ఉంచి, వాటిని ముట్టుకోకుండా, కళ్లతో చూస్తూ రెండు నిమిషాలలోకదలిక కలిగించడం చేసేవాడు. చెంచాలు పూర్తిగా వంగిపోయేవి. అది చూస్తుంటే ఎవరో అదృశ్యవ్యక్తి వాటిని వంచుతున్నట్లుగా భ్రమ కలిగేది. ఇంగ్లండు, అమెరికా, జర్మనీ దేశాలలో గెల్లర్ అభిమాను లెందరో ఈ విద్యను అభ్యసించారు. అతి కొద్దిమంది మాత్రం కృత కృత్యులయ్యారు. "గెల్లర్ ఫెరోమినా"గా పేరుపడ్డ సైకోక్రినసిస్ శక్తిని గెల్లర్ తరువాత అంత అద్భుతంగా మరెవరూ ఈనాటివరకు ప్రదర్శించలేక పోయారు.

ప్రదర్శన జరిగిన ప్రతీ దేశంలోనూ గెల్లర్‌కి ప్రశంసలతో బాటు విమర్శలు కూడా తప్పలేదు. కొంతమందీ అసూయతో, మరి కొందరు మోసం చేస్తున్నాడనే ఆరోపణలతో దుయ్యబట్టసాగారు.




జేమ్స్ రాండి అనే మెజీషియన్ ఒక వివాదం లేవదీస్తూ అసలు గెల్లర్‌లో ఎటువంటి అతీంద్రియ శక్తిలేదు. అతను చేస్తున్నది కేవలం మేజిక్ మాత్రమే. కనికట్టుతోనూ, హస్తలాఘవంతోనూ, మాటల చాతుర్యంతోనూ అతను తాళాలను వంచినట్లుగా చూపిస్తున్నాడని, అది చూసి మోసపోవద్దని "టైమ్" అనే పత్రికలో ప్రకటన చేశాడు. అది ఒక సవాలుగా స్వీకరించి గెల్లర్ టైమ్ పత్రిక వారిని కలుసుకుని ఇరవై ఎనిమిది మంది జర్నలిస్టులు, ఏడుగురు మెజీషియన్లు, ఇద్దరు హిప్నాటిస్టులు, ఇద్దరు పారాసైకాలజీ శాస్త్రజ్ఞుల సమక్షంలో తమ శక్తులను విజయవంతంగా ప్రదర్శించి అందరినీ ఆశ్చర్యంలో ముంచివేశాడు. గెల్లర్‌ను అనవసరంగా విమర్శించిన మెజీషియన్ రాండి సిగ్గుతో కుంచించుకు పోయాడు. సాధారణంగా మేజిక్ రంగంలో ఒక్కసారిగా పైకి రావలనుకునేవారు, అకస్మాత్తుగా పబ్లిసిటీ రావాలని అనుకునేవారు, తమకన్నా శక్తివంతులైన వారిని దూషించి, మహానుభావులుగా కొనియాడబడుతన్న వారిని విమర్శించుతూ ఉంటారు. ఇది ఇంద్రజాల చరిత్రలో మొదటినుంచి ఉన్నదే. తమశక్తిమీద తమకు విశ్వాసం లేనివారే ఇలాంటి అడ్డుదోవలు తొక్కుతూ ఉంటారు, అంతేకాని దేశాన్ని ఉద్ధరించడానికి కాదు. మెజీషియన్ రాండి, గెల్లర్‌ను పట్టివ్వడానికి విఫల ప్రయత్నం చేసిన తరువాత కూడా తిరిగి కొందరు స్నేహితుల ప్రోద్భలంతో విమర్శలు మొదలుపెట్టాడు. గెల్లర్ ఇవి లెక్కచేయక విజయవంతమైన ప్రదర్శనలు ఇవ్వసాగాడు.అయినా ఇప్పటికి గెల్లర్‌తో బాటు మరి కొందరు కూడా విమర్శలు చేస్తూనే ఉన్నారు.

ఇంగ్లండు, అమెరికా, జపాన్, ఇటలీ, స్పెయిన్, జపాన్ దేశాలలోని శాస్త్రజ్ఞులు గెల్లర్‌ను తమ లేబరేటరీలకు అహ్వానించి అతనిపై కొన్ని వేల పరీక్షలు చేశారు. తమ తమ పరిశోధనలు పూర్తి అయిన తరువాత అందరూ ఏకగ్రీవంగా "గెల్లర్"ను ఒక అసాధారణ వ్యక్తిగా వర్ణించారు.గెల్లర్ తనకు అప్రయత్నంగా లభించిన ఈ శక్తిని గురించి మాట్లాడుతూ "నేను ఈ శక్తిని పొందాలనిఎవుడూ కృషి చేయలేదు. నే నెవరినీ మోసం చేయవలసిన అవసరం లేదు. ఒకరు నమ్మినా నమ్మక పోయినా భగవంతుడిచ్చిన ఈ శక్తిని సద్వినియోగ పరచుకుంటాను." అన్నారు.

యూరి గెల్లర్ వస్తువులను వంచటమే కాకుండా టెలిపతిలో కూడా అద్భుతమైన ప్రావీణ్యతను సంపాదించాడు. తన ప్రియురాలికి తన రాకపోకల గురించి సందేశాలు పంపుతానని చెప్పి, ఒకసారి ముగ్గురు జర్మనీ శాస్త్రజ్ఞుల ముందు బుజువు చేసి చూపాడు. కొంత కాలం తరువాత "డౌసింగ్"లో కూడా ప్రావీణ్యత సంపాదించి, ఒక కర్ర సహాయంతో భూమిలోగల నిధి నిక్షేపాలను చూప గలిగాడు. అలాగే సైకోమెట్రీ కూడా బాగా అభ్యసించి ప్రదర్శనలు చేసి చూపాడు. ఒకే వ్యక్తిలో ఇన్ని

## ఏ. వి. ఎన్. ఆర్. – గోనెగండ్ల

మగవాడి విజయానికి పరాజయానికి స్త్రీ కారణం అంటారు. మరి స్త్రీ సుఖ దుఃఖాలకీ కారణం మగవాడు కాదా? జీవితం అంటే ఏమిటి? అసలు స్త్రీ ప్రేమిస్తుందా? నటనా?

★ మగవాడి జయాపజయాలకి స్త్రీ కారణం అంటే– ఇక ఆమె బ్రతుక్కి అతనెంత కారణమో వూహించలేరా– జీవితం అంటే– సుఖం– దుఃఖం ఒక్కటే కాదు– వాటి మధ్య మనిషి– మనసు కూడా వుంటాయి. వాటి వునికి ఎంతమంది మగవాళ్ళు గుర్తిస్తున్నారు?.... జీవితంలో– అందులోనూ ప్రేమ విషయంలో– మగవాడు నటించినంతగా ఆడది నటించలేదు– ప్రేమ ఫలం మోయవలసినది ఆమె కనుక.

## సిహెచ్. ఎన్. ఆర్. – సత్తెనపల్లి

మీకు నచ్చిన వైద్య విధానం ఏమిటి ?

★ శస్త్ర చికిత్స! నాన్పుడు వైద్యాలు నాకు నచ్చవు!

విజ్ఞాన సముపార్జనలో డబ్బు పాత్ర ఎంత?

★ విజ్ఞాన సంపాదనకు డబ్బు అక్కర లేదు. డిగ్రీలు కావాలి.

సంక్రాంతి ముగ్గులపై మీ అభిప్రాయం?

★ కొందరు చాలా అందంగా వాకిళ్ళు తీర్చి దిద్దుతారు ముగ్గుల్తో. కాని వాటిలో ఆడాళ్ళకి పోటీలు పెట్టి




బహుమతులివ్వడం – సిల్లీ. సంప్రదాయిక కళలాంటి యీ ముగ్గులూ పిండి వంటలు చేయడం– లాంటివి– యిళ్ళల్లో ఒకరి దగ్గర నుంచి ఒకరు నేర్చుకోవచ్చు. నేర్చుకోకపోయినా కొంప మునగదు.

వ్యాపార ప్రకటనల వలన ప్రజలు పొందుతున్న లాభం ఏమిటి?

★ అవి ప్రజలకు లాభం కోసం కాదు. వ్యాపార విస్తరణ కోసమే.

రోజా మీ యింటికి ఎందరు ప్రేక్షకులు వస్తారు.

★ మా యిల్లు జూ కాదే! ఎందుకొస్తారు?!

## సి. ఎస్. ఆర్. – ఒంగోలు

చేస్తున్న ఉద్యోగంలో విసుగు పుట్టినప్పుడు మరో నూతన జీవిత విధానాన్ని కోరుకోవడం తప్పా?

★ కాదు. కాని కొత్తది దొరికేదాకా– పాత ఉద్యోగానికి స్వస్తి చెప్పడం– విజ్ఞుల లక్షణం కాదు.

## పి. జి. ఎన్. – కరకుదురు

కె. రా. గారూ మీరు ఏం చదివారు.

★ అందరూ చదివే అక్షరాలే తమ్ముడు.

## ఎమ్. జె. ఎల్. – పలమనేరు.

నేడు స్త్రీలు పురుషులతో సమానంగా చదువుకొని ఉద్యోగాలు చేస్తున్నారు. అన్ని రంగాలలోను ముందున్నారు. ఎన్ని క్వాలిఫికేషన్లు ఉన్నప్పటికి కట్నా లిచ్చి వివాహం చేసుకోవడం మాత్రం తప్పడంలేదు. ఈ సమస్య నశించే దెప్పుడు?

★ ఈవిధంగా పెళ్ళి చేసుకు తీరాలని లేదే?! కట్నం యిచ్చి పెళ్ళి చేసుకోమని అమ్మాయిలు నిలబడ కల్గాలి. దీనికి – చదువు, ఉద్యోగం ఉంటే చాలదు – ఆత్మ గౌరవంమీద నమ్మకం వుండాలి. తల్లి తండ్రుల ఒత్తిడికి తట్టుకు నిలబడకల్గాలి. చేసుకొనే ముఖ్యు లిద్దరూ – తిరగబడకపోతే యీ సమస్య రూపు మాసిపోయే అవకాశంలేదు.

## కె. ఆర్. కె. – అమలాపురం.

ఎప్పుడూ ఏదో ఒక దాన్ని గురించి బాధ పడే వారికి మీరిచ్చే సలహా.

★ మానసిక వైద్యునితో సంప్రదించమని.

## ఏ. ఎమ్. – కాకినాడ.

దురదుష్టం శాపమా?

★ కాదు. అదృష్టం అంటే ఎలా వుంటుందని తెలియచెప్తుందనుకోవాలి.

## కె. డి. – హైదరాబాదు

రామలక్ష్మిగారూ, మీ యొక్క అంతిమ కోర్కె ఏమిటి?

★ ఇంకా అప్పుడే తెలియడం లేదే! □

అతీంద్రియ శక్తులు కలిగి ఉండటం అపూర్వం అని వర్ణించాడు ప్రముఖ శాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ జాన్ టేలర్.

కిర్లియన్ ఫొటోగ్రఫీ తీయటంలో సిద్ధహస్తురాలైన ప్రముఖ మహిళ థెల్మామోస్, యూరిగెల్లర్ ప్రదర్శనలు చేసినపుడు చాలా ఫొటోలు తీశారు. ఆ ఫొటోలలో గెల్లర్ చేతులు, కళ్ళు ఎంతో కాంతివంతంగా ప్రకాశిస్తూ పడ్డాయి. ఆ ఫొటోలు చూసిన శాస్త్రజ్ఞులకి యూరిగెల్లర్ శక్తులపై సంపూర్ణ విశ్వాసం కలిగింది. అతని దృష్టిపడిన చెంచాలు, ఫోర్కులకు తీసిన ఫొటోలలో కూడా వాటిచుట్టూ కాంతి కిరణాలు కొట్టొచ్చినట్లు కనపడ్డాయి.

అమెరికాలోని ప్రముఖ భౌతిక శాస్త్ర విజ్ఞానవేత్త ప్రొఫెసర్ ఎట్బర్ ఫ్రాంక్లిన్ ఈ విషయంలో మాట్లాడుతూ "నాకు ఇవేవీ అతీత శక్తులుగా అనిపించటంలేదు. ఆయా స్వాభావిక సూత్రాలను తెలుసుకుంటే భూమ్యాకర్షణ శక్తిలాగా ఇది కూడా ఒకరకమైన నయనాకర్షణ శక్తి అని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఆ విషయంలో శాస్త్రజ్ఞులు మరింతగా ప్రయోగాలు నిర్వహించవలసి ఉంది" అన్నారు.

హైందవ పురాణాల్లో శివుడు కళ్ళతో చూసి మన్మథుడిని బూడిద చేసాడనీ, కౌశికుడు పక్షిని దగ్ధం చేసాడని రాసిన సంఘటనలను కట్టుకథలుగా కొట్టివేసినా, ప్రస్తుతం మన కళ్ళ ఎదురుగా చేస్తున్న యూరిగెల్లర్ చర్యలు చూస్తుంటే మన పూర్వీకులు పురాణాల్ని ఎంత ముందు చూపుతో రాసారో తేటతెల్లమవుతుంది. ఏది ఏమైనా ఇటువంటి శక్తులున్న వారిని "ఓపెన్ మైండ్"తో పరిక్ష చేస్తే నిజానిజాలు తప్పక తెలుస్తాయి. అవమానం చేస్తూ అనుమానాలతో పరిక్షలు చేస్తే ఫలితం మాత్రం శూన్యం. మన భారత దేశంలో కూడా ఇటువంటి శక్తులు ఉన్నవారు ఎంతో మంది ఉన్నారు. వారిని పరిక్షచేసి ప్రపంచ ప్రజలందరికి వారి గురించి తెలియజేసే నైతిక బాధ్యత మనందరిమీదా ఉంది.

టెలిపతీ, క్లైయర్ వాయన్స్, సైకో కెనసిస్, ప్రీమానిషన్, ప్రీకాగ్నిషన్ డౌసింగ్, సైకోమెట్రీలాంటి శక్తులు తమకు ఉన్నాయని ఎవరైనా భావిస్తే, దయచేసి అది నాకు తెలియచేస్తే వారిని విదేశాలలోని సైనికల్ రీసెర్చి ఇనిస్టిట్యూట్ల వారికి పరిచయం చేయగలను. నా చిరునామా బి. వి. పట్టాభిరామ్ – మెజీషియన్ – హిప్నాటిస్టు, బి–2 ఎఫ్–3 కె విజయనగర్ కాలనీ – హైదరాబాదు–500457. లేదా విశాఖ పట్నంలోని ఆంధ్ర యూనివర్సిటీ పారసైకాలజీ విభాగానికి తెలియజేసిన తగిన పరిక్షలు చేయగలరు. అదృష్టవశాత్తూ అతీంద్రియ విజ్ఞాన రంగంలో అమెరికాలో అపారమైన కృషిచేసిన శ్రీ కె. రామకృష్ణారావుగారు ప్రస్తుతం ఆంధ్ర యూనివర్సిటీకి వైస్ ఛాన్సిలర్గా వచ్చారు. ఇది మనకు శుభ సూచకం అనుకోవచ్చు. □

(అయిపోయింది)




"ఎలా చెప్పాలో తెలీటంలేదు..." అంది సిగ్గు పడుతూ.

అతనికి అర్థమయిపోయింది ఆమె చెప్ప దల్చుకున్న విషయం.

"ఉషగారూ! మీరు అనుకుంటున్నదే నేనూ మీకు చెప్పాలనుకుంటున్నాను. ఈ నిర్ణయానికి రావడానికి ఇంతకాలం పట్టింది నాకు.

గత జీవితం పీడకలగా మర్చిపోవాలంటే మీకు దగ్గరవడమే మార్గమని... ఇప్పుడే తెలిసింది!" చెప్పటం ఆపి ఆమె వేపు చూశాడతను.

ఆమె ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతోంది.

కొద్ది క్షణాలాగి మళ్ళీ అన్నాడు "మనం పెళ్ళి చేసుకోడానికి మీ పేరెంట్స్ వప్పు కుంటారా?"

"నాకు అమ్మ ఒక్కర్తే ఉందండీ! ఇంకెవ్వరూ లేరు. అమ్మ నేనడిగిందేమీ కాదనదు. మరి మీ పరిస్థితి ఏమిటో నాకు తెలీదు..."

"నేను వివాహం చేసుకోవడమే మా అన్నయ్యకూ వదినకూ కావలసింది. వేరే విషయాలు వారు పట్టించుకోరు."

"మీరోసారి మా ఇంటికొచ్చి మా అమ్మతో మాట్లాడితే ఆమెకూ సంతృప్తిగా ఉంటుంది" అంది ఉష.

"తప్పకుండా వస్తాను – మీరే చెప్పండి ఎప్పుడు రావాలో..."

(గత సంచిక తరువాయి)

"మీకెప్పుడు రావాలనిపిస్తే అప్పుడే –"

"కానీ నాకు ఉద్యోగంలేందే – మన పెళ్ళి విషయం మీ అమ్మతో మాట్లాడడం ఏం బాగుంటుంది చెప్పండి–అదే ఆలోచిస్తున్నాను."

"దానికీ దీనికీ సంబంధం ఏముంది? మీకు ఉద్యోగం దొరక్కపోదుగా –"

"అయినాగాని ఏ ఉద్యోగమూలేకుండా పెళ్ళి చేసుకోవడం నాకు చిన్నతనంగా ఉంటుంది. అవునంటారా, కాదంటారా!"

"అలా అనుకుంటే నేనేం చెప్పలేను. సరే మీ ఇష్టం! మీకు ఏదొక ఉద్యోగం దొరికాకే మనం మారేజ్ చేసుకుందాం –"

"థాంక్యూ ఉషా! నా ఫీలింగ్స్ అర్థం చేసుకున్నారు -- అయామ్ హాపీ నౌ?"

గదంతా చీకటి అలుముకుపోయింది.

ఆమె లేచి లైటు వెలిగించింది.

"ఇంక నే వెళ్తానండీ!"

"ఆగండి! నేనూ మీ ఇంటివరకూ వస్తాను తోడుగా –" అన్నాడు కృష్ణ.

*　　*　　*

ఆ రాత్రి తల్లితో తన నిర్ణయం గురించి చెప్పేసిందామె.

"ఎవరతను?" అడిగిందామె.

"దీపక్ ఆఫీసులో పని చేసేవాడమ్మా! ఇప్పుడు ఆ ఉద్యోగం పోయింది. వేరే ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాడు. ఎమ్. ఏ. చదివాడు కాబట్టి ఉద్యోగం ఎలాగయినా దొరుకుతుంది–"

"నీ ఇష్టమమ్మా! అన్ని విషయాలూ జాగ్రత్తగా ఆలోచించి, అతన్ని గురించి అన్నీ తెలుసుకుని చేసుకో! నువ్వు జీవితాంతం సుఖంగా ఉండటమే నాక్కావలసింది..." అందామె.

ఉష సంతృప్తి చెందింది.

"అతన్ని ఓసారి ఇంటికి తీసుకొస్తానమ్మా! నువ్వు చూద్దువుగాని..." అంది నవ్వుతూ.

ఆ రెండోరోజే కృష్ణ ఆమె ఆఫీస్‌కొచ్చాడు.

"మీరొస్తారనే ఎక్స్‌పెక్ట్ చేస్తున్నాను ..." నవ్వుతూ అందామె.

"ఇప్పుడే ప్రసాద్ దగ్గరకెళ్ళివస్తున్నాను" అన్నాడతను.

"పదండి! కాంటీన్‌లో కూర్చుని మాట్లాడుకుందాం–"

ఇద్దరూ బాంక్ వెనకవేపున్న కాంటీన్‌లో కెళ్ళారు.

"ఏమన్నారాయన?" అడిగింది ఉష;

"ఇంతవరకూ ఏమీ ఛాన్స్ కనిపించ లేదట!"

"అంత త్వరగా దొరకడం కష్టమే!"

"మీరుచెప్పినట్లు ట్యుటోరియల్ కాలేజీలో ఉద్యోగం కోసం ప్రయత్నించదల్చుకున్నాను."

"నా ఉద్దేశం, మీకది తేలిగ్గా దొరుకు తుందని–"

"లెటజ్ హోప్ సో" నవ్వుతూ అన్నా డతను.

"ఇంకో గంటాగితే నేనూ మీతో వస్తాను..." అందామె టైమ్ చూసుకుంటూ.

"ఎక్కడికి?"

"మీ ఇంటికి!"

"ఎందుకు?"

"ఏం? రాకూడదా?"

"అలా అని నేననలేదు! కానీ అంతదూరం రావడం మీకు శ్రమ కాదూ?"

"మీరు పక్కనుంటే శ్రమేముంటుంది?" నవ్వుతూ అందామె.

ఇద్దరూ మళ్ళీ ఆఫీస్‌లోకి నడిచారు. ఆమెకు సమీపంగానే కూర్చున్నాడతను.

అయిదున్నరవగానే ఇద్దరూ అతనింటికి బయల్దేరారు.

"బస్‌లు దొరకడం కష్టం ఇప్పుడు! ఆటోలో వెళ్దాం..." అందామె.

ఆటోలో ఇల్లు చేరుకున్నారు.

"ఇంత త్వరగా ఇల్లు చేరుకోవడం ఇదే మొదటిసారి..." నవ్వుతూ అన్నాడతను.

"అవును! రాత్రి పొద్దుపోయే వరకూ 'దీపిక' ఆఫీస్‌లోనే గడిపోయేది కదా!"

"సారీ! మీరు కూర్చోడానికి కుర్చీ కూడా లేదు..."

**జరిగిన కథ–13 :** కృష్ణ అన్న, వదినలకు భారంగా ఉండటం ఇష్టంలేక ఉద్యోగాన్వేషణకై హైద్రాబాదు వెళుతాడు. ప్రసాద్ సహాయంతో అక్కడ దీపిక పత్రికాఫీసులో ఉద్యోగంలో చేరుతాడు. 'దీపిక' పత్రికాధిపతి రాజయ్య కూతురు జయలక్ష్మి కృష్ణతో స్నేహం చేయాలని ఉవ్విళ్ళూరుతుంది. కృష్ణ వేరే గది అద్దెకు తీసుకొని ప్రసాద్ ఇంటినుండి షిఫ్ట్ అయి వెళ్ళిపోతాడు. కృష్ణ సహోద్యోగిని ఉష అతనికి చేరువ కావాలని ఆరాటపడుతుంది. కృష్ణ ఆమెతో తన చరిత్ర మంచిదికాదని చెప్పి తనకు దూరంగా ఉండమని హెచ్చరిస్తాడు. రాజయ్య కూతురు జయలక్ష్మి కృష్ణను ఆకర్షించాలని చేసిన ప్రయత్నం విఫలమౌతుంది. ఉషకు బ్యాంక్‌లో ఇంటర్వ్యూ వచ్చింది. కృష్ణ 'దీపిక' ప్రెస్సులో రాత్రనక పగలనక పనిచేస్తూ ఉంటాడు. ఉషకు బ్యాంకులో ఉద్యోగం వచ్చింది. రాజయ్య 'దీపిక' పత్రికను ఆపేస్తాడు. కృష్ణకు ఉద్యోగం ఊడింది. కృష్ణ, ఉషలు తమకు ఒకరిపై ఇంకొకరికి గల ప్రేమను ఎలా తెలియచెప్పాలో! అని ఆలోచిస్తూ ఉంటారు.

''దానికి 'సారీ' చెప్పాల్సిన అవసరం లేదు లెండి.'' చిరుకోపంతో అందామె.

కోపంలో ఆమె అందం అతడిని సమ్మోహన పరచింది.

అప్పుడు ఇలాగే కోపంగా చూసినప్పుడే — తను ఆమె ప్రేమలో పడిపోయేడు. ఆమెను దగ్గరకు తీసుకుని పెదాల మీద ముద్దు పెట్టుకున్నాడతను.

ఉష అతని కౌగిలిలో తనను తను మర్చిపోయింది

''ఇంకా గట్టిగా కౌగలించుకోండి! ప్లీజ్..'' అంది నెమ్మదిగా.

అతను మరింత గాఢంగా కౌగలించుకుని మొఖమంతా ముద్దులతో నింపేశాడు.

కొద్దిక్షణాల తర్వాత అతని కౌగిలి నుంచి విడివడి దూరంగా జరిగిందామె.

''మీతో ఓ విషయం మాట్లాడాలి ...'' అంది గోడకానుకుని నిలబడి.

''మాట్లాడండి !''

''మన పెళ్ళయాక మా మదర్ మన దగ్గరే ఉంటుంది. మీకేమయిన అభ్యంతరం ఉందా !''

''అభ్యంతరం ఉంటుందని ఎందుకనుకున్నారు ? ఇంట్లో నాకెంత స్వాతంత్ర్యం ఉందో మీకూ అంతే స్వాతంత్ర్యం ఉంటుంది ...''

''థాంక్యూ! ఈ విషయమే కలవరం కలిగిస్తోంది మొన్నటి నుంచీ —''

''ఉషా ! మీరు నాకు కొత్త జీవితం ఇస్తున్నారు. ఇంక మిమ్మల్ని కాదనే అర్హత నాకెక్కడిది ? ఏ విషయంలోనైనాసరే — మీరు ఆజ్ఞాపించాలి ! నన్నో బానిసగా చూడండి ఉషా ! ఆనందిస్తాను !''

ఆమె అతని మాటలకు చలించిపోయింది.

''మీరు అలా మాట్లాడడం నాకిష్టం లేదు.'' అంది నెమ్మదిగా.

అతను మౌనంగా ఉండిపోయాడు.



''మీరేమీ అనుకోనంటే ఇంకో విషయం కూడా చెప్పాలనుకుంటున్నాను'' అందామె అతని వంక చూస్తూ

''............. ...''

''మరేమీలేదు. మీకు ఒకవేళ డబ్బేమయినా అవసరమయితే నాదగ్గర తీసుకోండి! ప్రస్తుతం మీకు ఉద్యోగం లేదుకదా! మరి మీకు డబ్బెక్కడి నుంచి వస్తుంది? అందుకని చెప్తున్నాను.''

అతను సిగ్గుపడ్డాడు.

''మీరు మీ జీవితాన్నే నాకు ఇచ్చేసి, నా జీవితం సుఖమయం చేస్తున్నారు. ఇంకా ఋణపడమంటారా?''

''డబ్బుకి నేనెప్పుడూ విలువ ఇవ్వను — కనుక ఋణపడడం అంటూ ఏమీ ఉండదు.''

''సరే— ఆ అవసరం వస్తే తప్పక తీసుకుంటానులెండి!''

ఆమె టైమ్ చూసుకుంది ''మరి నేను వెళ్లనా?''

''మీ ఇంటివరకూ నేను రావద్దా?'' నవ్వుతూ అని ఆమెతోపాటు బయల్దేరాడతను.

* * *

మర్నాడు ఉష బాంక్ చేరుకునేసరికి సుధీర్ ఆమె కోసం ఎదుర్చూస్తూ కనిపించాడు.

''మీకోసమే చూస్తున్నాను. సాయంత్రం మీకు ప్రోగ్రామేమయినాఉందా?'' అడిగాడతను.

''ఏమీలేదు. సంగతేమిటి?'' అడిగిందామె.

''సాయింత్రం మా హాకీ మాచ్ ఉంది. వస్తారేమోనని...''

''తప్పకుండా వస్తాను! ఎక్కడది?''

''బేగంపేట! నేనే నాలుగ్గంటలకల్లా వచ్చి మిమ్మల్ని తీసుకెళ్తాను...''

''నాలుగ్గంటల కెలా?''

''బాస్‌తో నేను చెప్తానులెండి. పర్మిషన్ తీసుకుని వెళ్ళవచ్చు...''

''సరే!''

# జీవితం - సెంటిమెంట్

అతను వెళ్ళిపోగానే శాంతి దగ్గర కెళ్ళిందామె.

''సాయింత్రం హాకీ మాచ్‌కి రమ్మంటున్నాడు సుధీర్. మరికాసేపు మీరు మానేజ్ చేసుకుంటానంటే నేను నాలుగ్గంటలకే వెళ్ళిపోతాను—''

''ఓ! అందులో పెద్ద కష్టమేముంది? వెళ్ళిరా!'' అంది శాంతి నవ్వుతూ.

''మాచ్‌కి నేనూ రావచ్చా?'' ఆ పక్కనే కూర్చున్న అరుణ అడిగింది ఉషను.

''నిజంగా వస్తారా?'' ఆశగా అడిగింది ఉష. ఆమె వస్తే తనకు తోడుగా ఉంటుందనిపించిందామెకి.

''ఊరికే అన్నానులెండి! నేను ఏ పరిస్థితిలోనయినా సాయంత్రం ఆరింటికల్లా ఇల్లు చేరుకోవలసిందే...'' అందామె నవ్వుతూ.

ఆ కొద్దిరోజుల్లోనే శాంతితోనూ అరుణతోనూ మంచి స్నేహం అయిపోయింది ఉషకు. లంచ్ టైమ్‌లో సాధారణంగా ముగ్గురూ కలసి కాంటీన్ కెళ్తూంటారు.

''పోనీ అయిదింటివరకూ మాచ్ చూసి వెళ్ళిపోదురుగానిలెండి...'' అడిగింది ఉష.

ఆమె ఓ క్షణం ఆలోచించింది ''సరే! వస్తాను—'' అంది శాంతివేపు చూస్తూ.

''నువ్వుకూడా రాకూడదూ?''

శాంతి నవ్వింది ''నాకూ ఆటలకూ చాలా దూరం! అందులోనూ హాకీ మరీ చిరాకు.''

సాయింత్రం అరుణా, ఉషా ఇద్దరూ మాచ్ కెళ్ళారు. ఎగ్జిబిషన్ మాచ్ అవడంవల్ల జనం ఆట్టేమంది లేరు.

తమ టీమ్‌లో అందరికంటె సుధీరే బాగా ఆడుతున్నట్లనిపించింది ఉషకి.

ఆట మధ్యలోనే అరుణ లేచి నిలబడింది.

''నేను వెళ్తాను — అయిదయిపోయింది.' అందామె.

''ఇంకొంచెంసేపేగా?''

''సారీ! ఇక్కడ కూర్చున్నా మనసు మనసులో ఉండదు—''

''ఇంటి దగ్గర అంత ఎట్రాక్షన్ ఏముందో?'' నవ్వుతూ అంది ఉష.

''మా పాప!''

ఆశ్చర్యపోయింది ఉష.

''మీ పాపా?''

''అవును!''

''అంటే?''

''మా పాప అంటే మా అమ్మాయ్! అంతే! ఇందులో అర్థం కాకపోడానికేముందీ? అది స్కూలు నుంచి నాలుగున్నరకు ఇంటికొచ్చేస్తుంది. అప్పటినుంచీ నా కోసం ఎదుర్చూస్తూ గేటు దగ్గరే నిలబడుతుంది...''

ఉషకేమీ అర్థం కావటం లేదు.

అరుణకు వివాహం అయినట్లే తనకు తెలీదు.

''ఓ. కే— సీ యూ...'' అనేసి వెళ్ళిపోయిందామె.

అరుణ తమ బాంక్‌లోనే పని చేస్తోన్న విజయ్‌తో చాలా చనువుగా వుంటుంది. అప్పుడప్పుడూ ఇద్దరూ కలిసి మాణింగ్‌షోలకెళ్ళటం కూడా తమకు తెలుసు. వాళ్ళిద్దరూ వివాహం చేసుకోబోతున్నారని బాంక్ అంతా అనుకోవడం తనూ వింది.

మరి ఈ పరిస్థితుల్లో ఆమెకు పాప ఉండడం ఏమిటి?

ఆట ముగిసేసరికి సాయంత్రం ఆరయిపోయింది.

''నేనూ వచ్చేస్తాను!' కొంచెం సేపు వెయిట్ చేయండి'' అన్నాడు సుధీర్ తన దగ్గర కొచ్చి.

ఆమె తలూపింది.

అతను వెళ్ళి డ్రస్ మార్చుకుని కిట్‌బాగ్‌తో సహా వచ్చాడు.

ఆటోలో బయల్దేరి ఆబిడ్స్ చేరుకున్నారు.

''పదండి, కాఫీ తీసుకుని వెళ్దాం'' అన్నాడతను.

హోటల్ రద్దీగానే ఉంది.

ఓ టేబుల్ దగ్గర కూర్చున్నారిద్దరూ.

''ఎలావుంది మాచ్?'' అడిగాడతను.

''నీట్‌గా ఉంది · కానీ మీరు మాత్రం అందరికంటె బాగా ఆడారు.''

''తెలుసులెండి! పొగడకపోతే ఏడుస్తానని పొగుడుతున్నారు.'' నవ్వుతూ అన్నాడతను.

''ఛ! నేనెప్పుడూ పొగడనలా!''

''నేను గొప్ప ఆటగాడిని కాదుగానీ, బహుశా మిగతావాళ్ళంతా సరిగ్గా చేతకాని వాళ్ళయి ఉంటారు.''



# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్లలో వుండాలి...



ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్‌లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు ఫాస్ఫరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్ఫరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం

# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్నీ వున్నాయి—ప్రొటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు. మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి.




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే. అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సిరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యవసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో నాల్గవ వంతుని అందచేస్తుంది. ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు.

మీ పాపకి చనుపాలే తగినవి. అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

# సిరిలాక్®
పాలు వుండనే వున్నాయి




**ఉచితం!** సిరిలాక్ పిల్లల పెరుగుదల ఛార్ట్
ఇందులో బరువు ఛార్టు, రోగనిరోధక మందుల రికార్డు, గట్టిగా ఉండే ఆహారం అలవాటు చేసేందుకు సూచనలు, యింకా ఎన్నో విషయాలు ఉంటాయి.
మీ కాపీ కోసం ఈ చిరునామాకు వ్రాయండి.
సిరిలాక్
పోస్ట్ బాక్స్ నం. 3 న్యూ ఢిల్లీ-110 008.

SAA/FSL/C/3151 TEL

NESTLÉ.

"ఏమో! ఆ విషయం నాకు తెలీదు.." తనూ నవ్వుతూ అందామె.

ఎక్స్‌ప్రెసో కాఫీ తెచ్చివారి ముందుంచాడు బేరర్.

"ఎప్పట్నుంచో మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను. ఇవాళ చెప్పేస్తాను.." అన్నాడతను కాఫీ తాగుతూ.

"ఏమిటది ?"

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను ఉషా! అచ్ వాన్ట్ టు మారీ యూ! మీకేమయినా అభ్యంతరం ఉందా ?"

ఆమె ఉక్కిరి బిక్కిరయింది.

అతనలాంటి ఉద్దేశ్యంతో ఉన్నాడనిగానీ, అతని స్నేహం వెనుక తనమీద ప్రేమ ఉందనిగానీ తను ఊహించలేకపోయింది.

అదీగాక అతనా విషయం అంత తేలికగా కాజువల్‌గా అడగడం మరీ తమాషాగా ఉంది.

ఆమె మౌనం అతనికి కలవరం కలిగించింది.

"అలా అడిగినందుకు మీరు హర్ట్ అవరనే అనుకుంటాను. ఏ విషయమయినా సరే, నేను సూటిగా మాట్లాడతాను! చిన్నప్పటినుంచీ అదే అలవాటు. మిమ్మల్ని హఠాత్తుగా చూసి ఒక్కరోజులో ఏర్పరుచుకున్న 'ప్రేమ' అని మీరు అనుకోకండి! ఎన్నో రోజుల్ల తర్వాత మిమ్మల్ని నా మనసు నుంచి చెరిపేయడం సాధ్యం కాదని తెలుసుకుని మిమ్మల్ని వివాహం చేసుకోవాలన్న నిర్ణయానికొచ్చాను. అఫ్‌కోర్స్! నా గురించి మీకేమీ తెలీకుండా మిమ్మల్ని అంగీకరించమని నేను అడగడం లేదు. మీకేమయినా వివరాలు కావాలంటే అడిగి తెలుసుకోండి!"

ఆమెకేం మాట్లాడాలో తెలీడం లేదు.

అతను తనకు మాట్లాడే అవకాశం ఇవ్వకుండానే మాట్లాడుతున్నాడు.

"ఉషగారూ! ఇంతకు ముందు చాలా మంది అమ్మాయిలతో పరిచయముంది. అయితే మీ అంత అందమయిన అమ్మాయి నాకింత వరకూ తటస్తపడలేదు. మీరు ఆకర్షించినంతగా ఇంకెవ్వరూ నన్ను ఆకర్షించలేకపోయారు. ఈరోజున మిమ్మల్ని ఎంత గాఢంగా ప్రేమిస్తున్నానో జీవితాంతం ఇలాగే ప్రేమిస్తూంటాను."

అతని మాటలు ఎంతో బాధని కలిగించసాగినయ్ ఆమెకి.

"నాకు వివావాం నిశ్చయమయిపోయింది సుధీర్‌గారూ!" అంది అతికష్టం మీద కూడదీసుకుని.

అతను ఉలిక్కిపడ్డాడు.

"నిశ్చయమైందా ?"

"అవును!"

కొద్దిసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాడతను. అతని మొఖంలో ఆవేదన స్పష్టంగా కనపడుతోంది.

## జీవితం—సెంటిమెంట్

"మీ పెద్దాళ్ళు నిశ్చయించిన వివాహమా?" అడిగాడతను.

"ఊహూ! కాదు. మేమిద్దరం ప్రేమించుకున్నాం ..."

"ఎవరా అదృష్టవంతుడు ?"

"అతనిపేరు కృష్ణ! నాతోపాటు ఇదివరకటి ఆఫీస్‌లో వర్క్ చేశాడు."

"నా అదృష్టం బావుండలేదు ఉషగారూ! అంతే! ఒకవేళ మీదే గనుక ప్రేమ వివాహం కాకపోయినట్లయితే మిమ్మల్ని ఎత్తుకుపోయి అయినా వివాహం చేసుకునేవాడిని ..."

ఆమె నవ్విందతని మాటలకు.

"సరే! పోనీండి! లెటజ్ ఫర్‌గెట్ ఎబౌట్ ఇట్!" అతనే అన్నాడు కొద్దిసేపటి తర్వాత.

ఇద్దరూ హోటల్ బయటికొచ్చారు.

"అయామ్ఏ బిట్ అప్సెట్! మీరు బస్‌లో వెళ్తారా" అడిగాడతను.

"అవును!"

"ఒకే!"

అతను వెళ్ళిపోయాడు వడివడిగా నడుస్తూ.

నెమ్మదిగా నడుస్తూ బస్‌స్టాప్ చేరుకుందామె.

మనసంతా బరువుగా అయిపోయింది.

తనెప్పుడూ అనుకుంటూండేది. స్త్రీ పురుషుల మధ్య స్నేహం ఎందుకుండకూడదు ? స్నేహం ప్రేమగా ఎందుకు మారాలి! జీవితాంతం స్నేహితులుగానే ఎందుకు మిగిలిపోకూడదు ?

కానీ ఇప్పుడు తెలుస్తోంది.

అలా జరగడం అసంభవం!

ప్రకృతిసహజంగా ఏర్పడే ఆకర్షణను ఎవరూ ఎదుర్కోలేరు. ఒకవేళ తమ మధ్య ఉన్నది ప్రేమ కాదనీ కేవలం స్నేహమేననీ చెప్పుకున్నా, లోలోపల వారికి తప్పక తెలుస్తుంది. పాము పడగలా ఆ స్నేహం వెనుక 'కోరిక' కదులుతూనే ఉంటుంది. పరిస్థితులు, అవకాశాలు కలిసివచ్చినప్పుడు ఆ కోరిక కాటు వేస్తుంది.

మర్నాడు ఆమె బాంక్‌కెళ్ళేసరికి కృష్ణ బయటే నిలబడి ఆమెకోసం చూస్తూ కనిపించాడు.

"ఏమిటిక్కడ నిలబడ్డారు?" అడిగిందామె.

"మీకోసమే!"

టైమ్ చూసుకుందామె.

మరో పది నిమషాలు టైముంది బాంకింగ్ అవర్స్ ప్రారంభం కావడానికి.

"పదండి! ఆ హోటల్లో కూర్చుందాం!" అందామె.

ఇద్దరూ హోటల్‌కెళ్ళి కూర్చున్నారు.

"నేనే ఇవాళ సాయంత్రం మీ దగ్గరకొద్దామనుకుంటున్నాను..." నవ్వుతూ అందామె.

"అలాంటి పని ఎప్పుడూ చేయకండి. నేను ఇంటి కెప్పటికి చేరతానో నాకే తెలీదు. మీరు అంత దూరం వెళ్ళాక నేను లేకపోతే కష్టంకదూ ?"

ఇద్దరికీ టీ తెచ్చిచ్చాడు బేరర్.

"మీతో ఓ విషయం అర్జంటుగా మాట్లాడాలి.." నవ్వుతూ అందామె.

"నేను అదివరకే చెప్పానుకదా! మాట్లాడనక్కరలేదు. ఆజ్ఞాపించండి! అంతే!"

"నిజంగానేనా ? తీరా చెప్పాక — సారీ అంటారా ?"

"ఆజ్ఞాపించి చూడరాదూ మీకేతెలుస్తుంది."

"సరే! అయితే మీ ఉద్యోగం దొరికే వరకూ ఆగకుండా ఒ వారం రోజుల్లోనే మనం పెళ్ళి చేసుకోవాలి.."

అతను నవ్వేశాడు.

"ఇంతేనా ?"

"దీనికే మీరు అప్పుడు ఒప్పుకోలేదుగా!"

"సరే — ఇప్పుడా సమస్యేలేదు. నాకో చిన్న ఉద్యోగం దొరికింది!"

"ఎక్కడ ?" ఆశ్చర్యంగా అడిగిందామె.

"రాజ్ పబ్లిక్‌స్కూల్" అనీ ఓ స్కూల్ ఈ మధ్యే ఓపెన్‌చేశారు. అందులో టీచర్.."

"మీరు అడగ్గానే ఇచ్చేసారా ?"

"కళ్ళకద్దుకుని ఇచ్చారు! అసలు ఇంతకు ముందు అప్లయ్ చేసినవారంతా మెట్రిక్యులేట్స్ నట! ప్రస్తుతం స్కూల్లో ఎనిమిదో క్లాసు వరకూ ఉంది.."

"ఎక్కడా స్కూల్ ?"

"విద్యానగర్‌లో —"

"అయితే ఇంకే సమస్యా లేదన్నమాట! ఎప్పటినుంచి జాయినవుతున్నారు స్కూల్లో ?"

"రేపటినుంచే! ఇవాళే చేరేవాడిని! మీతో చెప్పాలని ఆగాను."

"సాయంత్రం మా ఇంటికెళ్దామా ?" అడిగిందామె.

"ఓ! అయామ్ రెడీ!"

"అయితే సాయంత్రం అయిదింటికల్లా

### "ఐకమత్యం"

విరుద్ధ భావాలతో
వీర విహారం చేస్తున్న
నా శరీరంలోని
అంగాలకు—
నా కళ్ళే ఆదర్శం!
సుఖమైనా — దుఃఖమైనా
కలిసే
పంచుకుంటాయ్!

— కోలపల్లి ఈశ్వరరావు

ఇక్కడికొచ్చేయండి ! ఇద్దరం కలిసి మా ఇంటి కెళ్దాం !''

''ఓ. కే.''

''రాత్రికి మా ఇంట్లోనే భోజనం కూడా చేయాలి.''

''అదేమిటి ? ఎందుకలా ?'' అడిగాడతను.

''కాబోయే భార్య ఎలా వంట చేస్తుందో తెలుసుకోరూ ?'' నవ్వుతూ అందామె.

''మీరు కాబోయే భార్యేమిటి ?'' తనూ నవ్వుతూ అడిగాడు.

''అంటే ?''

''ఆ రోజు కౌగిలించుకున్నప్పుడే మనం భార్యా భర్తలమయి పోలేదూ ?''

ఆమె సిగ్గుపడింది.

''సరే– ఇంక వెళ్దామా ?''

ఇద్దరూ బాంక్‌వేపు నడిచారు.

''నేను సాయంత్రం వస్తాను.''

''ఊ !''

అతను వెళ్ళిపోయాడు.

ఆమె మనసంతా ఆనందంతో నిండి పోయింది.

మరో వారం రోజులు– అంతే !

ఇంక జీవితంలో ఒడిదుడుకులనేవి ఉండవు.

చిన్నప్పటి నుంచీ ఎన్నో ఎత్తుపల్లాలు అనుభవించింది. తండ్రి ఉన్నంతకాలంసుఖం– ఆయన పోయాక దరిద్రం–మళ్ళీ అక్కయ్య ఉండగా కొంత కాలం సుఖం– అప్పుడు మళ్ళీ దారుణమయిన కష్టాలు– ఇక్కడితో తన దురదృష్టకరమయిన జీవితానికి ఫుల్‌స్టాప్ పడిపోతుంది. ఇక నుంచీ– అన్నీ వెన్నెల రోజులే !

సాయంత్రం ఎప్పుడు అయిదవుతుందా అని ఎదుర్చూస్తూ కూర్చుందామె.

''ఇవాళ మీ మనసిక్కడ ఉన్నట్లు లేదే !'' ఆమె ఆందోళన చూసి నవ్వుతూ అడిగాడు సుధీర్ !

అతను ఆరోజు ఉదయం నుంచీ అంతకు ముందు రోజు రాత్రి తామిద్దరి మధ్యా ఏమీ జరగనట్లే మామూలుగా మసులుతోంటే తనకే ఆశ్చర్యంగా ఉంది. అసలు అంతకుముందు రోజు రాత్రి మాట్లాడుకుంది తామిద్దరేనా అని ! అదే ఇంకొకరయితే ఆ క్షణంనుంచే దూరంగా మసిలేవారు. తనమీద కక్ష కట్టేవాళ్ళు.

కానీ సుధీర్ స్పోర్ట్స్‌మన్. హాకీ ఆడడం లోనే కాదు, మనసులో కూడా !

అందుకే అంత సహృదయంతో తనను అర్థం చేసుకున్నాడు.

''నాకోసం మా ఫ్రెండ్ వస్తానన్నాడు..'' సిగ్గుపడుతూ చెప్పింది ఉష.

''మీ ఫ్రెండా ? ఎవరతను?''

''అనే ! నిన్న మీకు చెప్పలేదూ ?''

''ఓహోహో ! కాబోయే శ్రీవారా ? మరి విషయం చెప్పడానికి సిగ్గెందుకు ?''

''నేనేం సిగ్గుపడడం లేదులెండి ...''

''మరి ఫ్రెండ్ అని ఎందుకు చెప్పారు ?''

''అంటే భర్తకూ భార్యకూ మధ్య స్నేహం అనేది ఉండకూడదన్నమాట !''

అతను నవ్వేశాడు.

''నా ఉద్దేశ్యం అదికాదు –''

వాళ్ళు మాట్లాడుతూండగానే కృష్ణ వచ్చాడామె దగ్గరకు.

ఆరోజు అతనిలో పూర్తి మార్పు వచ్చింది.

ఖరీదయిన బట్టలూ, నీట్‌గా చేసుకున్న క్రాపూ, నున్నగా ఉన్న గెడ్డం – మెరిసే బూట్లూ –

అంతకుముందు రూపానికీ ఈరోజు రూపానికీ ఎంతో తేడా !

ఎందుకిన్ని రోజులూ అలా పిచ్చివాడిలా పెరిగిన గడ్డంతో, మాసినబట్టలతో ఈ ప్రపంచంతో సంబంధంలేనట్లు మసిలేవాడు !

ఆమెను చూసి చిరునవ్వు నవ్వాడతను.

''వెళ్దామా ?''

''బై ది బై మీట్ మై ఫ్రెండ్ మిస్టర్ సుధీర్ !'' సుధీర్‌ని పరిచయం చేసింది ఉష.

''హలో – హౌడూయూడూ'' అతనితో కరచాలనం చేశాడు కృష్ణ.

''నిన్నే చెప్పారు ఉషాదేవి మీ ఎంగేజ్‌మెంట్ గురించి'' అన్నాడు సుధీర్ నవ్వుతూ.

''మీ మారేజ్ ఎప్పుడు మరి ?'' ఉష నడిగాడతను.

''ఏమో ! ఇంకా ప్లాన్ చేయలేదు. ఓ వారంలో ఉంటుందేమో !''

''ఓ గాడ్ ! ఇంత షార్ట్ నోటీస్‌లోనా ?''

''మాది దండలు మార్చుకునే పెళ్ళేలెండి ! ఓ గంట ముందనుకున్నా తేలిగ్గా జరిగి పోతుంది...'' నవ్వుతూ అందామె.

''నిన్న మిమ్మల్ని చేసుకునే వ్యక్తి అదృష్టవంతుడన్నాను గుర్తుందా ?'' అడిగాడు సుధీర్.

''అవును ! ఏం ?''

''ఇప్పుడు నా స్టేట్‌మెంట్ మార్చుకుంటున్నాను. మీ ఇద్దరిలో ఎవరు అదృష్టవంతులో నేను చెప్పలేను...''

కృష్ణ నవ్వేశాడు.

''మీరు నిన్న ఇచ్చిన స్టేట్‌మెంటే కరెక్ట్.''

''ఓకే – సీ యూ టుమారో...'' అనేసి కృష్ణతోపాటు ఆఫీస్‌నుంచి బయల్దేరిందామె.

''ఆటోలో వెళ్దామా ?''

''నాక్కొంచెం కళ్ళు తిరుగుతున్నాయ్...'' అంది ఉష నవ్వాపుకుంటూ.

''ఎందుకని ?'' ఆందోళనగా అడిగాడతను.

''మిమ్మల్ని చూసి !''

''అదేమిటి ?''

''వచ్చింది మీరేనా, లేక ఎవరేనా రాజకుమారుడా అని అనుమానం వచ్చింది.''

అతను నవ్వేశాడు.

''ఇలా లేకపోతే నా పాతరూపం చూసి మీ అమ్మగారు మన పెళ్లికి ఒప్పుకోరేమో అని భయం వేసింది.''

''ఇప్పుడెంత బావున్నారో తెలుసా ?'' నెమ్మదిగా అందామె.

''ఎంతబావుంటే ఏమిలాభం ? మీ అందం ముందు దిష్టిబొమ్మనేగా !''

ఇద్దరూ ఆటోలో ఆమె ఇల్లు చేరుకున్నారు.

''మా ఇల్లు చూసి మీరేం భయపడకండి ! ఒకేఒక్కగది. వంటిల్లు. కనుక ఇల్లంతా సామానుతో నిండిపోయి ఉంటుంది'' అందామె లోపలికి అడుగు పెడుతూ.

ఆమె కుర్చీ టేబుల్ కింద నుంచి లాగింది.

''కూర్చోండి'' అని చెప్పి తన బాగ్ టేబుల్‌మీద ఉంచి ''అమ్మా'' అంటూ వంటింట్లోకెళ్లింది.

''ఇవాళ పెందలాడే వచ్చావే ?'' అందామె తల్లి.



''ఆయనను తీసుకొచ్చానమ్మా !'' అంది ఉష సిగ్గుపడుతూ.

''ఎవరు ?''

''అదే—నీకు చెప్పలేదూ ?''

''అలా చెప్పకుండా తీసుకొచ్చేస్తే ఎలా?'' హడావుడిపడుతూ అందామె.

''ఏంఫరవాలేదులే ! నువ్వొచ్చి మాట్లాడు కాసేపు.''

''నేనేంమాట్లాడను ?'' అయిష్టంగా అందామె.

''ఏదొకటి మాట్లాడవే !''

''ఏంవద్దులే !''

''పోనీ ! ఓసారిచూసి వచ్చెయ్ పద !''

''ఆమె ఉషతో పాటు గది లో కొచ్చి గడపలోనే నిలబడిపోయింది.

''నమస్కారమండీ !'' నమస్కారం చేశాడతను.

''నమస్తే !''

''ఉష మీకు అంతా చెప్పేవుంటారు!''

''అవునుబాబూ ! దాన్ని మీరెలా చూసుకుంటారో ఏమో ! చిన్నప్పటినుంచీ ఎన్నో ఇబ్బందులు పడి పెరిగింది..'' బాధగా అందామె.

అతను ఉషవంక చూసి నవ్వాడు.

## జీవితం - సెంటిమెంట్

''మీరే చెప్పండి — మీ మదర్ కి సమాధానం !''

ఆమె లోపలికెళ్ళి కాఫీ తయారు చేయ సాగింది. ఉష ఆమె వెనుకేవెళ్ళి నిలబడింది.

''మరి ఓ వారంలోగా ఏర్పాటు చేయమంటావా అమ్మా ?'' అడిగింది ఉష.

''నీ ఇష్టమమ్మా! నాదేముంది? అయినా మంచి ముహూర్తముందో లేదో చూడాలిగా !''

''అదంతా ఆయనే కనుక్కుంటారులే ! ఆ ముహూర్తానికి ఏదొక హోటల్లో పార్టీ ఏర్పాటు చేస్తాము. అందరి ఎదురుగ్గా దండలు మార్చుకుంటాం..''

''మావయ్యకుముందే లెటర్ రాస్తే వాడూ రావడానికి వీలుంటుంది. వాడొక్కడేగా ఉన్నది మనకి ?''

''అదంతా నేను చూసుకుంటాన్లే...'' రెండు కాఫీకప్పులు తీసుకుని హాల్లోకొచ్చిందామె.

''అమ్మకు చెప్పాను. మంచి ముహూర్తం చూసి ఏర్పాటు చేయమంది. మరి ఆ విషయ మేదో మీరే చూడాలి.''

''రేపే కనుక్కొచ్చి మీకు చెప్తానుకదా !''

''వీలయితే శనివారంగానీ ఆదివారంగానీ కుదిరితే బాగుంటుంది. మన ఫ్రెండ్స్ అందరూ ఎటెండ్ అవడానికి వీలుంటుంది.''

''సరే...''

''అన్నట్లు మీకు మా ఫామిలీ ఆల్బమ్ చూపించలేదు కదూ ?'' అంటూ టేబుల్ సొరుగులో ఉన్న ఆల్బమ్ బయటకు తీసి అతని ముందుంచిందామె.

తనూ అతని ప్రక్కనే నిలబడి అతను ఒక్కొక్క పేజీ తిప్పుతోంటే ఆ పేజీలోని ఫొటోల్లో ఉన్నవారి గురించి చెప్పసాగింది.

''ఈయన మా ఫాదర్ ! మేమంతా నా చిన్నప్పుడు మద్రాస్ కెళ్ళాం. అక్కడ బీచిలో ఫొటో దిగాము. ఇది నేనూ, మా అక్కా, మా అమ్మా !''

ఇది మా అమ్మ ఫొటో—

ఇది మా పిన్ని వాళ్ళది. వాళ్ళంతా నార్త్ లో సెటిలయిపోయారు.

ఇది మా బాబాయి ఫొటో—

ఇది మా మామయ్య ఫొటో—

ఇది మా మామయ్య ఫామిలీ— అత్తా— పిల్లలూ.

కృష్ణ మరో పేజీ తిప్పాడు.

అతనికి షాక్ తగిలినట్లనిపించింది. కళ్ళు మసకబారిపోయినయ్. గుండెలు పిండేస్తున్నట్లు బాధ.

ఎదురుగ్గా కార్డ్ సైజ్ ఫొటో— అంత కంతకూ పెరిగి నిలువెత్తున కనిపించసాగింది.

అందులో సావిత్రి.

అందంగా, అచ్చం ఉషలా నవ్వుతోంది.

కళ్ళు మిరుమిట్లు గొలిపే అందం—

తన చేతుల్లో నలిగిపోయిన అందం—

తను చేసిన మోసంవల్ల 'మసి' అయిపోయిన అందం—

సావిత్రి ఫొటో!

అవును! ఈ ఫొటో ఇక్కడెందుకుంది?

"ఇది మా అక్కయ్య ఫొటో! ఎంత అందంగా ఉండేదో చూశారా! ఒక రోగ్ ఆమె జీవితం నాశనం చేశాడు. లేపోతే ఈపాటికి పిల్లా, పాపలతో ఎంత బాగుండేదామె జీవితం! వాడు చేసిన మోసానికి తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుంది. అప్పటి నుంచే నాకు మగాళ్ళంటే అసహ్యం కలిగింది. ఆ రోజు నుంచే ఏ మగాడినీ నమ్మలేదు. ప్రేమ, గాడిదగుడ్డు అని వెర్రి వేషాలేసినా దగ్గరకు రానీలేదు ..." ఆవేశంగా అంది ఉష.

కృష్ణకు చెమటలు పట్టేయసాగినయ్.

"ఏమిటీ ఘోరం! సావిత్రి ఉష అక్కయ్యా? తనకెందుకు తెలీలేదీ విషయం? ఆమె ఎలా తెలుసుకోలేకపోయింది తన గురించి? ఇప్పుడేమిటి చేయడం? సావిత్రిని ప్రేమించినట్లు నటించి, మోసం చేసి ఆమె ఆత్మహత్యకు కారకులయి, ఇప్పుడు మళ్ళీ ఆమె చెల్లెల్ని ప్రేమించి పెళ్ళి చేసుకోవడమా? ఇంతకంటె ఘోరం ఇంకేమయినా ఉంటుందా? ఈ విషయం తెలిసిన మరుక్షణం తనను ఉష అసహ్యించుకోకుండా ఉంటుందా? తన ప్రేమంతా కపట్యమని నిందించకుండా ఉంటుందా?"

ఉష అతని చేతి మీద నెమ్మదిగా నిమిగింది.

"కానీ ఇప్పుడు తెలిసిందండీ నాకు! అలాంటి రాక్షసులున్న చోటే మీలాంటి మంచి మనుషులూ ఉంటారని!"

కృష్ణ భరించలేకపోతున్నాడా మాటలు.

ఆ మాటలు తనకు ముళ్ళలా గుచ్చుకుంటున్నాయ్.

చేతిలోని ఆల్బమ్ ఛటుక్కున మూసివేసి కుర్చీలో నుంచి లేచి నిఃబడ్డాడు.

"నేనింక వెళ్తాను" అన్నాడు హడావుడిగా.

"అప్పుడేనా? భోజనంచేసి వెళ్తానని ప్రామిస్ చేశారుగా."

"సారీ! మా ఫ్రెండ్ దగ్గరకెళ్ళాలి అర్జంటుగా. ఆ విషయం మర్చేపోయాను."

ఆమె నమ్మలేనట్లు చూసింది.

"మీకు అంతక్లోజ్ ఫ్రెండ్స్ ఎవరున్నారు? ప్రసాద్‌గారేనా?"

"ఆ...అవును!..."

"ఇదేంబావుండలేదు. ఇలావెళ్ళిపోవడం" నిష్ఠూరంగా అందామె.

"ప్లీజ్" అనేసి బయటకు నడిచాడతను.

"రేపు బాంక్ కొస్తారు కదూ?"

అతను ఆమె మాటలు వినిపించుకోకుండానే వెళ్ళిపోయాడు.

ఉష చాలాసేపు అతని విచిత్ర ప్రవర్తన గురించే ఆలోచిస్తూండిపోయింది. ఎందుకంత హఠాత్తుగా అతను వెళ్ళిపోయాడో అర్థం కావటంలేదు. స్నేహితుడి దగ్గరకు మర్నాడు వెళ్ళవచ్చుకదా! ఒకవేళ అంత ముఖ్యమయిన అవసరం ఉంటే అసలు మర్చిపోవడం ఎలా సాధ్యమవుతుంది?

ఎటూ ఆలోచించలేకపోతోందామె.

కృష్ణ కొద్దిదూరం ఏడివడిగా నడిచాడు. ఆ తరువాత నడవడం సాధ్యం కావడంలేదు. ఎక్కడోచోట కొద్దిసేపు కూర్చుండిపోవాలనిపించసాగింది. అప్పుడే చీకటి అలుముకుంటోంది.

రోడ్డుపక్కనే ఉన్న ఓ పార్కులో పిల్లలు పెద్దగా కేకలు, అల్లరితో ఆడుకుంటున్నారు.

తనూ పార్కులోకెళ్ళి కూర్చున్నాడతను.

అతని మనసంతా అల్లకల్లోలమయిపోయింది.

ఇప్పుడేమిటి చేయటం?

సావిత్రి ఆత్మహత్యకు తనే కారకుడన్న నిజం ఉషకు చెప్పాలా?

చెప్తే జరిగేదేమిటో తనకు తెలుసు.

ఆమె తనను అసహ్యించుకుంటుంది.

మరోసారి తనకు కనిపించవద్దని శాసిస్తుంది.

తనలాంటి నీచుడిని ప్రేమించినందుకు కుళ్ళి ఏడుస్తుంది. పశ్చాత్తాపపడుతుంది.

తర్వాత క్రమేపీ ఈ సంఘటన మర్చిపోయి, మరెవరినో ప్రేమించి వివాహం చేసుకుంటుంది.

కానీ తన పరిస్థితేమిటి?

కేవలం ఉషవల్లే తను మానసికంగా కోలుకున్నాడు. ఆమె కలిగించిన సంచలనంవల్లే తను కొత్త జీవితం ప్రారంభించాలని నిర్ణయించుకున్నాడు. ఆమె ప్రేమలో, ఆమె సాన్నిధ్యంలో గతాన్ని మర్చిపోవాలని ఆశపడ్డాడు. కేవలం ఆమె కలిగించిన ఆకర్షణవల్లే తన జీవితంలో కొత్త ఆశలు చిగురించినయ్.

ఇప్పుడామె తనకు దూరమయితే, తన గతేమవుతుంది. ఇప్పుడిప్పుడే ఉష కారణంగా సావిత్రి సృష్టించిన నరకంనుంచి తేరుకుంటున్నాడు — ఇప్పుడు మళ్ళీ ఉషకు దూరమయి ఎలా జీవించడం?

ఒకవేళ ఉషకు నిజం చెప్పకపోతే ఏం జరుగుతుంది?

కానీ అనుక్షణం ఆమెతో జీవిస్తూ ఎంత కాలం ఆ నిజాన్ని దాచగలడు?

అబద్ధపు జీవితం గడుపుతున్నానన్న చిత్రవధ ఎంతకాలం భరించగలడు. నిజం తెలిసిన మరుక్షణం తన జీవితం మళ్ళీ ముక్కలయిపోతుందనీ, ఉష తనకు శాశ్వతంగా దూరమవుతుందనీ గ్రహించాక ఇంక తనకు మనశ్శాంతి ఎక్కడుంటుంది?

ఎటూ నిర్ణయించుకోలేక పోతున్నాడతను, తను ఏ మాత్రం ఊహించని పరిస్థితి ఇది.

పార్కులో పిల్లల సందడి పూర్తిగా తగ్గిపోయింది.

క్రమేపీ నిశ్శబ్దం అలుముకుపోతోంది.

టైము చూచుకున్నాడతను. పదకొండవుతోంది. లేచి ఇంటివైపు బయల్దేరాడతను.

రోడ్లమీద దీపాలు లేవు. కటిక చీకటి.

ఇంటి అరుగుమీదే వాలిపోయాడతను.

రెండు రోజులు ఇల్లు కదలకుండానే గడిచిపోయినయ్.

**(ఇంకా ఉంది)**



## ఆశకి పోతే అధోగతి !

**ఆశ మీది ఆసక్తితో కేరళకు చెందిన 20 ఏళ్ల సాల్మా అబుబేకర్ అనే వో సుందరి బొంబాయి చేరి అక్కడో కంపెనీలో ఆపరేటరుగా చేరి యింకా పై మెట్లేమైనా వున్నాయా అని వెతుకుల్లాడుతూండగా ఈమెలోని ఆశను చూసిన వో దుర్మార్గుడామెకు విదేశీ సుఖ జీవితం మీద మోజు కలిగించి, వో షేకుకు 60వేలకు అమ్మి చక్కా పోయాట్ట. ఆ షేకామెను రియాద్‌కు తీసుకునిపోయి అక్కడ తన కామ వాంఛ తీర్చుకోవడమే కాక, ఆమెను తార్చునారంభించాడట తనకు పరిచయమున్న వారికి. ఈ వుచ్చులోంచి ఆమెను వో సహృదయుడు తప్పించి, తిరిగి బొంబాయికి చేర్చాడట- సర్వమూ పోగొట్టుకున్న యీ సాల్మ తననీ స్థితికి తెచ్చిన దుర్మార్గుని మీద కేసు పెట్టే, వారు అతని కోసం వెతుకుల్లాడుతున్నారట- పోయిన వాడు దొరికినా, పోయినది దొరికేది కాదు గదా!**

## భర్త ధూమ పానం - భార్య ఆయు క్షీణం !

తమ తమ భార్యల వద్దే కూర్చుని వూహు సిగరెట్లు కాల్చి, ఆ పొగను రింగులుగాను, మరేదైనాలానూ తమ భార్యల మీదకు వదిలి పురుష సింగాలు తమ ఆయుష్షునేగాక, తమతమ భార్యల




ఆయుష్షును కూడా తగ్గించేస్తున్నారని సైన్సు అంటోందట. సిగరెట్లు కాల్చే భర్తల భార్యలు మామూలు భర్తల భార్యల కన్నా వో నాలుగేళ్ళు తక్కువ కాలం జీవిస్తారని, వారి ఆయుర్దాయం తమ భర్తలొదిలే పొగలతో కొట్టుకు పోతుందని సైన్సంటోందట.



## ఇటలీ స్త్రీల విజ్ఞప్తి !

మగవారు రాత్రిపూట రోడ్ల మీద తిరిగి ఆడవారిని, వారి శీల సంపదను, ఆభరణ సంపదనూ దోచుకుంటున్నారని ఇటలీకి చెందిన వనితలు వో యోంఛి పథకం వేసి, తత్ ప్రకారంగా వో వూరేగింపుగా నినాదాలు చేస్తూ ఇటలీ అధ్యక్షుల వారింటికి వెళ్ళి, వో వినతి పత్రం సమర్పించారట ఆ పత్రంలో రాత్రి తొమ్మిది దాటితే మగ పురుగు రోడ్ల మీద తిరుగ రాదని, అలా తిరిగిన వాని మీద కఠిన చర్య తీసుకుంటామని, ప్రభుత్వమో శాసనం చేయవల్సిందని విజ్ఞాపన వున్నదట - సెహభాష్ !

## హౌరా బ్రిడ్జిపై ఎండ వేడి ప్రభావం!

కలకత్తా హుగ్లీ నది మీద 1943లో హ్యూబర్ట్ షెల్లీ స్మిత్ అనే ఇంజనీరు కట్టిన హౌరా బ్రిడ్జి ఆ నగర ఎండ వేడికి నాలుగు అడుగులు పెరిగి, సాయంకాలమయ్యే సరికి మళ్లీ యథా ప్రైజు (అనొచ్చా)కు ముడుచుకుపోతూందట. ఉష్ణము వలన లోహాలకు వ్యాకోచ సంకోచాలుండునని సైన్సన్నా మరీ యింత వ్యాకోచమూ! సంకోచమూ! సందేహంగానే వున్నదే! ఈ బ్రిడ్జిలో 1,500 అడుగుల ఏకసెంటీ లీవర్ స్పాన్ యీ రకంగా వాతావరణ స్థితికి సంకోచ వ్యాకోచాలు పొందుతూంటుందట- గజిబిజిగా వున్నట్టుందా!

## 68కి బదులు 28 కొట్టిన కంప్యూటర్

భారత దేశపు బిచ్‌కుంద అనే గ్రామానికి చెందిన జె. పురుషోత్తమ్ అనే స్కూలు పైనలు విద్యార్థి పుట్టిన రోజు 5-2-1968 కాగా అక్కడి కంప్యూటరు ఆ వయస్సును 2-5-1928 అని చూపిందట. ఆ కుర్రాడు, అతని తండ్రి వారిబాబోయ్ అన్నారట- అనరూ మరి !

## కట్నం కోసం వేధింపు

నెల్లూరుకు చెందిన నూర్జహాను అనే వో వివాహిత పదకొండేళ్ల వివాహ జీవితానంతరం తన భర్త దయానందరావీనాడు వో చిన్న యిల్లు సెటప్ చేసుకుని, తనను చావ పుతుకుతున్నాడని పోలీసులకు రిపోర్టిచ్చిందట. అమె పట్టిన నోమే అదే నెల్లూరులో పట్టి, కట్నం కోసం తన భర్త, అత్త **మామలూ తనను** హింసిస్తున్నారని 26 ఏళ్ల **మొయ్యి పార్వతి** అనే వివాహిత పోలీసులకు **చెప్పిందట**

## ఏడాదిలో రెండసార్లు ప్రసూతి సెలవు వాడుకున్న వితంతువు!

మహారాష్ట్రకు చెందిన పంధర్‌పూర్‌లో (పండరిపురం) జిల్లా పరిషత్తులో పని చేస్తున్న ఒహావిద ఒకే సంవత్సరంలో రెండు సార్లు తాను ప్రసవించినట్టు అప్లికేషను పెట్టుకుని శలవు కూడా పొందిందట. ఆనక యీ లెక్కలు పునశ్చరణ చేస్తూ అధికారులు కెవ్వుమన్నారట. ఏటికి రెండు సార్లు ప్రసూతి శలవు, యివ్వడం ఆశ్చర్యమనీ, అలా ఎవరూ ఏటికి రెండు సార్లు ప్రసవమవరనీ ఆలోచి?చి, ఆరాలు తీస్తే ఆ టీచరమ్మగారు వితంతువట కూడాను -

## మగ చేపగా మారిన ఆడ చేప

చేపలలో వో జాతి తమలో తమకు అవసరం వచ్చినప్పుడు ఆడ చేపలు మగ చేపలుగా తక్కున మారగలవని టెల్ అవివ్ విశ్వ విద్యాలయానికి చెందిన డాక్టర్ లివ్‌లోక్ నిరూపించి చూపారట. వో గాజు తొట్టిలో నీళ్ళు పోసి, అందులో ఆ జాతి రెండు ఆడ చేపలను పడ వేసి వుంచుతే, కొంత కాలానికి (రోజులనుకోండి) ఆ రెంటిలో వో ఆడ చేప తక్కున మగ చేపగా మారిపోయిందట!




## ప్రమాదాల వల్ల దుర్మరణాలు !

రోడ్డు ప్రమాదాల వల్ల యావత్ ప్రపంచంలో ఏటికి రెండున్నర లక్షల మంది మరణిస్తున్నారట. దీనికి పదిహేను రెట్ల మంది (ముప్పయ్యేడున్నర లక్షలు) గాయపడుతున్నారట. సరియైన పోషక ఆహార పదార్థాలు పడక, తల్లి దండ్రులు అజ్ఞానం వల్ల, రోగాలతోనూ ఏటికి ప్రపంచంలో 150 లక్షల మంది పసి పిల్లలు చనిపోతున్నారట. □

## ఇప్పుడు... మీ చర్మ సమస్యలను కడిగి పారవెయ్యండి...
## మీ చర్మానికి శుభ్రమైన, ఆరోగ్యవంతమైన నిగనిగ ఇవ్వండి.

# Godrej నిమిన్

### శుద్ధమైన వేపనూనె యొక్క సహజ సద్గుణాలు కలిగినది.

నీమ్, మార్గోసా అన్న పేర్లతో పిలువబడే వేపచెట్టు, చర్మ సంబంధ సమస్యలకై మానవజాతికి ప్రకృతి ప్రసాదించిన వరాలలో ఒకటి. వేపనూనెను క్రమం తప్పకుండా వాడితే, అది మీ చర్మం నునుపుగా, తేటగా ఉండడానికి తోడ్పడుతుంది.

గోద్రెజ్, శుద్ధమైన వేపనూనెను చేర్చి రూపొందించిన సబ్బు, నిమిన్ — మీ చర్మ సమస్యలను కడిగి పారవేసే లగ్జరీ టాయిలెట్ సోపు. ఈ గోద్రెజ్ నిమిన్ మరింతకాలం మన్నుతుంది. ఎందుకంటే ఇది ఇతర కొన్ని మార్గోసా సబ్బులవలె మెత్తబడిపోదు.



**నిమిన్ — మీ అంత శ్రద్ధగా మీ చర్మాన్ని కాపాడే సబ్బు.**

CHAITRA-B G 230 TEL

# కిడ్నీ ఖరీదు

సామిరెడ్డి జమున

రావు

అప్పుడే రౌండ్స్ ముగించుకుని క్యుబన్‌వెస్ట్ వార్డ్ నుండి కిడ్నీ డిపార్ట్‌మెంట్‌లో పేరు పొందిన డాక్టర్ శర్మ తన ఫ్రెండ్ దయానంద్ కోసం కార్డియాలజీ డిపార్ట్‌మెంటుకు రింగ్ చేసాడు.

''డాక్టర్ దయానంద్ హియర్.''

''నేను శర్మని కాంటిన్ కెళ్దాం వస్తావా?''

''వద్దు. ఐదునిముషాల్లో మీ డిపార్ట్‌మెంటుకు వస్తాను పనుంది.''

''నేను మా ఆఫీస్ రూమ్‌లో కూర్చుని వుంటాను వచ్చెయ్.''

ఫోన్ డిస్‌కనెక్ట్ చేసి పోస్ట్ అందుకుని విప్పి పూర్తిగా చదివిన డాక్టర్ శర్మ ముఖం తెల్లగా పాలిపోయింది. హఠాత్తుగా ఆవహించిన నీరసంతో వెనక్కు వాలి కళ్ళు మూసుకున్నాడు.

ఎన్ని నిమిషాలు అలా నిశ్శబ్దంగా గడచి పోయాయోగానీ దయానంద్ రాకతో మెల్లిగా కళ్ళు విప్పాడు. అతని నుదురంతా స్వేద బిందువులతో నిండిపోయింది. కూర్చో అన్నట్లు కుర్చీ చూపించి మరలా కళ్ళు మూసుకున్నాడు. అతని లోని మానసిక వ్యథ అతని ముఖంలో ప్రతిబింబిస్తోంది. ఎద పైకి, క్రిందకు ఎగసిపడ్తోంది.

''ఏమయింది శర్మా? వాట్ హాపెండ్?''

''యమున చనిపోయింది దయా.''

''ఏ యమున?''

''నీకు నెల క్రితమే యమునను చూపించాను గుర్తులేదా?''

డాక్టర్ దయానంద్ గుర్తు చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు.

క్షణంలో క్షణంసేపు గుండె నిండిన కన్నీళ్లతో గతంలోకెళ్ళిపోయాడు డాక్టర్ శర్మ.

ఆరు సంవత్సరాల క్రితం ఒ. పి. లో కూర్చుని అప్పుడే వచ్చివెళ్లిన పేషెంటు తాలూకు వివరాలు కేస్ షీట్‌లో వ్రాసుకుంటున్న తను...

''నమస్తే డాక్టరుగారూ!'' అన్న కంఠం వినపడి తలెత్తాడు. తన ఎదురుగా పద్దెనిమిది సంవత్సరాల అమ్మాయి నిలబడి వుంది. ఆ అమ్మాయిని చూడగానే తనలో చలనం. పది సంవత్సరాల క్రితం జ్ఞాపకాలు. డేట్ క్లియర్ చేసుకునేదానికి కేస్ షీట్‌లో పేరు చూసాడు.

'యమున' అనుమానం తీరింది.

''అప్పుడప్పుడు ముఖం వాస్తుంది డాక్టరుగారూ!'' అందామ్మాయి.

''డాక్టరుగారు కాదమ్మా శర్మన్నయని ఇంకా గుర్తుపట్టలా?'' ఆనందంగా అన్నాడు తను. తన గుండెల్లో చిన్నారి యమున నిత్య నూతనంగా మిగిలిపోయింది.

''మీరూ'' ఆలోచిస్తూ ఆగిపోయింది.

తలమీద ఓ మొట్టికాయ వేసి ''భలే దానివేనమ్మా. ఎనిమిదేళ్ళవరకు నా భుజంమీద పెరిగావు. నా స్టడీస్‌కోసం చిత్తూరు వదిలి వెళ్ళాల్సివచ్చినపుడు నిన్నొదిలి వెళ్ళాలని ఏడ్చాను కూడా.''

''మీరు శర్మన్నయ్యా?'' గుర్తు చేసుకుంటున్నట్టుగా మెల్లగా అంది.

''గుర్తొచ్చానా? పెద్దదానివయిపోయావు. నిన్ను నేను గుర్తుపట్టడం కష్టం. కానీ నన్ను గుర్తుపట్టడానికి ఇంతాలస్యం చేశావేం యమునా?''

''పదేళ్ళయిపోయిందిగా'' అని సిగ్గుపడి ''అయినా అమ్మ ఎప్పుడూ మిమ్మల్ని మీ అమ్మగార్ని తల్చుకుంటూనే వుంటుంది. ఎప్పుడు నేను మారాం చేసినా మీరొచ్చి కబుర్లతో, కథలతో నన్ను ఆడించేవాళ్ళని గుర్తుచేస్తూ వుంటుంది.''

''నిజమేనమ్మా! ఒక్కోరోజు స్కూల్ కెళ్ళనని ఎంత మారాం చేసేదానివో అలాటప్పుడు మీ అమ్మ నిన్ను నా దగ్గర వదిలేసి వెళ్ళిపోయేవారు, ఓ ఐస్‌ఫ్రూట్ లంచం ఇచ్చి సైకిల్‌మీద తీసుకెళ్ళి వదిలేవాడిని.''

''అమ్మ, వెంకట్ రెడ్డి కులాసానా యమునా?''

''ఊఁ'' ఆశ్చర్యంగా చూస్తోంది.

''వెంకట్‌కు పెళ్ళయిందా?''

''ఆ''

''ఇప్పుడేం చదువుతున్నావ్?''

''బి. ఎ. సెకండ్ ఇయర్.''

''ఏం గ్రూపు తీసుకున్నావ్?''

''హిస్టరీ, ఎకనమిక్స్, అడ్వాన్స్‌డ్ తెలుగు''

''అమ్మో! ఇక తెలుగు నీతో మాట్లాడలేనన్నమాట.''

''నాకు అ, ఆ లు దిద్దించింది కూడా మీరేకదా!''

''నో... నీవు నన్ను 'మీరు' అని గానీ 'డాక్టర్' అని గానీ పిలవొద్దు యమునా. నాకీ ప్రపంచంలో వుండే ఒకే ఒక ఆత్మీయురాలు 'అమ్మ'కూడా చనిపోయింది. చిన్నప్పుడు నన్నెలా 'శర్మన్నయ్యా' అనేదానివో అలాగే పిలువమ్మా. నాకు నిన్ను చూస్తుంటే చాలా సంతోషంగా వుంది. ఇప్పుడు మీరు చిత్తూరులోనేవున్నారా?''

''ఆ''

''నాకిక్కడ పోస్టింగ్ రాగానే మీ కోసం చిత్తూరులో అప్పుడు మనమున్న దగ్గర వాకబు చేస్తే అక్కడ మీరు లేరు.''

''గిరింపేటలో వెంకటన్నయ్య ఇల్లు కట్టి ఐదు సంవత్సరాలయింది.''

''ఇన్ని రోజులు చిత్తూరులో వుండి రాలేకపోయావా?''

''మా శర్మన్నయ్య ఇక్కడున్నాడని తెలిస్తే ఎప్పుడో వచ్చేదాన్ని'' నవ్వుతూ అంది.

''వెంకట్ చదువాపేశాడా?''

''చదువుమీద ఇంటరెస్ట్ లేదు.''

''ఏం బిజినెస్ చేస్తున్నాడు.''

''రకరరాలు'' అని నవ్వేసింది మరలా.

''అమ్మ ఆరోగ్యం బాగుందా?''

''అమ్మకు నా గురించే బెంగ.''

''ఎందుకూ?''

''హెల్త్ బాగలేదు కదా నాకు.''

''ఏమిటో నిన్ను గుర్తుపట్టిన ఆనందంలో నీ విషయమే మర్చిపోయాను. ఇప్పుడు చెప్పు ఎలా వుంటుందమ్మా నీకు?''

''అప్పుడప్పుడు ముఖం, కాళ్ళు వాస్తాయి. చాలా నీరసంగా వుంటుంది.''

''ఎప్పటినుండి?''

''రెండు సంవత్సరాలనుండి.''

''అప్పటినుండి ఎవరికీ చూపించుకోలేదా?''

లేదన్నట్టు తలూపింది.

ఆ తర్వాత తను డాక్టర్‌గా మారిపోయి చకచక బి. పి. కట్టాడు. అన్ని ఇన్‌వెస్టిగేషన్స్‌కు వ్రాసి 'నీకు డిస్ట్రబెన్స్, నేనెళ్ళి టెస్ట్‌లన్నీ ఇచ్చేస్తాను' అని యమున చెప్పినా వినకుండా దగ్గరుండి టెస్ట్‌లన్నీ ఇప్పించాడు. యమునతో కాంటీన్ కెళ్ళి కబుర్లు చెప్పుకుంటూ కొద్దిసేపు గడిపి ఆమెను మరలా రెండు రోజుల తర్వాత రమ్మని చెప్పి ఒ.పిలో తలదూర్చాడు.

యమునని చూసాననే ఆనందం యమున ఇన్‌వెస్టిగేషన్స్ రిపోర్ట్ చూడగానే చప్పున చల్లారిపోయింది. యమునకు కిడ్నీ ట్రబుల్ అని తేలింది.

అలా మొదలయిన ఆమె ట్రీట్‌మెంట్లు ఐదు సంవత్సరాలు ప్రతి మూడు నెలలకు చెక్ అప్‌తో జరిగి లాస్ట్‌లో మూడు సంవత్సరాల క్రితం కంప్లీట్‌గా రెండు కిడ్నీలు డామేజ్ అవడంతో ఆపరేషన్ చేయాల్సి వచ్చింది.

''ఓ... మీ సిస్టర్ అని చెప్తివే ఆమేనా?.. ఆపరేషన్ సక్సెస్ అయిందని చెప్పావుగా?''

అప్పటి వరకు నిశ్శబ్దంగా వున్న శర్మ డాక్టర్ దయానంద్ ప్రశ్నతో యమున గత కాలపు జ్ఞాపకాలనుండి బయటపడి ''అవును'' అన్నాడు.

''ఇప్పుడు ఫెయిల్యూర్‌లో కెళ్ళిందా?''

తల అడ్డంగా తిప్పాడు డాక్టర్ శర్మ. అతని నోటి వెంట మాటరావడంలేదు. ఇన్ని సంవత్సరాలు చెల్లెలుగా, ఆత్మీయతను పంచి ఇచ్చిన యమున ఇక లేదు అనుకోగానే అతని కనుకొనుకులనుండి కన్నీటిబొట్లు జారి టేబిల్ మీద పడ్డా అతను తుడుచుకోలేదు.

డాక్టర్ దయానంద్ అచేతనుడయ్యాడు. ఎప్పుడూ జోక్స్‌వేస్తూ ఒకర్ని సంతోషపెట్టే శర్మ గుండెల్లో ఇంత సున్నితమైన పొరలా? యమునకొరకు శర్మ ఇంతగా చలించిపోతున్నాడా?

వాళ్ళిద్దరి అపురూపమైన అనుబంధాన్ని ఊహిస్తున్నాడు డాక్టర్ దయానంద్.

''ఒకరోజు యమున నడవలేని స్థితిలో నొళ్ళంతా వాపులతో, వాళ్ళమ్మ పట్టుకుని నడిపించుకురాగా మెల్లిగా వచ్చి నా ఎదురుగా కూర్చుంది. ఎప్పటికప్పుడు యమున ఆరోగ్య పరిస్థితి తెల్సిన నేను వార్డ్‌లో అడ్మిట్‌చేసి టెస్ట్‌లన్నిటికి ఇచ్చాను.''

''ఉప్పులేని ఆహారం, వాపులు తగ్గడానికిచ్చే లాసిక్స్ ఇంజక్షన్లతో - ఆపరేషన్ అంటే భయంతో, బెంగతో పదిరోజులకే యమున బెడ్‌మీదనుండి కదల్లేని స్థితికి వచ్చింది. నేనెళ్ళి ధైర్యం చెప్పేవాడ్ని. డయాలసిస్ స్టార్ట్ అయింది. వాళ్ళ మదర్ బ్లడ్ గ్రూప్ యమున బ్లడ్ గ్రూప్‌తో కలిసింది. యమున మదర్‌ని కిడ్నీడోనార్‌గా తీసుకుని ఆమెకన్ని టెస్ట్‌లు చేయడం జరిగింది. ఇంతలో వాళ్ళన్న వెంకట్‌రెడ్డి యమునకు తన కిడ్నీ తీసుకోమంటూ వచ్చాడు. అతని బ్లడ్ గ్రూప్, టిష్యూ మ్యాచింగ్ కూడా యమున బ్లడ్‌తో మ్యాచ్ అవడంతో -- యమున తల్లి వయసు మించిపోయిందని, బి.పి. వుందని ఆమె చార్ట్ అక్కడ పడేసి వెంకట్‌కు అన్ని టెస్టలు చేయించాము.''

''వాళ్ళ అన్నయ్య కిడ్నీ చెల్లెలుకు ఇచ్చాడని చెప్పావుగా?''

''అదే ... అదే నేను చేసిన పొరపాటని పిస్తోంది దయా?'' చాలా విచారంగా అన్నాడు.

''అదేంఁ యంగ్‌మాన్, బి.పి. లేదు, బ్లడ్ గ్రూప్ మ్యాచ్ అయింది. అతని కిడ్నీ మంచిది కదా!''

''ఒక విధంగా నేనే యమునను చంపేసాను.''

డాక్టర్ శర్మకు యమున ఇకలేదు అనుకుంటే భరించలేకపోతున్నాడు. అతని కళ్ళల్లో ఎర్ర జీరలు.

"బి. బ్రేవ్ శర్మా అసలేమయింది ?"

"అదే వాళ్ళమ్మ కిడ్నీ అయితే యమున చనిపోయేది కాదు."

"అర్థం కానట్టు ముఖం పెట్టాడు డాక్టర్ దయానంద్.

"వెంకట్ అన్నయ్య చిన్నవాడు. నేనెలాగూ లాస్ట్ స్టేజిలో వున్నాను. నేను చనిపోతే ఈ బాధలనుండి విముక్తి పొందుతాను. అన్నయ్య కేమయినా అయితే నేను భరించలేను. అమ్మ కూడా అన్నయ్య కిడ్నీ వద్దంటోంది" అంది యమున.

కానీ నేనే ... నేనే వెంకట్‌కేమీ అవదని, మనిషికి ఒక్క కిడ్నీ చాలని ధైర్యం చెప్పాను. ఇంతలో వెంకట్ వచ్చి—

"నా బ్లడ్ గ్రూప్ యమునకు మ్యాచ్ అవకుండా వుండి వుంటే నా బ్లడ్ గ్రూప్ మ్యాచ్ అయ్యేవాళ్ళకయినా యిస్తాను గానీ ఎవ్వరికీ ఇవ్వకుండా వుండను" అని ఘంటాపదంగా చెప్తే ఆ రోజు ఎంతో సంతోషపడ్డాను. యమునకు అంత మంచి అన్నయ్య వున్నందుకు గర్వించాను కూడా ... " అతని కంఠం బొంగురుపోయింది.

"మరి ఇప్పుడామ్మాయి ఏ ట్రబుల్‌తో చనిపోయింది" డాక్టర్ దయానంద్‌కు యమున ఎందుకు చనిపోయిందో తెలుసుకోవాలని తొందరగా వుంది.

మరలా డాక్టర్ శర్మ చెప్పసాగాడు.

ఒక్క నెల క్రితం యమున వచ్చింది. అలవాటుగా నేను ఇన్‌వెస్టిగేషన్స్ పేపరు తీసుకున్నాను.

"నేను టెస్ట్‌లు చేయించుకోవడానికి రాలేదన్నయ్యా !" అంది.

"పదయితే ఇంటికెళ్దాం" అని లేచిన నన్ను —

"ఊహుఁ ఇక్కడే కూర్చుందామం"టూ కూర్చుంది.

"అలా వున్నావేమ్మా బి. పి. కట్టి చూస్తాను ఇలారా" అన్నాను.

"నాకు బ్రతకాలని లేదన్నయ్యా." ఏ ఉపోద్ఘాతం లేకుండా అంది.

"సరేలేఁ మీ అన్న, నేను నీ కొరకు యింత కష్టపడింది నీకు బ్రతకాలని లేకపోవడానికా ?" అని కసిరి అసలు సంగతి చెప్పమన్నాను. నాతో సాయంత్రం దాకా గడిపింది కానీ ఏ సంగతి చెప్పకుండానే వెళ్ళిపోయింది.

ఆ తర్వాత ఈ లెటర్ అని తన చేతిలో నలిగిపోతున్న జాబు తన స్నేహితుడి కందించాడు. ఆత్రుతగా విప్పి చదవసాగాడు దయానంద్.

శర్మన్నయ్యా !

జీవితంలో అభిమానాల్ని డబ్బుతో కొలుస్తారనే సత్యాన్ని జీర్ణించుకోలేక యీ లోకాన్ని విడిచిపోతున్నాను. నాకు నచ్చిన వ్యక్తి ఎదురుగా నిలబడి చేయందిస్తుంటే, నీ బాధ్యత అన్నీ ఇక నావి అని ప్రేమగా చెప్తుంటే ఆ వ్యక్తి చెయ్యి పట్టుకుని అతని జీవితంలో భాగస్వామిని కావల్సిన నేను ఇలా నిర్జీవంగా మారిపోవడానికి కారణం నాకు నువ్వమర్చిన కిడ్నీయే అన్నయ్యా. ఇది పిరికితనమే కావచ్చు. కానీ నా అన్న నాకు కిడ్నీ ఇచ్చి నన్ను బ్రతికించుకున్నాడు అనుకున్నపుడు ఆ ఆనందాన్నుభవించిన నా గుండె— ఇప్పుడు యీ సత్యాన్ని తెలుసుకుని ఇక నేను పని చేయలేను— అలసిపోయాను అంటోంది. ఆ సత్యమేమిటో చెప్పనా!

శేషారెడ్డి అనే అతను నాకు కిడ్నీ ట్రాన్స్‌ప్లాంట్ అయిందని తెలిసీ, ఇక నాకు పిల్లలు పుట్టే అవకాశం లేదని తెలిసీ కూడా పెళ్ళి చేసుకుంటానన్నాడు—నాకూ అందరి ఆడపిల్లల్లానే సంపూర్ణంగా జీవించాలనుంది. ఓ మనిషి తోడుతో, అతని నీడలో అతని ప్రేమలో మునిగి బ్రతకాలనుంది— ఆఖరి దశలో ఒంటరిగా మిగిలిపోవాలని లేదు. నాకు తెలుసు ఎంత ప్రేమవున్నా అన్న, అన్నే భర్త భర్తే ! అందుకే... అందుకే ఖచ్చితంగా శేషుని పెళ్ళిచేసుకోవాలని నిర్ణయించుకుని, నా ప్రాణాన్ని నిలిపిన వెంకటన్నకు ఆ వార్త ను ఆనందంగా మోసుకెళ్ళాను.

"నీకు పెళ్ళొద్దమ్మా ఎవరు చేసుకున్నా నీ డబ్బు కొరకే చేసుకుంటారు వద్దు తల్లీ!" సౌమ్యంగా అన్నాడు.

"ఆయన అలాటి వాడు కాదన్నయ్యా" అన్నాను.

"ఆఁ అందరూ అలాగే కన్పిస్తారమ్మా. అతను నాకు తెలియకపోవడమేమిటి ? వుత్తి తేనె పూసిన కత్తి— మాటలు మాత్రం తీయగా వుంటాయి."

"ఉహుఁ అతనలాటివాడు కాదు. నీ కంటె నాకు బాగా తెలుసు."

"చెప్తే అర్థం చేసుకోమ్మా. రేప్రొద్దున నీకు తిండి కూడా పెట్టడు. ఉత్త పిసినారి. పైగా స్వార్థపరుడు."

"అతను పిసినారే కావచ్చు, స్వార్థపరుడే కావచ్చు కానీ అతను నాకు మూడేళ్ళుగా తెలుసు. ఆ స్వార్థంలో భార్య కూడా వుంటుంది. అతను పిసినారే కావచ్చు ఎంతవరకు పిసినారో నాకు తెలుసు. అతని డబ్బు ఒకరికివ్వడు. అతను ఒకరి డబ్బు ఆశించడు. వున్నంతలో గుంభనంగా జరుపుకుంటాడు" తల వంచుకునే ధైర్యం చేసి అన్నాను.

"ఓ చాలా తెలుసుకున్నావన్నమాట. అతనికి చిల్లికానీ ఆస్థి లేదు. అది మాత్రం తెలిసినట్టు లేదు. అమ్మే బ్రతికుంటే యీ పెళ్ళికి ఒప్పుకునేది కాదు."

"అన్నయ్యా ! ఏమీ తెలుసుకోకుండా నేను పెళ్ళి చేసుకుంటే — నా పరిస్థితి నాకు తెలుసుగా. నేను కిడ్నీ పేషెంటుని. ఎప్పుడు మరలా నా కిడ్నీ ఫెయిలవుతుందో నాకు తెలీదు. ఫెయిల్ అయిన రోజు నన్ను అపురూపంగా చూసుకుని నాకు బ్రతుకుమీద విరక్తి రాకుండానే నన్ను సాగనంపే మనిషి కావాలి. డబ్బు కాదు నాక్కావాల్సింది. అయినా ఆయనకున్న పదెకరాలతో ఆయన జీవితాన్ని సుఖమయం చేసుకోగల సమర్థత వుంది. ఆ ఆస్థి మీద ఆధారపడాల్సిన అవసరం లేదు."

"శర్మన్నయ్యా ! నేను కాస్త తీవ్రంగానే మాట్లాడినట్టున్నాను. ఆ స్వతంత్రం మా అన్న దగ్గర నాకుందనుకున్నాను. పైగా ఆయన్ను 'చిల్లికానీ లేదని' ఎద్దేవా చేస్తుంటే సహించలేకపోయాను. శేషు మీద, శేషు ప్రవర్తన మీద నేనప్పటికే అభిమానాన్ని పెంచుకున్నాను.

"అయితే ఓ పని చేయమ్మా. నీ పేర అమ్మ వ్రాసిన ఆస్థిని నా పేర వ్రాసేసి వెళ్ళు, అప్పుడు అతను నిన్ను చేసుకుంటాడేమో చూద్దాం."






*We, the Chancellor, the Vice-Chancellor and the Senate of the University of Mysore, do hereby certify that*

Ramesh. S.M.

*has been admitted to the Degree of*

**BACHELOR OF COMMERCE**

*at the Convocation held in Mysore on the* Seventh *day of* October *1983, he having been duly certified to have passed the prescribed examination in the year 1983, with* ~ *and* ~ *as special subjects and he having been placed in the* First *Class*




*Given under the seal of the University.*

Vice-Chancellor

# రమేశ్ తెలుసుగా...
# ఇప్పుడు ఇతడు
# మిష్టర్ రమేశ్ బి.కాం.!



రాత్రింబవళ్లు శ్రమపడి చదివిన చదువు సార్థకం. ప్రగతి సాధన సమయానికిది ప్రారంభం. చిరస్మరణీయంగా నిలిచే మధుర క్షణాలు. జీవితంలో మరుపురాని ఘట్టం. కలకాలం ఇతడి స్మృతి పథంలో నిలిచిపోవాలి. హెచ్ఎమ్‌టి వాచ్ బహూకరించి అభినందించండి. ఇతడి ఉజ్వల భవిష్యత్తుకు నాంది పల్కండి.

హెచ్ఎమ్‌టి నచ్చినది ఎంచుకోడానికి వీలుగా 120 కంటే ఎక్కువ మోడల్స్ అందిస్తుంది. విశ్వసనీయం. సుదృఢం. ఖచ్చితం. సమయ సూచనలో ఉత్కృష్టం.



వాచ్ డివిజన్




దేశానికి సమయాన్ని సూచించువారు

ఫ్యాక్టరీలు
బెంగళూరు(I & II)
శ్రీనగర్, తుంకూరు

**hmt** వాచ్‌లు
అందులో ఒకటి మీకోసమే ప్రత్యేక

రాబోయే
సమయం మహోజ్జ్వలం

CLARION/HMT/84196/TEL

చాలా సౌమ్యంగా అన్నాడు వెంకటన్నయ్య. అప్పటికి అతనిలో కుట్ర నేను గ్రహించలేదు. అవివేకంతో నాకేదో మంచి చేయాలని అంటు న్నాడనే అనుకున్నాను.

అన్నయ్య చెప్పిన పాయింట్ మీద క్షణం ఆలోచించాను.

నీ ఆస్తి వదిలేసి వచ్చినా నేను నిన్ను పోషించుకోగలనన్నాడు శేషు — అతని పేరు శేషారెడ్డి. కానీ నాకేదయినా అయితే నా ట్రీట్ మెంటుకు లక్షరూపాయలు ఖర్చుపెట్టి అతన్ని బికారిగా మిగిల్చి నేనెళ్ళిపోవడం నేనూహించలేక పోయాను. అందుకే అన్నాను —

''నేను జబ్బు మనిషిని కదన్నయ్యా ఒక వేళ నువ్వు ప్రేమతో ఇచ్చిన కిడ్నీ ఫెయిలయిం దనుకో. దానికొరకు ఖర్చు పెట్టుకోవడానికి మాత్రం నాకీ ఆస్తి కావాలన్నయ్యా.''

''భార్యకు జబ్బుచేస్తే నయం చేసుకోలేని దౌర్భాగ్యుడికి నా చెల్లెల్నివ్వను.'' ఖచ్చితంగా అనేసి నా జవాబు వినకుండానే వెళ్ళిపోయా డన్నయ్య.

నేను ఏమి నిర్ణయించుకోవాలో తెలీనిదానిలా ఓ నిముషంపాటు మాత్రమే ఆగాను. ఆ తర్వాత ఖచ్చితంగా శేషుని పెళ్ళి చేసుకోవడానికే నిర్ణయించుకున్నాను

శర్మన్నయ్యా! ఆ తర్వాత నా హృదయం

## కిడ్నీ ఖరీదు

పగిలి, మనసు మొద్దుబారిపోయే మాటలు విని కూడా తట్టుకున్నానంటే అది నీ చెయ్యి చలవే.

ఆ రోజు మనసు బాగిలేక అన్నకూతురు మమతతో కారమ్స్ ఆడుకుందామని వాళ్ళ రూమ్‌లో అడుగు బెట్టబోయిన నేను వాకిట్లో గాజుపెంకు గుచ్చుకుని అది తీసుకోవడంతో ఆగాను. రూమ్‌లోనుండి మాటలు వినవచ్చాయి. నా ప్రమేయం లేకుండానే నా చెవులు ఆ మాటలు విన్నాయి.

''ఆ అమ్మాయి అడిగినట్లు చేసేస్తే పోలేదండి. జబ్బుపిల్లను ఎన్నాళ్ళు భరిస్తాం'' వదిన కంఠం.

''చాల్లే నోరు మూసుకో. తెలివి. జబ్బు పిల్లను నేనెక్కడ అన్యాయం చేస్తానన్నట్లో అమ్మ ఆస్తంతా మా ఇద్దరిపేర చెరిసగం వ్రాసింది గా. ఐదు లక్షల ఆస్తి ఆ పిల్ల మీదుంది. ఆ పిల్ల అనుభవించినన్ని రోజులు అనుభవిస్తుంది. ఆ తర్వాత మన పిల్లలను భవిస్తారు.''

''అయితే యమునకు పెళ్ళి చేయరా ?'' వదిన కంఠంలో ఆశ్చర్యం. అన్నయ్య ఎంత తెలివయినవాడో వదినకుకూడా అర్థంకాలేదు.

''మహా బ్రతికితే యమున పదేళ్ళు బ్రతుకు తుంది. పిల్లలు పుడితే ప్రమాదమని యమునకు అబద్ధం చెప్పాము. శేషారెడ్డి భార్య ప్రాణం పోతుందని తెలిస్తే పిల్లలు వద్దనుకుంటాడు. యమున పిల్లలూ అనుభవించక నా పిల్లలు అనుభవించక ఆ ఆస్తి వాడికెందుకు మిగలాలి?''

వదిన కాస్సేపు మాట్లాడలేదు.

''నాకామాత్రం ఆలోచనే లేదండీ.'' అని మాత్రం అని వూర్కుంది. తర్వాత వాళ్ళేమీ మాట్లాడకోలేదు. నా మనసులో సోదరప్రేమ మీద అపనమ్మకాన్ని కలిగించి నా గుండెల్లో ప్రేమను చంపేసి వాళ్ళు మాత్రం ఆ రాత్రి హాయిగా సినిమాకెళ్ళారు.

శర్మన్నయ్యా! నువ్వు నమ్మవు వారం రోజులు చిత్రహింస అనుభవించాను. రోజులు గడిచాక అన్నమీద విపరీతమైన విరక్తి... అంతే నా ప్రాపర్టీ కాగితాలు, నా తాలూకు సర్వం తీసుకుని శేషు ఇంటికి వచ్చేసాను. శేషు అమ్మ నన్ను సాదరంగానే ఆహ్వానించింది.

''ఆ డబ్బు అతని మొహానే కొట్టిరాక పోయావా అమ్మా'' అని మాత్రం అంది.

ఆ మాట ఆమె మనస్ఫూర్తిగా అన్నదో లేదో! అనే శంక నాలో మాత్రం కలిగిందనే నిజాన్ని నీ ముందు ఒప్పుకుంటున్నాను. మనుష్యులను నమ్మే అపురూపమైన దశమండి నా ప్రియమైన అన్నయ్య నన్ను దిగజార్చాడు.

ఆవేశంలో ఆ ఇంటినుండి ఈ ఇంటికి వచ్చేసానే కానీ— నాలో కొండంత అశాంతి. అన్న చేతులమీదుగా ఘనంగా పెళ్ళిచేసుకోవాలనే కోరిక తీరలేదు. దొంగచాటుగా చేసుకోవాల్సి వస్తోంది — ఆ రోజు వున్న అందమైన కలలు యీ రోజు లేవు — శేషుతో పెళ్ళి, అతనితో జీవితం — ఆ బంగారు కల నా గుండెల్లో తీపి అన్నయ్య మోసం క్రింద నలిగిపోయింది. నాలో చనిపోవాలన్నంత విరక్తి — దాన్ని కంట్రోల్ చేసుకుంటున్న సమయంలో — మా అన్నయ్య వదిన ఆ ఇంటిమీదకు దండెత్తారు.

''నువ్వు అతన్ని చేసుకోవడానికి నిర్ణయించుకున్న పక్షంలో నా కిడ్నీ ఖరీదు నాకిచ్చేసి చేసుకో. లేదంటే నా కిడ్నీ నా కిచ్చేసెయ్.''

శర్మన్నయ్యా! నా సర్వేంద్రియాలూ మొద్దుకట్టుకుపోయాయి — నేనేం వింటున్నానో నా కర్థంకాలేదు. మెదడు మొద్దుబారిపోయింది.

''నా కిడ్నీ నీ కివ్వకుండా సి.యం.సి. హాస్పిటల్‌లో అమ్ముకుంటే నాకు లక్ష రూపాయిలిచ్చేవాళ్ళు'' అన్నాడు.

నాలో నాకొత్తగా విపరీతమైన మార్పు. ఇలాటి మనుష్యులున్న లోకంమీద జుగుప్స. ఆ లోకంలో బ్రతక్కూడదనే కసి — నిలువెల్లా అసహ్యం.

''చెప్పు లక్షరూపాయిలిస్తావా? నా కిడ్నీ నాకు తిరిగిస్తావా?''

అతను నిలదీస్తున్నాడు. నా మొద్దుబారిపోయిన మనసులో ఇంకా మిగిలిన స్పందన.

అంటే ... అంటే నా అన్నయ్య నా కిడ్నీ అడుగుతున్నాడంటే -- నా ప్రాణాన్ని అడుగుతున్నాడు.

''పద నీకివ్వాల్సింది నీ కిస్తాను'' అన్నాను అతన్ని. 'అన్నయ్యా' అని పిలవడానిక్కూడా నా కసహ్యంగా వుంది.

''ఏమిస్తావు?''

''అది నీకనవసరం పద.''

అతను కదల్లేదు.

''మీరు పదండి అరగంటలో నేను వస్తాను.''

''తప్పకుండా వస్తావా? మోసం చేస్తావా?''

''మోసం చేయడం నాకసహ్యం'' అన్నాను.

వాళ్ళు కదిలి వెళ్ళారు — నేను శేషుని వదిలేసివస్తే చాలనుకున్నారేమో! తర్వాత నన్ను బంధించొచ్చనుకున్నారేమో!

''నేను సాయంత్రం వచ్చి తీసుకెళ్తాను. నువ్వు కష్టపడడం నాకిష్టంలేదు.''

చురుగ్గా చూసాను.

''నీకా శ్రమ ఇవ్వను'' అన్నాను.

వాళ్ళు వెళ్ళిపోయారు. ఆ సమయంలో పనమ్మాయి తప్ప శేషు, అత్తయ్య ఇంట్లోలేరు.

నేను పిచ్చిదానిలా నా ఆస్తి పత్రాలు తీసుకున్నాను. నేరుగా కోర్టు కెళ్ళాను—వీలునామా వ్రాయించాను. నా తదనంతరం నా ఆస్తి శేషుకి—అతను అంగీకరించకపోతే కిడ్నీ పేషెంట్ల ట్రీట్‌మెంటు నిమిత్తం ట్రస్ట్‌కు వ్రాసాను — అరగంట అనుకున్నది కోర్టులో చాలా టైమే తీసుకుంది. తర్వాత శేషుకో ఉత్తరం నీకో ఉత్తరం వ్రాస్తున్నాను. ఉత్తరాలు పోస్ట్‌లోవేసి నా చావుకు కారణం ఎవ్వరూ కాదని వ్రాయాలి. చనిపోయేముందు మా వెంకటన్నయ్య మీద కాస్తంత ప్రేమ మిగిలిపోయింది చూసావాన్నయ్యా —

దోవలో ఎండ్రిన్ కొనుక్కుంటాను. ఇంటికెళ్ళి తాగేస్తాను.

ఎప్పుడో చిన్నప్పుడు నీ గుండెలమీద నే నాడాను. ఆ భాగ్యానికి నువ్వు నాకు చాలానే చేసావు. రక్తం పంచుకుని పుట్టిన అన్నయ్య నా చావుని చూస్తున్నాడు. ఎంత చిత్రం—

నా కమర్చిన నా అన్నయ్య కిడ్నీ నిండా విషం వుంది అని తెలిసిన మరుక్షణం నీ కింకో బాధ్యతను అప్పగిస్తున్నాను— నా డెడ్‌బాడీ నీ కప్పగించాలని వ్రాసి చనిపోతున్నాను. నీ కప్పగించిన నా డెడ్‌బాడీలో వుండే నా అన్నయ్య కిడ్నీ తీసి అతని దోసిట్లో పోయమని నిన్ను అర్థిస్తున్నాను. ఇది నా ఆఖరి కోర్కె. తీరుస్తావా?'

శర్మన్నయ్యా! నేను సజీవంగా వున్నప్పుడే ఆ కిడ్నీని నా శరీరంలోనుండి తొలగించి వెంకటన్న దోసిట్లో నేనే వుంచాలనే వెర్రి కోరికను ఏ డాక్టరూ ఆమోదించడని తెలిసి నా కోరికను సమాధి చేసుకుని చనిపోయాకయినా నా కోరిక, నా అన్నయ్యకు నేనున్న బాకీ తీరుస్తావని వ్రాస్తున్నాను.

శర్మన్నయ్యా! నా డెడ్ బాడీలోకూడా ఒక స్వార్థపరుడి కిడ్నీ వుండకూడదు. చనిపోయిన నాకెలాగూ ప్రాణం పోయలేవుగానీ నా కోరికకు ప్రాణం పోసి నా శరీరంలో నుండి ఆ కిడ్నీని వేరుచేసి అతనిదోసిట్లోపోసినన్ను ఋణ విముక్తురాల్ని చేస్తావని తలుస్తూ ఆనందంగా చనిపోతూ —నీకు కొండంత కృతజ్ఞతలతో, ప్రేమతో...

నీ చెల్లి
యమున.

సుదీర్ఘమైన ఆ ఉత్తరాన్ని చదివి డాక్టర్ దయానంద్ కూడా గుండెల నిండా భారాన్ని నింపుకున్నాడు.

''శర్మా! ఆత్మహత్యలనేవి ఆవేశంతో కూడినవి. ఆవేశం చల్లారిపోయాక యమున ఆ ప్రయత్నం నుండి మానుకుందేమో! అలాగే జరిగుంటే నీవెళ్ళి యమునతో తనకు పిల్లలు పుట్టొచ్చని తన జీవితం శేషారెడ్డితో సుఖమయం చేసుకోమని చెప్పి వాళ్ళిద్దరి వివాహం దగ్గరుండి జరిపించిరా.''

అప్పటివరకు నిస్తేజంగా కూర్చుని వున్న డాక్టర్ శర్మకు ఊహించలేని శక్తి వచ్చింది. అంతే —

శర్మ కూర్చున్న కారు చిత్తూరు వైపు వెళ్తోంది.








సీరియల్

# దాగుడుమూతలు

## కప్పగంతుల మల్లికార్జునరావు

( గత సంచిక తరువాయి )

9

శ్రీమన్నారాయణకు వయసు యాభై పదులు దాటకపోయినా చిత్ర రంగంలో చాలా వృద్ధుడికిందే లెక్క. చిన్నతనంలోనే చదువు అబ్బక ప్రజాపోరాటాల్లోకి దిగేడు. ఆ రాజకీయాలూ అచ్చిరాక ఆఖరికి మద్రాసు వచ్చిపడ్డాడు. రాజకీయాల్లో పరిచయాలు వుపయోగించి చిత్రసీమలోకి 'బాయ్'గా ప్రవేశించాడు. పనిలో మెళుకువలతోపాటు బతుకుతెరువు మార్గాలూ తెల్సుకొన్నాడు. మనుష్యుల్ని 'పట్టటం' నేర్చుకొన్నాడు. అన్నిశాఖల్లోనూ అసిస్టెంట్‌గా పనిచేసేడు. చివరికి దర్శకుడయ్యాడు

అతను తీసిన చాలా సినిమాలు బాక్సాఫీస్ దగ్గర విజయాన్ని సాధించాయి. ఆకలిని, పేదరికాన్ని, కన్నీటిని, అందంగా ఆకర్షణీయంగా చూపటంలో అతను ఎక్స్‌పర్ట్ !

యిన్ని సినిమాలు తీసినా అతనికి వొక్క అవార్డూ రాలేదు. అందుకు కారణం అతనికి తెల్సు అతనితో పనిచేసిన వాళ్లకి తెల్సు. సినిమాలు విజయం కావటానికి స్వంత ఆలోచనల కన్నా, పది ఆలోచనల్ని ప్రజారంజకంగా తీర్చిదిద్దటమే ముఖ్యం అన్న కిటుకు తెల్సినవాడు అతను.

యిన్నాళ్లకు ఆయనకు స్వంతంగా వో అవార్డు సినిమా

---

**జరిగిన కథ—5 :** జనార్దనంగారు తమ కుమార్తె పెళ్లి వైభవంగా చేయ సంకల్పించారు. పెళ్లికొడుకు రమేష్ స్నేహితులు కోరే కోరికలకు హద్దూ, పద్దూ లేకుండాపోయింది. జనార్దనంగారు కూతురు సులోచన మొహంలో పెళ్లికూతురు మొహంలో వుండాల్సిన మెరుపు లేకపోవడం గుర్తిస్తారు. డాక్టరు సుధాకర్ పెళ్లికూతురుని తదేకంగా చూడటం, పరధ్యానంగా ఉండటం రమేశ్ స్నేహితులు గమనిస్తారు. రమేశ్‌కు ఈ విషయం చెపుతారు. వారందరిలో ఈ విషయం ఆలోచనలు రేకెత్తిస్తుంది. జరగాల్సిన పెళ్లి ఆగిపోయింది. అదే ముహూర్తానికి గోపీచంద్ సులోచనను పెళ్లి చేసుకోడానికి సిద్ధపడతాడు. గోపీచంద్, సులోచనల వివాహం జరిగిపోయింది. సులోచనను గోపీచంద్ తల్లితండ్రులు అప్యాయంగా తమలో కల్పుకొన్నారు. వారితోబాటు మూగి వెంకన్న బాబు వచ్చాడు. వెంకన్న బాబును తీసుకెళ్లను వచ్చిన రమేశ్ సులోచన మాటలతో పరాభవం చెంది వెళ్లిపోతాడు. సులోచన స్నేహితురాలు అరుంధతి తన భర్త కాంతారావుతో చెప్పి, గోపీచంద్‌కు సన్మానం చేయిస్తుంది సుప్రసిద్ధ సినీ దర్శకుడు శ్రీమన్నారాయణ నుంచి అర్జంటుగా రమ్మని కబురందుకున్న గోపీచంద్ సులోచనను వాల్తేరు బండెక్కించి తను మద్రాసు బండెక్కుతాడు.

---

తియ్యాలన్న కోరిక గలిగింది. సరిగ్గా ఆ సమయంలోనే రామారావు గోపీచంద్ నవలలను గురించి చెప్పేడు. పుస్తకాలను ఆయనకిచ్చాడు.

గోపీచంద్ రాసిన అక్షరాలలో ఆదర్శాలు ఆయనకి నచ్చేయి. వాటిలో రూపాయనోట్లు కన్పించాయి. కొత్త కొత్త ఆలోచనలు ... భావాలు ... వాటిని ఎక్స్‌ప్రెస్ చేయటంలో నవ్యత ... అదృష్టం బాగుండి వొక్క భావన 'క్లిక్' అయినా డబ్బుకు డబ్బు, అవార్డులకు అవార్డులు వస్తాయి.

'దర్శకుడుగారొస్తున్నారుసార్. డైరెక్టర్‌గారు...'

ప్రొడ్యూసర్‌గారు, ఆయన పార్టనర్‌లు యిద్దరూ, రామారావు, మేకప్‌మేన్, గోపీచంద్, ఆ గదిలో దాదాపు రెండు గంటల నుంచి శ్రీమన్నారాయణకోసం ఎదురు చూస్తున్నారు.

యింటికి ఫోను చేస్తే లేడు. స్టూడియోలకి ఫోను చేస్తే లేడు. హఠాత్తుగా యిప్పుడు వూడిపడ్డాడు.

అంతా కంగారుగా లేచి ఆయనకి స్వాగతం చెప్పటానికి వాకిట్లోకి వెళ్లేరు. పరిచయాలు, పలకరింపులు, లోకాభిరామాయణాలు అయ్యాయి.

'మీ నవల 'నెత్తురుకూడు' మాకు బాగా నచ్చిందండీ. బాగా చదివించే గుణం వుంది నవలలో. కానీ బాగా చదివించే నవలలన్నీ కూడా సెల్యూలాయిడ్ ఎక్కేక విజయవంతం కావాలనేంకాదు. సినిమా దృశ్యం, శ్రవ్యం కదా ? మీ నవలను యథాతథంగా తీస్తే బాగుంటుందంటారా ? లేక సినిమా మీడియంకు అనుగుణంగా ఏమన్నా మార్పులు చేర్పులు చేసి తీస్తే బాగుంటుందంటారా ? సినిమా ప్రేక్షకుడిగా మీ అభిప్రాయం చెప్పండి. రచయితగా కాదు' శ్రీమన్నారాయణ అన్నాడు.

గోపీచంద్‌కు ఏం జవాబివ్వాలో తోచలేదు.

మార్చటానికి వీల్లేదంటే అసలు నవలను సినిమాకుతీసుకోరేమో?

అతను రామారావు వైపు చూచాడు.

'మీరు మనసులో మాటలు చెప్పటానికి సందేహించాల్సిన పనేం లేదు గోపీచంద్‌గారూ. రామారావుగారు నాకు ముందే చెప్పేరు— మీ విషయం. ఏ రచయితకూ తను రాసింది మార్చవలెనని వుండదు. తను రాసిందంతా ప్రింటు కావాలని వుంటుంది. కానీ సినిమా విషయంలో అది అసంభవం కదా ? పైగా సినిమా అనేది లక్షలతో కూడిన వ్యవహారం. యివాల్టి ప్రేక్షకులకు సినిమా అంత నచ్చనక్కర్లేదు. ఒక్క సంఘటన, వొక్క పాత్ర, రెండు పాటలు, కొన్ని మాటలు పడ్తే చాలు. సక్సెస్ అవుతుంది. అలాగే సినిమాలో ఎన్ని విలువలున్నా వొక్కరవ్వ బోర్ కొడ్తే అన్ని లక్షలు, అంత కృషి గంగపాలే. కనుక నేను మిమ్మల్ని కోరేదేమంటే రచయితగా మీ నవలను క్షణకాలం మర్చిపోండి. కేవలం సినిమాలు చూచే ప్రేక్షకుడిగా ఆలోచించండి.'

'కానీ రచయితగారు అంత ఎక్కువగా సినిమాలు చూచేవారిలా కన్పించటంలేదండీ. మనం తీసిన సిన్మాలేమీ చూడలేదు. మీ దర్శకత్వంతో సినిమాలు కూడా ఎక్కువ భాగం చూచినట్టు లేదు.

యిందాక మాటల్లో నేను గ్రహించాను.' ప్రొడ్యూసర్ కలగజేసుకొని అన్నాడు.

'అవునండీ. నేను పెద్దగా సినిమాలు చూడనండీ.'

'ఎందుకని ?'

'ఎందుకంటే- అతనికి సినిమా పద్ధతులంటే చచ్చేటంత ఎలర్జీ. ఏ చిత్రం చూచినా ఎక్కడో చూచినట్లో, ఎక్కడో వదివినట్లో గుర్తుకొస్తుంటుంది. తలా తోక వుండిని కథలు. కృత్రిమమైన సంభాషణలు. సినిమాకోసం కల్పించిన దృశ్యాలు. పాటలు...గెంతులు... అసహజమైన మెలోడ్రామా... చివరికి వుత్కంఠ పెంచటం కోసం భయంకరమైన సంగీతం... స్టంట్స్... ఫైట్స్... చావులు... ప్రజా సమస్యల్ని ప్రతిబింబించలేని సినిమాలు చూడటం దండుగ కాదూ?'

కానీ అలా చెప్తే యింకేమయినా వుందా ?

పెళ్ళికొచ్చి పెళ్ళికూతుర్ని 'ముండ' అని తిట్టినట్లుంటుంది.

'బహూశా తీరిక వుండదనుకొంటాను. అంతేనా ?'

శ్రీమన్నారాయణగారూ ... థేంక్సండీ. అబద్ధాన్ని అందించారు.

'అవునండీ. నా ఆఫీసు వుద్యోగం అలాంటిది. రాయటానికే సమయం చిక్కడం కష్టం. యిక సినిమాలు చూచే వ్యవధి ఎక్కడ ? కోరికను చంపుకోక తప్పదుగదా !'

అబద్ధాలంటే గిట్టని తను అంత హాయిగా ఎలా అబద్ధాలాడ గలుగుతున్నాడు ?

'పోనీలేండి. సినిమా ప్రేక్షకుడిగా కాకపోతే సినిమా విమర్శకుడిగానే ఆలోచించి చెప్పండి. కానీ వొక్క విషయం గుర్తుంచుకోండి. మీరు మార్చాలన్నా మార్చనక్కర్లేదన్నాకూడా మేం సినిమా తీసేది ఖాయం. మీరు నాటక రచయితకూడా కనుక మీ చేతనే డైలాగులు కూడా రాయించాలనుకొంటున్నాం.'

అమ్మయ్య ! యిక భయంలేదు. తనే డైలాగులు రాసేట్లవుతే ఆ మార్పులేవో తనే చేయవచ్చు. శ్రీమన్నారాయణ చేసిన ఖ్యాతి తనకే వస్తుంది. తనకు మంచిదికదా ?

'సినిమాకు అనుగుణంగా, మనం కల్సి ఆలోచించి, చర్చించి, మార్పులు చేర్పులు చేస్తేనే బాగుంటుందండీ !'

'గుడ్ ! మీ అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. అయితే చర్చలకు కూర్చునే ముందు మీరు కొన్ని సినిమాలు చూడాలి.'

అంటే ? యిప్పట్లో యీ సినిమా తియ్యటంకాదా ?

తను సినిమాలు చూచే దెప్పుడు ? చర్చిందెప్పుడు ? సినిమా తీసేదెప్పుడు ?

'వారంరోజులపాటు నాకు కొంత పనుంది, యీలోగా మీరు సినిమాలు చూడండి. భయపడకండి. సినిమాలు చూడటానికి మీరు ఎక్కడికో పోనక్కర్లేదు. మీరిక్కడే వుంటారు. సిన్మాలు మీకు ప్రత్యేకంగా వేసి చూపించబడ్తాయి. మీరు చూడాల్సిన సినిమాలేమిటో నేను ప్రొడ్యూసర్‌గారికి చెప్పి వెళ్తాను. ఆయన ఆ ఏర్పాట్లన్నీ చూచుకొంటాడు. మీ పని సినిమాలు చూడటమే ? రోజుకు రెండు మూడు చూడగలరుగా ? చూచి మీ నవలను సినిమాకు అనుగుణంగా ఎలా మారిస్తే బాగుంటుందో, 'సీనిక్‌లైట్'గా, వో కాగితంమీద రాసి పెట్టి వుంచండి. మీ నవలలో మెయిన్ థీమ్ చెడగూడదు. కమర్షియల్ ఏస్పెక్ట్స్ మీరు ఆలోచించవద్దు. పాతవే అయినా మీ నుంచి వచ్చే భావాలు కొత్తగా వుండాలని ఆశిస్తాను. నేను వచ్చేక చర్చకు కూర్చుందాం ... ఆ తర్వాత పిక్చరంతా మూడునెలలలో ఫినిష్ అయి పోవాలి. అంటే మూడునెలల తర్వాత సినిమా రచయితగా మీ పేరు మోగిపోవాలి. తెల్సిందా ?'

ఎన్నో చెప్పాలనుకొన్నాడు గోపీచంద్. ఏమీ చెప్పలేదు. మనసంతా సంతోషంలో నిండిపోయింది. అన్నింటికీ తలవూపేడు.



# దాగుడుమూతలు

## 10

'సులోచనమ్మా. గోపాళం గొప్పోడవుతున్నాడమ్మా. ఆడిపేరు అందరి నోళ్లల్లో మోగిపోతున్నది. మీ అత్తయ్యను, నన్ను ఆడి సిన్మాకు తీసికెళ్లవామ్మా ? కిట్టిగాడు, రమాలు ఎవరిదోవన ఆళ్లు చూచొచ్చారు. అమ్మను అయ్యను సిన్మాకు తీసుకుపోదామని వొక్కరికీ లేదు. యీ ముసలాళ్ల విషయం ఆళ్లకెందుకు పడుతుందిలే ? నువ్వొచ్చావు? నా తల్లివిగదూ ? తీసికెళ్లమా ?'

'నేను నా స్నేహితురాళ్లతో వెళ్లేను వదినా. తప్పా ? ఆ కిట్టిగాడు తీసికెళ్తాడనుకొన్నాను. నాకేంతెల్సు ఆ ముచ్చువెధవ ఎవరికీ చెప్పకుండా వొంటరిగా చూచొస్తాడని ! కిష్టిగాడిని యింటికి కాపలాగా వుంచి మనమంతా వెళ్దాం వదినా. సినిమా బాగుంది. మా ఫ్రెండ్స్ వొకటికి రెండుమూడుసార్లు చూస్తున్నారు.'

'అలాగే మామయ్యా. అందరంకల్సి యివాళేవెళ్దాం. సరేనా ?''

'మాతల్లే ! నీ చదువు అయిపోయినట్లేగదామ్మా ? '

'అయిపోయినట్లే మామయ్యా. నెలరోజుల తర్వాత వెళ్లి పరీక్షలు రాసివస్తే అయిపోయినట్లే. యింక వెళ్లనక్కర్లేదు.'

సులోచన కోర్సు పూర్తిచేసుకొని ఆరోజే వచ్చింది.

ఆరోజు రైలెక్కించాక మళ్లీ భర్తను చూడలేదామె.

నవలను అమ్ముకురావడానికివెళ్లి డైలాగులు రాసేటందుకు అక్కడే వుండిపోయాడు. ఎప్పుడో వో వుత్తరం రాసేడు. అంతే.

'వచ్చిన అవకాశాన్ని జారవిడ్చుకోటం ఎందుకు ? ఎలాగూ నువ్వుకూడా చదువులో వున్నావుగా ? మూడునెలలలో పిక్చర్ అయిపోతుంది. నీ చదువు అప్పటికి అయిపోతుంది. ఒకవేళ పిక్చర్ ముందు అయిపోతే నేను రెక్కలు కట్టుకొని నీ దగ్గరికి వస్తాను. సరేనా ?'

'పిక్చర్ రిలీజ్ కూడా అయింది. అంటే కనీసం అంతకు పదిహేనురోజుల ముందే పనంత అయిపోయి వుండాలి. అసలు డైలాగ్ రచయిత పనంతా షూటింగ్ ఆరంభానికి ముందే కదా ? డైలాగులు రాసిపడేసి రాకూడదూ ? అక్కడే వుండటం దేనికి ?'

ఆమెకేదో భయం...అనుమానం...

'మీ ఆయనగారు డైలాగులు రాసిన సినిమాను రిలీజ్ అయిన రోజు చూడవద్దూ ? నీ వేషం నేను వేసి థియేటర్ యజమానికి టిక్కెట్ రిజర్వు చేయమని ఫోను చేయనా ?'

స్నేహితురాళ్ళు ఎంత బలవంతంచేసినా ఆమెకు భర్త డైలాగులు రాసిన సినిమా చూడబుద్ధేయలేదు ఎందుకో !

మర్నాడే స్నేహితురాళ్ళు సినిమాను వొకటే పొగడుట ! డైలాగుల్ని చెప్పుకొని వొకటే ఆనందించటం ?




'లోచన, నీ భర్త అని పొగడటంకాదు కానీ అతను గొప్ప గొప్ప ఆదర్శాలున్నవాడే. యువతరానికే ప్రతినిధి. ఎంత బాగా రాసేడనుకొన్నావ్ ?'

'నెత్తురుకూడు' నవలను సులోచన చదివింది. యువతను చైతన్యవంతంకమ్మని జాగృతంచేసే నవల అది. వొక విధంగా అందులో హీరో గోపీచందే. ఆమెకు బాగా నచ్చిన నవల అది.

కానీ ఆ నవలలో హీరో ధనస్వామ్యానికి బద్ధశత్రువు. ధనస్వామ్యం చూపించే ఆకర్షణలకు, వ్యామోహాలకు లొంగడు. యువకులు తమ ప్రతిభను పెట్టుబడిదారులకు అమ్ముకొని పేదల నెత్తుటికూడు తింటున్నారని, వ్యామోహాన్ని వదిలి యువత నిజమైన విలువల్ని తెల్సుకోవలసి వుద్బోదిస్తాడు.

అలాంటి నవల రాసిన గోపీచంద్‌కు యీ సినిమా వ్యామోహమేమిటి ?

ఆమె అలా ఆలోచనలో వుండగా అరుంధతినుంచి వుత్తరం వచ్చింది.

'లోచన్,

గోపీచంద్‌గారి నవల ఆధారంగా డైలాగులు కూడా అతనే రాసిన సినిమా 'ప్రీవ్యూ'ను మొన్న మావారితో కల్సివెళ్లి చూచాను. చూచొచ్చాక మాకు నిద్రపట్టలేదు. నిన్నుగురించే ఆలోచిస్తూ కూర్చున్నాం. ఎందుకంటే ఆ సినిమాద్వారా మా కళ్లకు కన్పించిన గోపీచంద్ నిన్ను పెళ్లి చేసుకొన్న గోపీచంద్ కాదు. తన రచనలలో కన్పించే గోపీచంద్ కాదు. ఆ సినిమా ద్వారా సాక్షాత్కరిస్తున్న గోపీచంద్‌కు చిత్తశుద్ధి, నిజాయతీలు లేవు. ఆశావ్యామోహాల కతీతుడు కాడు. సమాజం, దేశం బాగుపడాలన్న తపన అతనికి లేదు. రెండు నాలుకలు, పది తలలు, పది చేతులు, పెద్ద బొజ్జ వున్న మనిషి అతను. నలుపు అతని వర్ణం. అదనపు తలలు, చేతులు, నాలుకలు పెరిగి పెద్దవి కాకముందే నరికెయ్యి. నీ భర్త కొత్త అవతారాన్ని అంతం చెయ్యి. ఇంతకన్నా ఏం రాయను ? అర్థం చేసుకొంటావు కదూ ?'

ఉత్తరంతోపాటు కాంతారావు ఆ సినిమాను గురించి పత్రికలో రాసిన సుదీర్ఘమైన సమీక్ష కట్టింగ్‌ను పంపింది.

సినిమాను సినిమాగా మెచ్చుకొన్నాడు కాంతారావు. ఫోటోగ్రఫీ మ్యూజిక్, ఎడిటింగ్ .దర్శకత్వం, అన్ని శాఖలూ ఎంత నిర్దుష్టంగా వున్నదీ పేర్కొన్నాడు.

సినిమా కథను మూల నవలతో పోల్చేడు. మూల నవలలో విలువల్ని సినిమా వ్యాపార విలువలదృష్ట్యా ఎలా మార్చిందీ, ఆ మార్పు వల్ల నవలలోని విలువలు ఎలా మారిపోయి వుల్టాసీదా అయిందీ విశ్లేషించాడు.

'మోసం పలురకాలు. కొత్త కొత్త మోసాలను కనిపెట్టటంలో సినిమావాళ్లకు సినిమావాళ్లే సాటి. అయితే యీ సినిమా ద్వారా దర్శకుడు, రచయిత కల్సి చేసిన మోసం చాలా పెద్దది. ఘాతుకమైనది. డబ్బుల్ని దృష్టిలో వుంచుకొని సినిమా తీసి ఆ సినిమాకు విప్లవం, చైతన్యం అన్ని ముసుగులు వేసేరు. యీ ముసుగులు అవార్డుల కోసమా ?

యింతవరకు ప్రసిద్ధ దర్శకుడు శ్రీ శ్రీమన్నారాయణగారు పేదలను, వాళ్ల కష్టాలని, కన్నీళ్ళను అందంగా మలిచి జనానికి అమ్మి డబ్బు చేసుకొన్నారు. యిప్పుడు యువత మీద పడ్డట్లుంది. నిజాయితీ, చిత్తశుద్ధివున్న వో రచయిత నవలను తీసుకొని అతని ఆదర్శాలను చంపుతూనే వాటి ద్వారా అటు ధనాన్ని యిటు అవార్డులను సంపాదించాలనుకొంటున్నాడు. యిలా సామాజిక విలువల్ని, విప్లవ భావాలను యువతను మోసం చెయ్యటం సంఘద్రోహం. వో మంచి రచయిత నవలను తీసుకొని అతని ఆదర్శాలను చంపుతూనే వాటి ద్వారా అటు ధనాన్ని యిటు అవార్డులను సంపాదించాలనుకొంటున్నాడు. యిలా

# ఒకమారు ఉపయోగించారంటే బిజ్ మీరు మరిమరి కొనే పని వుండదు ఇహ మీకు.




## ఎందుకంటారా?

సూపర్ బిజ్ లోని ప్రత్యేకమైన ఫార్ములా అదనంగా శక్తివంతమైన ఒక డిటర్జెంట్ కల్గి వున్నది. ఇది జిడ్డు-జిగట, మచ్చలు-మరకలు, మురికి-మైలను చిటికెలో తొలగించేస్తుంది. తళతళలాడే మెరుపు ఇస్తుంది. మరి అందులోనే వుంది—సాధారణ తోమే పౌడర్లలో లేని సూపర్ బిజ్ ఉత్కృష్టత. సూపర్ బిజ్ లోని ప్రత్యేకమైన డిటర్జెంట్ త్వరగా నురుగు నిస్తుంది. కనుక మీరు త్వరగా, చక్కగా శుభ్రం చేసుకోగలరు. అందుకే ఎంతో ఎక్కువ జిడ్డు అయినవి ఏవి శుభ్రం చేయాలన్నా సరే, చౌక తోమే పౌడర్ల కన్నా దీనిని ఎంతో తక్కువగా ఉపయోగించుకోవచ్చు.

అందుచేతే మీరు బిజ్ వాడి నిజంగా ఎంతో ఆదా చేసుకోవచ్చు.

మేము చెప్పాముగా మరి....ఒకమారు ఉపయోగించారంటే బిజ్ మీరు మరి మరి కొనే పని వుండదు ఇహ మీకు. ఎందుకంటే....




## కాస్త బిజ్ ఎంతో ఎక్కువ తోముతుంది.

గోద్రెజ్ ఉత్పాదన

CASGS.162-254 TEL

# దా గు డు మూ త లు

సామాజిక విలువల్ని, విప్లవ భావాలను, యువతను మోసం చెయ్యటం సంఘ ద్రోహం. వో మంచి రచయిత యిలా అమ్ముడుపోయి తనని తాను ఎందుకు మోసం చేసుకొంటున్నట్లు ? యిది పెద్ద ట్రేజడీ— ఇంటలెక్చువల్ ట్రాజడీ. దీన్నంతా గుర్తించాలి. సినిమా ద్వారా తలపెట్టిన మోసాన్ని ప్రేక్షకులు ముఖ్యంగా యువత ప్రతిఘటించాలి' అంటూ ముగించాడు సమీక్షను.

కానీ యువత ఆ సమీక్షను చదివి సమీక్షకుడిని విమర్శించింది. ఆ సినిమాకు, రచయితకు, దర్శకుడికి యింకా పేరొచ్చింది.

'యీ కాంట్రోవర్సీకి నీ సమాధానం ఏమిటి ? కథా రచయిత భార్యగా జవాబివ్వాలి. సినిమా చూడలేదని తప్పించుకుంటే కాదు. కావాలంటే సినిమాకు మేము తీసుకెళ్తాం.'

స్నేహితురాళ్ళు అలా పట్టుబట్టినా ఆ సినిమాను చూడలేదు. చూడాలని లేకకాదు. ఏదో బిడియం— బెరుకు— భీతి ! గోపీచంద్ దగ్గరవుండి తీసుకెళ్తే ఎంత బాగుండును ? కానీ అతని నుంచి అసలు ఏ కబురూ లేదే ?

రామారావు మామయ్యకు వుత్తరం రాసింది.

'అమ్మలూ,

భర్తకోసం నువ్వలా బెంగ పెట్టుకుంటే ఎలా ?

గోపీచంద్ గొప్పవాడు కావటానికి పునాదులు వేసుకుంటున్నాడు. నువ్వు కాస్త వోపిక పడ్తే ముందు ముందు అంతా సుఖ సంతోషాలేగా? అతడిని అక్కడికి రావాలని కోరుకొనేకన్నా మీరే యిక్కడి కొచ్చేస్తే మంచిది కదా ? ఆ ఏర్పాటు చేయమని అతనికి చెప్తాలే.'

ఇక అలాంటి వ్యక్తితో తన మనసులో మాటను ఎలా చెప్పుకోటం ? మామగారు యిదంతా కొడుకు గొప్ప కావటమే ననుకొంటున్నాడు. అత్తగారూ అంతే. వాళ్ళతో చెప్పుకొని ఏం లాభం ?

ఊరికి వెళ్లి తండ్రితో మాట్లాడివస్తే ? చాలా రోజులుగా రమ్మని రాస్తున్నారుగా ?

'మామగారూ. వొకసారి మా వూరు వెళ్లివద్దామనుకుంటున్నానండీ. రెండంటే రెండు రోజులే వుండి వస్తా.'

'అలాగే వెళ్లి రామ్మా ! అబ్బాయి ఎలాగూ లేడుగా. రెండు రోజులకేం వచ్చింది ? చదువు బాగాసాగుతుందనుకొంటే నీ యిష్టమొచ్చినన్ని రోజులుండిరామ్మా.'

ఆనందంతో ఆమెకు కళ్లల్లో నీళ్లు తిరిగేయి.

ధనం లేకపోతేనేం ? వాళ్ల మంచితనం చాలదూ ?

ఆ ఆప్యాయతను ఎంత డబ్బిచ్చి కొనుక్కోటం సాధ్యమా ?

భర్తే అనుకొంటే అత్తమామలు ... ఆడబిడ్డ మరిదీ ... అంతా మంచివారే. తనెంత అదృష్టవంతురాలు. కానీ ...

'వదినా ! అన్నయ్య ఆఫీసు వాళ్లట. వచ్చారు.'

'ఆఫీసువాళ్లా ? ఆయన విషయం ఏమన్నా తెలుస్తుందా ?'

మొత్తం నలుగురొచ్చారు. కూర్చోమని మర్యాద చేసింది లోచన. అల్లంత దూరంలో మామగారు, అత్తగారు, పిల్లలు ...

'గోపీచంద్ కథ, డైలాగులు రాసిన సినిమా చూచామండీ. చాలా బాగుంది.'

యిది చెప్పటానికా వచ్చారు వాళ్లు ?

'బాగుందికదా బాబూ. ఆ మాట లోకమంతా కోడై కూస్తోంది గదా ? అయినా నేను ఆ సినిమా చూడలేదు. గోపాలంగాడి అమ్మ చూడ్లేదు. భార్యకూడా చూడలేదుట ! ఎంత చిత్రంగా వుందో చూడండి.'

'సరేలేవయ్యా. నీకు నోరూరుకోదు. కోడలు యివాళ అందర్నీ తీసుకెళ్తానందిగా ? యింకా ఎందుకా కొరత మాటలు ?' సుశెమ్మ భర్తను మందలించింది.

'గోపీచంద్ ఆఫీసులో కూడా మంచిపనివాడు. నిజాయతీపరుడు. అతనంటే ఆఫీసులో అందరికీ అభిమానముంది. అందుకే మీతో స్వయంగా వో విషయం చెప్పిపోదామని వచ్చాము' వొక పెద్దాయన అన్నాడు.

'గోపీచంద్ నాలుగు రోజులు కాజ్యువల్ లీవ్ కావాలంటూ అప్పుడు కాగితంపెట్టి వెళ్లటమే. మళ్లీ వొక్కసారి కూడా ఆఫీసు మొహం చూడలేదు. మొదట్లో లీవ్ ఎక్స్‌టెండ్ చేస్తూ రెండుసార్లు వుత్తరాలు రాసేడు. ఆ తర్వాత అదీలేదు. మేమే అతనిచ్చిన లీవ్ అడ్రస్‌కు వుత్తరాలు రాసేం. రాయంగా రాయంగా లీవ్ కాలాన్ని పొడిగిస్తూ మళ్లీ వుత్తరం రాసేడు. యింతవరకు మాకు చాతనయిన సహాయాన్ని అతను అడగకుండానే అతనిపైగల అభిమానం కొద్దీ చేసేము. యీ మధ్య కొత్త ఆఫీసర్‌గారు వచ్చారు. ఆయన కసలే రచయితలన్నా, సినిమాలు నాటకాలన్నా ఎలెర్జీ. ఆయన గోపీచంద్ విషయంలో మడతపేచీలు పెడ్తున్నాడు. నోటీస్ యిచ్చి వుద్యోగంలో నుంచి తీసెయ్యాలని ఆయన ఆలోచన. గోపీచంద్ కుటుంబ స్థితి మాకు తెల్సు. అందుకని మీకోసారి యీ విషయం చెప్పిపోదామని వచ్చాము.'

'ఆయనదగ్గరినుంచి నాకుగాని, మా మామగారికి గాని పెద్దగా వుత్తరాలు లేవండీ. ఆయన అక్కడ బిజీగా వుండి వుంటారను కొంటాను. యిప్పుడు మమ్మల్నేంచేయమని మీ సలహా ?'

'అమ్మా పెద్దవాడిని. మీ శ్రేయస్సుకోరి సలహా యిస్తున్నాను రచయితగా గోపీచంద్‌కు యివాళ పేరు రావచ్చు, రేపు కాస్త డబ్బు సంపాదించవచ్చు. కానీ జీవితం చాలా దీర్ఘమైనదమ్మా. చాల విలువైనది. సినిమాల్లో పేరు, సంపాదించిన ధనం క్షణికాలు. అతన వుద్యోగాన్ని వదులుకోటం మాకిష్టంలేదు. ముందు ముందు ఉద్యోగం కావాలంటే దొరకదు కదా ? సినిమా హీరోలకే అక్కడ సెక్యూరిటి లేదు. రచయితలకేం వుంటుంది ? కనుక అతను వుద్యోగంలో జాయినై కొంతకాలం పనిచేసి మళ్లీ శెలవుపెట్టి వెళ్తే మంచిది. అతన దగ్గరుంటే ఆఫీసరు కూడా కాస్త శాంతిస్తాడు. మేంకూడా చెప్తాము. 'ప్రమైక్యం' అన్నట్లు సినిమా ప్రపంచంలో మునిగిపోయి వుద్యోగాన్ని, కుటుంబాన్ని మర్చిపోతే ఎలా ? గోపీచంద్ అసలు అలాంటివాడుకాదు. సినిమాలే చూచేవాడుకాదు— మేం ఎంత బలవంతంచేసినా. మరి అతనికీ పిచ్చి హఠాత్తుగా ఎలా పట్టుకొందో ? మీరు మేం యిలా చెప్పేమని రాయండి. వో పక్షం లోపల అతను రాకపోతే మేం అసహాయులమై పోతాము. ఆ తర్వాత మీరు మమ్మల్ని నిందించకండి. శెలవ్.'

'థేంక్సండీ. ఆయనకు వుత్తరం రాస్తాను. మీ అభిమానానికి కృతజ్ఞతలు.'

వాళ్లు వెళ్లిపోయారు.



'బోడి వుద్యోగం ? గోపాళం గొప్పవాడవుతాడు. పేరు డబ్బు సంపాదిస్తాడు. అప్పుడు వాడికీ వుద్యోగం వో లెక్కా ? వాళ్ల పిచ్చిగాని నా కొడుక్కేంపట్టిందా గుమాస్తా వుద్యోగం చెయ్యటం.'

'అలా అనకండి మామయ్యా. వాళ్లెంతో మంచివారు కనుక యింత దూరంవచ్చి సలహా యిచ్చివెళ్లేరు. సినిమా ప్రపంచం మనుష్యుల్ని క్షణంలో గొప్పవాళ్లను చేస్తుంది. క్షణంలో ఎందుకూ పనికిరానివాళ్లనుగా మారుస్తుంది. ఆయన దాన్ని నమ్ముకొని వుద్యోగం వదులుకోటం మంచిది కాదని నా వుద్దేశం.'

'నా ఉద్దేశమూ అదే వదినా.'

అంతా వులిక్కిపడి చూచారు. కృష్ణమూర్తి ! అడిగిన సినిమాను గురించి అభిప్రాయం చెప్పని కృష్ణమూర్తి.

సులోచన తప్ప ఎవరూ అతని అభిప్రాయాన్ని గుర్తించలేదు.

సాయంకాలం అయ్యింది. సినిమాకు బయలుదేరుతూ కృష్ణమూర్తినీ రమ్మన్నారు రానన్నాడు అతను.

ఆశ్చర్యపోయింది సులోచన !

'ఏమయ్యా కృష్ణా ? అంతా కల్సి సినిమాకు పోదామంటే నువ్వు రానంటున్నావు ?'

'నేను చూచాను వదినా. ఇంటికి కాపలా వుంటాను.'

'రమాలు అక్క అన్న మాటలకు కోపం వచ్చిందా ?''

'లేదు వదినా. నేను చూచానంటున్నానుగా ?'

'రమాలు కూడా చూచింది కదా ? చాలామంది నా స్నేహితురాళ్లుకూడా రెండు మూడుసార్లు చూచారు. నీకు బాగా లేదా ?'

'బాగుంది వదినా. కానీ అది మా అన్న రాసిన కథ కాదు. అందులో డైలాగులు మా అన్నయ్యే రాయాల్సినవి కావు. నేనలాంటి 'హిపోక్రసీ'ని సహించలేను వదినా. నేను కాంతారావుగారి సమీక్షతో ఏకీభవిస్తాను. మా అన్నయ్య రాసిన నవల 'నెత్తురుకూడు' అంటే చాలా గౌరవం వదినా. రెండోసారి కూడా సినిమానుచూచి ఆ గౌరవాన్ని పూర్తిగా కోల్పోను. మా అన్నయ్యంటే నాకు ప్రేమ. మరోసారి ఆయన సినిమా చూస్తే ఆయనపట్ల ద్వేషాన్ని పెంచుకోవల్సి వస్తుంది. మీరు వెళ్లిరండి.'

సినిమా చూస్తున్నంతసేపు సులోచనకు భర్త గుర్తుకురాలేదు. కృష్ణమూర్తి మాటలే గుర్తుకొచ్చాయి !

## 11

'ట్రింగ్... ట్రింగ్...'

సీరియస్‌గా రాస్తున్న గోపీచంద్ ఆ ఫోను మోతకు మొహాన్ని అసహనంగా చిట్లించాడు. అంతలోనే నవ్వును మొహంలో పులుముకొన్నాడు.

ఆ ఫోను ఎలాంటిదో ? ఎక్కడినుంచో ?

పాత బుకింగ్ వాళ్లు స్క్రిప్టు కావాలని తొందరపెట్టేదేతే కానక్కర్లేదుగా ? కొత్త-బుకింగ్ కావచ్చుగా ?

ఎలాంటి కాల్ అయినా తన పేరు ప్రఖ్యాతులు, అభివృద్ధికి, ఆ ఫోన్‌కాల్స్ పైనే ఆధారపడి వుంది. ఇవాళ ఎక్కువ 'కాల్స్' వస్తున్నాయని విసుక్కొంటే రేపు కాల్స్ కావాలన్నా రాకపోవచ్చు.

ఫోన్ ఎత్తేడు. ఎత్తుతూ టీపాయ్‌మీదనున్న సిగరెట్ పేకెట్ తీసి ఆఖరి సిగరెట్టును వెలిగించాడు. బజర్ నొక్కి హోటల్‌బాయ్‌ని పిల్చి అతనొచ్చాక మరో రెండు సిగరెట్ పేకెట్స్‌కు ఆర్డరిచ్చాడు.

'హలో... గోపీచంద్ — స్క్రిప్ట్ రైటర్ హియర్...' రివాల్వింగ్ ఛైర్‌లో రిలేక్స్ అవుతూ అన్నాడు.

'సర్. మీతో డైరెక్టర్ శ్రీమన్నారాయణగారు మాట్లాడుతారుట. పిలుస్తాను.'

'పిలవండి. క్విక్ ... '

శ్రీమన్నారాయణ !

అతడి బుద్ధి ఎలాంటిదో, సత్తా ఎంతో మొదటి పిక్చర్ అనుభవాల ద్వారానే తెలిసింది.

ఆలోచనలు చెప్పేది తను. సీన్ డిస్క్రైబ్ చేసేది తను. డైలాగులు రాసేదీ తనే. షాట్ వైజ్ డివిజన్స్ అన్నీ చేసి పెట్టేది అసోసియేట్ డైరెక్టర్. కానీ పేరంతా కొట్టేయాలన్న తపన. తనేదో పెద్ద గొప్పవాడైనట్లు పోజు !

తన కథను తనే మార్చేడు !

కానీ అతనేం చేసేడు ! 'మూలకథ' అంటూ తన పేరు వేసి 'చిత్రానువాదం' అంటూ తన పేరు వేసుకొన్నాడు. స్క్రీన్‌ప్లే తయారుచేసే డిస్కషన్‌లో తనూ పాల్గొన్నాడు. ఆ మాటకొస్తే తన కాంట్రిబ్యూషన్ జాస్తి. అయినా తన పేరే వేసుకొన్నాడు.

అతనికి స్వయం ప్రతిభ రవ్వంతకూడా లేదు. యితరుల ప్రతిభను వుపయోగించుకోటం బాగా తెల్సు. ఎంగిలి మెతుకుల్ని ఏరి కొత్త పాకాన్ని చేయటంలో ఎక్స్‌పర్ట్ !

'మిస్టర్ గోపీచంద్. మా నెక్స్ట్ పిక్చర్‌క్కూడా కథ, మాటలూ మీదే. మీకు అసలు సినిమా మీడియం తెలిసివుంటే మంచిదనుకొంటాను. షూటింగ్‌లో మీరెందుకు పార్టిసిపేట్ చేయకూడదు. నాకు హెల్ప్ చేసినట్లుంది. మీరు నేర్చుకొన్నట్లూ వుంటుంది '

పని చేయించుకొన్నాడు కానీ, వొక్క విషయం తనుగా నేర్పలేదు. సినిమా ప్రపంచంలో ఎవరూ ఏమీ నేర్పరు. ఎవరికివారు అనుభవం ద్వారా నేర్చుకోవాల్సిందే. ఆ తర్వాత ట్రైల్ బై ఎర్రర్ టెక్నిక్ ! విజయం వరిస్తే వాడు గొప్ప. అపజయం వరిస్తే అనుభవ లోపం.

షూటింగ్‌లోనేకాదు. డబ్బింగ్ థియేటర్‌లోకూడా తనని వుచితంగా వుపయోగించుకొన్నాడు శ్రీమన్నారాయణ.

చివరికి రచయితగా రావల్సిన డబ్బుకూడా పూర్తిగా యిప్పించలేకపోయాడు.

అతనికోసం ఎక్కడెక్కడి నుంచో తెప్పించి ప్రత్యేకంగా సినిమాలుకూడా వేసి చూపించాడు ప్రొడ్యూసర్. కానీ ప్రొడక్షన్ ఆఫీసులోనే వో రూము మకాంగా యిచ్చాడు.

'ఏమిటి సార్ ? యిక్కడ కూర్చొని రాస్తే మంచి డైలాగులు పలకవు సార్. మీకన్నా తక్కువ రైటర్స్ బ్రహ్మాండమైన 'హోటల్ రూమ్స్' డిమేండ్ చేస్తున్నారు. సినిమా ప్రపంచంలో మంచితనానికి విలువలేదు సార్. మీతో పని వున్నప్పుడే మీ విలువను పెంచుకోవాలి విలువ వున్నవారికే విలువ యిచ్చే ఫీల్డ్ సర్ యిది. ప్రతిభకు కొలమానం మీ విలువ. మీ విలువకు కొలత మీతో అవతలవాడికున్న అవసరం. అవసరం పెరిగేకొద్దీ మీ డిమేండ్ పెరుగుతుంది. మీ డిమేండ్ పెరిగేకొద్దీ మీ రెమ్యూనరేషన్ పెంచుకోవాలి. అవసరాలు పెంచు

# దాగుడు మూతలం

కోవాలి. బిజీగా వున్నట్లు నటించాలి. ఇవన్నీ యిక్కడ రూల్సులు. ఇలా ఎక్కడికక్కడ సర్దుకోబోతుంటే మీ విలువ పెరుగదుసార్. ఎక్స్ప్లాయిట్ చేస్తూనేవుంటారు' ఎక్కిరాని వో అనుభవజ్ఞుడైన అసిస్టెంట్ డైరెక్టర్ హితబోధ చేసే డొకరోజు.

'మా రైటర్‌గారు సిగరెట్లు కూడా తాగరు' అన్నాడోరోజు ప్రొడ్యూసర్ ఎవరికో అతడిని పరిచయం చేస్తూ.

'అంత పనికిమాలినవాడు' అన్నట్లు ధ్వనించిందా మాట గోపీచంద్‌కు.

'ఎందుకు తాగను ? కానీ కొంచెం కాస్ట్లీ సిగరెట్స్ తప్ప కాల్చను. మీరు తెప్పించండి. కాలుస్తానో లేదో చూద్దురుగాని.'

అలా సిగరెట్టు అలవాటు చేసుకొన్నాడు.

ముఖ్యమైన సీన్స్ నాలుగింటిని కావాలని డల్‌గా రాసేసరికి వాళ్లదగ్గరికి కదిలివచ్చాడు ప్రొడ్యూసర్.

'యిక్కడ నాకు మూడ్ కుదరటంలేదండీ ఎందుకో ?'

'పోనీ నాలుగురోజులు మంచి హోటల్ ఎరేంజ్ చేయమంటారా ?'

'నాలుగురోజుల భాగ్యానికైతే వద్దులెండి. పర్మనెంట్‌గా అయితే ఎరేంజ్ చేయండి. అదీ మంచి హోటల్‌కైతేనే ?'

అలా ఖరీదైన హోటల్‌కు మారేడు.

షూటింగ్ పూర్తయింది. రషెస్ చూచినవాళ్లల్లా కథను డైలాగుల్ని ప్రత్యేకంగా మెచ్చుకోసాగేరు.

సినిమా రిలీజ్ అయి వారం తిరగకుండానే నాలుగు పిక్చర్స్‌కు బుక్ అయ్యాడు. హోటల్‌లో గది పర్మనెంట్ అయింది.

పేరు ... పేరు ... పేరు ...

ప్రఖ్యాతి ... ప్రఖ్యాతి ... ప్రఖ్యాతి ...

డబ్బు ... సుఖాలు ... భోగాలు ... డబ్బు ...

మొదటి పిక్చర్‌లో పూర్తిగా భాగం వుంది. ఆ తర్వాత నాలుగు పిక్చర్స్‌కి స్టోరీ డిస్కషన్ సెట్టింగ్స్‌లో పాల్గొన్నాడు.

ఇప్పుడు అతనికంత టైమ్‌లేదు. సీనిక్ ఆర్డర్ యిస్తే డైలాగ్స్ రాసిచ్చేస్తాడు.

'మిస్టర్ గోపీచంద్. నెత్తురుకూడు ప్రొడ్యూసర్‌గారు మరో పిక్చర్ తలపెట్టేడు. మన పిక్చర్ సక్సెస్ అయిందిగా ? మనం స్టోరీ మీద కూర్చోవాలి' శ్రీమన్నారాయణ అన్నాడు ఫోనులో.

'స్టోరీ ఏమైనా అనుకొన్నారా సార్ ?'

'నేను అనుకొనేదేమిటి ? మా రైటర్‌వి నువ్వుండగా ? యీసారి స్టోరీ, డైలాగులు కంప్లీట్‌గా నీవే.'

'థేంక్యూ సార్. కానీ నాషెడ్యూల్ చూచి టైం ఎప్పుడు వీలుండేది చెప్తాను –'

'అంత బిజీ అయిపోయావా ? చాలా సంతోషం.'

పైకి సంతోషం అంటున్నాడు. కానీ కుళ్లుతున్నాడు మనసులో.

తనకిప్పుడు ఎన్ని పిక్చర్లు వుందీ తెలీకే స్టోరీ డిసకషన్‌కు రమ్మని అడుగుతున్నాడా ? వెంకటాయి వేషాలు అన్నీ. ఎవరికి తెలీదు ?

'అంతా మీ దయసార్. మీ ఆశీస్సుల ప్రభావం. ఆన్‌హేండ్ పది పిక్చర్లకు వర్క్ చేస్తున్నాను సర్. ఆరు పిక్చర్లకు రాసిచ్చేసేను. అందులో రెండు పిక్చర్లు రిలీజ్ అయ్యాయి కదా సార్ ? మీ దయవల్ల సక్సెస్ అయ్యాయి ఆ రెండూ కూడా. మిగతా వాటిలో రెండు రిలీజ్‌కు సిద్ధంగా వున్నాయి. సర్. మళ్లీ వో అరగంటలో ఫోను చేస్తాను సర్.'

'అరగంటలోనా? నేను వేరే పనిమీద వెళ్తున్నానే? ప్రొడ్యూసర్‌ని ఫోను చేయమంటాను. అతనికి చెప్పు. నేను మళ్ళీ తిరిగ్గా ఫోన్ చేస్తాను. ఏం ?'

'అలాగే సర్. థేంక్యూ. మీ ఆశీస్సులు కావాలి ఎప్పుడూ.'

ఫోన్ పెట్టేసి గర్వంగా నవ్వుకొన్నాడు గోపీచంద్,

'ఫోన్ చెయ్యనీ. ప్రొడ్యూసర్ దగ్గర వడ్డీతోసహా వసూలు చేస్తాను'అనుకొన్నాడు.

పెన్ను చేతికందుకోబోతుంటే కాలింగ్ బెల్ శబ్దం విన్పించింది. 'కమిన్.'

బాయ్ 'పోస్ట్' తెచ్చిపెట్టేడు.

చాలావరకు ఫేన్‌మెయిల్ వుంటుంది పోస్ట్‌లో. మామూలే !

మళ్లీ రివాల్వింగ్ ఛెయిర్‌లో 'రిలేక్స్' అయి 'బాయ్' వాకో కవరు చించి యిస్తుంటే చూచి అవతల పెడుతున్నాడు

ఆ ఫేన్స్ రాసే ఉత్తరాలు చూస్తుంటే నవ్వొస్తుందతనికి.

అతను ఎన్నో నవలలు, కథలు రాసేడు. ఎంతో ఆలోచించి ఎన్నో జాగ్రత్తలు తీసుకొని, వో ప్రయోజనాన్ని, ధ్యేయాన్ని ఆశించి రాసేడు. కానీ అవి చదివి యిలా వుత్తరాలు రాయలేదెవ్వరూ– కానీ యిప్పుడు, సినిమా రచయితగా పేరొచ్చిన, ఆ నవలలు, కథలు చదివి పొగుడుతూ వుత్తరాలు రాస్తున్నారు.

ప్రతిభనుబట్టి పేరొస్తుందా ? పేరునుబట్టి ప్రతిభకు గుర్తింపు వస్తుందా ?

ప్రతిభను బట్టి పేరు రావడం సహజం. కానీ పేరును పాప్యులారిటీని బట్టి ప్రతిభ గుర్తింపబడే కాలం వచ్చింది.

(ఇంకా వుంది)

# కొత్తది

## అద్వితీయ శక్తిదాయక పానీయం.
## జిల్లనిపించే నారింజ రుచిగలది!





విటమిన్-సీ తో
పరిపుష్టమైనది.

గ్లూకోజ్ చేరిన కొత్త గ్లూకోన్-సి. మీ బిడ్డను ఉరుకుల పరుగుల ఉత్సాహంతో నింపి ఉంచే, అనుకూల మైన సత్వర శక్తిదాయక ఆహారం.

ఇది, పిల్లలలో పళ్లు, ఎముకలు, శరీర ధాతువుల పెంపుదలకు అత్యవసర మైన విటమిన్ సితో పరిపుష్టమైనది.

ఒక గ్లాసు చల్లని ఐస్ వాటర్‌లో నాలుగు టీ స్పూన్ల గ్లూకోన్-సి కరిగించి, జిల్లనిపించే నారింజ రుచిగల ఉల్లాస పానీయాన్ని తయారుచేయండి, రోజుకు రెండుసార్లు మీ బిడ్డకివ్వండి.






# గ్లూకోన్-సి

GLL-1174

# శరీరములోని బాధలన్నిటికీ పూర్తి ప్రథమ చికిత్స













**ఝండూ బామ్**

తలనొప్పి, జలుబు, కండరాల నొప్పి, కీళ్ల నొప్పి, కండరాల బిగింపుల నుండి ఉపశమనం ఇస్తుంది. నొప్పి ఎలాంటిదైనా సరే మీరు విశ్వసించదగ్గది ఝండు బామ్.




# ఝండూ బామ్